THE LARGEST CIRCULATED TELUGU MONTHLY

# చతుర

సెప్టెంబర్ 1998 * రూ. 7/-



నాగతిహళ్లి చంద్రశేఖర్

## తేనెజాబిలి

# చతురత ప్రపంచం

## హర్షదాయక ఆదాయం

'కోటి విద్యలూ కూటికొరకే' అన్న మాట ఎప్పటిదోగానీ ఈ రోజుల్లో కూడా కాటికెళ్ళేవరకూ కూడా ప్రతి మనిషీ కూటికి సంపాదించుకోవల్సిందే. పూర్వం కుటుంబంలో ఓ వ్యక్తి అందర్నీ పోషిస్తే మిగిలిన సభ్యులు కడుపు నిండా తినేవారు. ఇప్పుడలాంటి కుటుంబాలు తక్కువే. ధరలు ఆకాశాన్నంటుతున్న ఈ రోజుల్లో ఎన్నో కుటుంబాల్లో స్త్రీలు కూడా ఉద్యోగాలు చేస్తున్నారు. చదువుకోని స్త్రీలయితే చిన్నచిన్న వ్యాపారాలయినా చేసి డబ్బు సంపాదించుకుంటున్నారు.

"ఈ పెరుగుతున్న ధరల్లో మధ్యతరగతి కుటుంబాలు ఎలా బతగ్గలుగుతున్నాయి?" అన్న విషయం మీద ఆమధ్య ఓ సర్వే జరిగింది. ఆ సర్వేలో కొన్ని కుటుంబాలకి సంబంధించిన వివరాలిలా వున్నాయి.

ఒకాయన తన జీతం గృహావసరాలకి చాలడంలేదని కాఫీపొడి తయారుచేసి అమ్మే ఓ సైడ్ బిజినెస్‌ను ఎన్నుకొన్నాడు. దానికి పెద్దగా పెట్టుబడి అవసరం లేదంటున్నాడాయన. ముందుగా ఆయన తమ కాలనీలో వున్న ఇళ్ళన్నీ తిరిగి తలా 25 గ్రాముల కాఫీపొడి పాకెట్లను ఉచితంగా ఇచ్చి రుచి చూడమనీ వారు చెప్పేదాన్నిబట్టి వారివారి రుచులకనుగుణంగా మంచి కాఫీ పొడిని తయారుచేసి సప్లయ్ చేస్తాననీ చెప్పి వారిని ఆకట్టుకున్నాడు. అన్నట్టుగానే వారి ఇష్టాలననుసరించి కాఫీ చికరీలను కలిపి రకరకాలుగా ఎవరికి కావలసినట్టు వాళ్ళకి మార్చి తయారుచేసి ఇంటికి వెళ్ళి అందజేస్తున్నాడు. క్రమేపీ టీ, బిస్కట్స్, అప్పడాలు, వడియాలు, ఊరగాయలను కూడా తన వ్యాపారానికి అదనంగా చేర్చుకుని అటు జీతం ఇటు వ్యాపారంలో వచ్చే అదనపు ఆదాయంతో హాయిగా వుంటున్నామంటున్నాడు.

సింగ్ అనే వ్యక్తి పరిమళాలు వెదజల్లే అగరబత్తీల్తో ఆదివారం ఉదయం ప్రత్యక్షమవుతాడు ఇంటింటా. బెంగుళూరు హిందుస్థాన్ ఎయిరోనాటిక్స్‌లో ఉద్యోగం చేస్తున్న ఈయన ముగ్గురు పిల్లలు, భార్య గల తన




సంసారానికి వచ్చే జీతం చాలక ఈ పని ఎన్నుకుంటున్నానన్నాడు. షాపులకు కూడా అగరవత్తులు, కర్పూరం మొదలయినవి సప్లయి చేస్తాడితను. ఈ వ్యాపారంతో ప్రస్తుతం తమ సంసారం సుఖంగా నడుస్తోంద ంటాడాయన.

'కత్తెర' నా జీవనాధారం అంటాడు మరొకాయన. జేబులు కత్తిరించడం కాదుగానీ తీరిక సమయాల్లో తన అన్నగారి హెయిర్‌కటింగ్ సెలూన్‌లో కూర్చుని కటింగ్ పనిలో అన్నకి సాయపడి కొంత డబ్బు సంపాదిస్తాడు. స్కూలు టీచర్‌గా ఉద్యోగం చేస్తున్న

కవర్ పేజీ చిత్రకారుడు : ద్రోణాదుల గోవిందరాజులు

నీకు 'ఇదేంపనయ్యా' అని కొందరు హేళన చేశారుగానీ, కులవిద్యగా నా కొచ్చిన విద్యతో నేను నాలుగు డబ్బులు అదనంగా సంపాదించుకోవడంలో తప్పేముందనే నమ్మకంతో ఎవరి మాటా పట్టించుకోనని చెప్పాడతను.

భర్తకు దొరికే జీతంతో నిత్యావసర వస్తువులకే కష్టమయిపోతుంటే అతని వ్యసనాలతో మరింత కుంగిపోయిన అతని భార్య ధైర్యం తెచ్చుకుని తనకున్న కొద్దిపాటి చదువుతో చిన్న ప్రైవేట్ స్కూల్లో టీచరుగా చేరింది. ఉదయం 10 గంటలనుంచి మధ్యాన్నం రెండువరకు స్కూలు పనీ, అటుపైన తన ఇంటిపక్కనే వున్న బ్యాంకు ఉద్యోగులకి కాఫీ, టీలు సప్లయ్ చేయటం ఆమె పని. ఉదయం 9 గంటలకు స్కూలుకి వెళ్ళేముందు 25 కప్పులు, మధ్యాహ్నం స్కూలు నుంచి వచ్చాక 3 గంటలకి మరో 25 కప్పుల కాఫీని బ్యాంకుకు పంపిస్తుందామె. ఈ విషయం తన భర్తకి తెలియదనీ, ఉదయం 6 గం॥లకి బయటకెళ్ళిన భర్త సాయంత్రం చాలా ఆలస్యంగా వస్తాడనీ, అందుకే తానీ పనులు చెయ్యగలుగుతున్నాననీ అంటుందామె.

మరో మహిళ భర్త ఇంజనీరే అయినా బొంబేలాంటి నగరంలో అతని సంపాదన ఎంతమాత్రం చాలదు కాబట్టి తానూ సంపాదిస్తున్నానంది. ఉదయం రెండు గంటలపాటు 5 గురు పిల్లలకి ట్యూషన్ తీసుకోవడం, షాపులనుంచి చీరలను తెచ్చి ఎంబ్రాయిడరీ చేసివ్వడం, నలుగురు పిల్లల్తో క్రెచ్ పెట్టుకుని వారి తల్లితండ్రులు ఆఫీసులనుంచి వచ్చేవరకూ చూసి అప్పగించడం, ఇదికాక బిస్కట్లు, కేక్‌లలాంటివి చేసి షాపులకి అమ్మడం, ఖాళీ సమయాల్లో టీవీ చూస్తూనే స్వెట్టర్లు అల్లి అమ్మడం వగైరా ఎన్నో పనులతో అసలు తీరికే వుండదని వాపోయిందా మహిళ. అయితే ఇందులో ఏ ఒక్కటి మానినా ఖరీదైన ఈ మహానగరంలో ఖర్చులకు ఇబ్బందేనందామె. బొంబాయిలో కాబట్టి ఈ పనులన్నీ ఇంత నిర్భయంగా చేయగలుగుతున్నానంటోందావిడ.

మరో స్త్రీ ఏమీ చదువుకోకపోయినా భర్తకి చేదోడువాదోడుగా వుండటానికి పిల్లలని మంచి స్కూళ్ళల్లో చదివించడానికీ తాను కూడా కష్టపడక తప్పదనుకుని ఇడ్లీల వ్యాపారాన్ని ప్రారంభించింది. రుచిగా శుచిగా వుండే ఆవిడ ఇడ్లీల వ్యాపారం మూడు పువ్వులు ఆరుకాయలై పెద్ద బిజినెస్‌గా మారిందంటుందావిడ. దాంతో పిల్లలు మంచి స్కూళ్లలో చదువుకోగలుగుతున్నారని ఆనందిస్తోందామె.

రైల్వేలో క్లర్క్‌గా పనిచేస్తున్న ఒకాయన చిన్నప్పటినుంచీ ఎలక్ట్రికల్ పనులు ఉత్సాహంగా నేర్చుకున్నాడు. అది ఇప్పుడతనికి అదనపు సంపాదనా మార్గంగా మారింది. ఉదయం, సాయంత్రం, ఆదివారం ఆ కాలనీలోనివారు ఎలక్ట్రిసిటీకి సంబంధించిన ఏ పనికైనా రావునే పిలుస్తారు.

బి.యస్సీ చదివిన ఒకతను గవర్నమెంట్ ఉద్యోగంకోసం ఎంతో ప్రయత్నించి అది రాక డాక్టరు వద్ద కాంపౌండరుగా చేరాడు. ఆ సమయంలో అతను రకరకాల మందులు, ఇంజక్షన్లు, వాటి ఉపయోగాలు, ఉపయోగించడంలోని మెళుకువలు అన్నీ నేర్చుకున్నాడు. ఆ దశలో అనుకోకుండా అతడు కోరుకున్న ప్రభుత్వోద్యోగం వచ్చింది. అది చేస్తూనే ఇంటివద్ద చిన్న డిస్పెన్సరీ పెట్టుకుని ఆర్.యం.పిగా చిన్నచిన్న రోగాలకు మందులిస్తూ సంపాదిస్తున్నాడు.

స్కూలు టీచరుగా పనిచేస్తున్న ఒకాయన పిల్లలకి ట్యూషన్లు చెప్పడంతోపాటు రాత్రిళ్ళు పోస్టాఫీసులో టెలిగ్రాఫ్ సెక్షన్ చూసుకునేవాడు. అలా రాత్రీపగలూ కష్టపడినా అతనిలో అలుపు కనిపించేది కాదు. సంతృప్తికరమైన సంపాదనతో కష్టాన్ని మరిచిపోతాడు మనిషి.




ఇవన్నీ చూస్తే ఏది ముఖ్యమైన సంపాదన ఏది అదనపు సంపాదన అనేది చెప్పడం కష్టం. ఎవరికీ హాని కలుగచేయని పనివల్ల వచ్చే ఆదాయం ఎప్పుడూ హర్షదాయకమేగదా!

---

## 100 అంతస్థుల టవర్

పారిస్ నగరం అనగానే మొదట గుర్తుకు వచ్చే ఈఫిల్ టవర్‌కి 1989 మార్చి 31 నాటికి నూరేళ్ళు నిండాయి. 1055 అడుగుల ఎత్తున్న ఈ 'ఆకాశ నిచ్చెన' ప్రపంచంలోని ఎత్తయిన ఉక్కు టవర్. ఒకో కాలు 31 చదరపు గజాల వైశాల్యం ఆక్రమిస్తుంది. అలాంటి నాలుగు కాళ్ల 590 అడుగుల ఎత్తున రెండో అంతస్తులో కలుసుకుంటాయి. టవర్ మొత్తం బరువు 11,000




టన్నులు.

ఈఫిల్ టవర్‌కి ఒకసారి పెయింట్‌తో రంగు వెయ్యడానికి ఆరువేల గాలన్ల పెయింటు అవసరం అవుతుంది. కట్టిన దగ్గర్నుంచీ ఏడేళ్ళకొకమారు అలా పెయింట్ వేస్తూనే ఉన్నారు. ఏటా ఈఫిల్ టవర్‌ని దర్శించడానికి ప్రపంచం నలుమూలలనుంచి దాదాపు 35 లక్షల మంది యాత్రికులు వస్తుంటారు. ఇది మొత్తం ఉక్కుతో నిర్మించబడింది. దాని నిర్మాణానికి 200 మంది తొమ్మిది సంవత్సరాలు పనిచేశారు.

పారిస్ నగరంలో 1889లో జరిగిన ప్రపంచ ప్రదర్శనకోసం 1880లోనే టవర్ పని ప్రారంభించారు. ఉక్కు స్తంభాలను రివెట్లతో కలిపి తయారుచేసారు. ఈఫిల్ టవర్ నిర్మాణానికి 10,50,8466 రివెట్లు, 18038 ఇనప స్థంభాలు వాడారు. వాటిలో ఏదీ నేటివరకూ చెక్కుచెదరలేదు.

టవర్ పైనుంచి పారిస్ నగరం అంతా కనిపిస్తుంది. ఒక కవి దీనిని స్వర్గానికి నిచ్చెనతో పోల్చాడు. అతడన్నట్లే దాదాపు నాలుగు వందలమంది టవర్ పైనుంచి దూకి ఆత్మహత్యలు చేసుకుని నిజంగానే పైకి చేరుకున్నారు. ఈఫిల్ టవర్‌ని అధిరోహించడంలో కూడా కొంతమంది కొన్ని రికార్డులు సృష్టించారు. కొంతమంది కేవలం చేతుల ఆధారంతో పైకి ఎక్కితే, కొంతమంది ఒంటికాలితో ఎక్కారు. కొంతమంది నగ్నంగా ఎక్కారు. కుక్కలు కూడా ఆ టవర్‌ను ఎక్కాయి. ఆఖరికి ఒక ఏనుగు గున్న కూడా టవర్ పైకి ఎక్కి 'శభాష్' అనిపించుకుంది.

దాని రూపురేఖలని, డిజైన్‌ని రూపొందించింది ఉక్కు కట్టడాలకి పితామహుడని పేరుగాంచిన అలెగ్జాండరు గుస్తావ్ ఈఫిల్. ప్రస్తుతం పారిస్ టెలివిజన్ ఏరియల్‌ని ఈ టవర్ పైనే కట్టడంవలన ఎక్కువదూరం టి.వి. ప్రసారాలు చూడగలుగుతున్నారు.

1884 అమెరికా స్వాతంత్ర్యం సందర్భంగా ఫ్రాన్సు ప్రజలు అమెరికాకు బహుమానంగా ఇచ్చిన లిబర్టీ స్టాట్యూ కూడా ఇతని పర్యవేక్షణలోనే తయారైంది. 91వ ఏట 1923లో కీర్తిశేషుడైనా ఈఫిల్ టవర్ ఉన్నంతకాలం కీర్తింపబడుతూనే వుంటాడు గుస్తావ్ ఈఫిల్.

# చతుర

సంపుటి : 21 సంచిక : 8 సెప్టెంబర్ : 1998

అతడు ఆమెను ప్రేమించాడు. ఆరాధించాడు. ఎర్రని మృదువైన గులాబీలలో, తెల్లని, చల్లని, స్వచ్ఛమైన తుషార బిందువుల్లో, పండు వెన్నెలను కురిపించే నిండు చందమామలో... సృష్టిలో ఆనందాన్ని, ఆహ్లాదాన్ని ఇచ్చే ప్రతి వస్తువులో... ఆమె ప్రతిబింబాన్నే చూశాడు. ఆమె అద్భుత సౌందర్యం ముందు తలవంచి ప్రేమాంజలి ఘటించాడు.

పెళ్ళికిముందు... ఇద్దరూ ఒంటరిగా వున్నప్పుడు సైతం... చిన్న స్పర్శకూడా లేదు వారిమధ్య. కేవలం భావుకతని మాత్రం ప్రదర్శించే అతని స్వభావం ఆమెని ఆశ్చర్యానికీ, అనుమానానికీ గురిచేసింది.

ఓ శుభముహూర్తాన పెళ్లయిన ఆ జంట హనీమూన్‌కి బయలుదేరింది. ఆ క్షణంనుంచీ ఆరంభమై ఉధృత ప్రవాహంలా పొంగిపొర్లే అతడి కామకేళీ విలాసాలని ఆమె తట్టుకోలేకపోయింది. హటాత్తుగా కామపిశాచిలా మారిపోయిన అతడి స్వభావానికి ఆమె ఖిన్నురాలయింది. ఆ మార్పు వెనుకగల భయంకర రహస్యం ఆమెకు తెలిసేలోగా... ఏం జరిగింది?

సున్నిత మనస్కుడైన ఆ భావుకుడు, క్రూరమృగంలా మారడం వెనుకగల కారణాలేమిటి?

ఆపకుండా చదివించే నాగతిహళ్లి చంద్రశేఖర్ కన్నడ మూలానికి రంగనాథ రామచంద్రరావు తెలుగు అనువాదం 'తేనెజాబిలి' ఈ నెల చతుర సమగ్ర నవల.



## 'తేనెజాబిలి'

-నాగతి హళ్లి చంద్రశేఖర్

# నాయకుడు

"రా చెలీ! మన తేనె జాబిలికి!!" గుండెల నిండా ఉన్న ప్రేమ చిందిస్తూ పరవశంగా అన్నాన్నేను.

"ఆతురతేల ప్రియా! ఆగుము ఆగుము..." అందామె నాటకీయంగా.

'నేను'... అంటే ఆమె భర్తని!

'ఆమె'... అంటే నా భార్య!!

అక్టోబరు రెండున మా వివాహం జరిగిందిగానీ, నా కథ అంతకుముందే రొమాంటిక్‌గా మొదలయింది. కథ మొదలవగానే పెళ్ళి, అంతలోనే "తేనె జాబిలి..." అంటే హనీమూన్ లాంటివి వుంటే ఎవరికి మాత్రం సంతోషంగా వుండదు?

కథ ముందుకు సాగినకొద్దీ ప్రేమ, సెంటిమెంట్లు, చిన్నాచితక యుద్ధాలు, సస్పెన్సు గట్రా వుంటాయనుకోండి.

ఇదేదో సినిమా కథ అనుకునేరు. అలా తేలిగ్గా ఓ నిర్ణయానికి రావద్దు. ఎన్నో జీవితాలు సినిమాలకన్నా విచిత్రంగా ఉంటాయి. నా జీవితమూ అంతే. నానా విచిత్రాలను దాటుకుని వచ్చిందది.

నా మాటలు మీకు నమ్మశక్యం కాకపోవచ్చు మిమ్మల్ని నమ్మించాలనే పట్టుదల కూడా నాకు లేదు. నా హృదయగీతాన్ని వినండి, చాలు!

ఇదొక మధురమైన పాట!

పాటకు మాధుర్యం రావాలంటే దాని భావానికి బాధను కలగలపాలి.

మీరు ప్రేమ గీతాల్నే ఆలపించండి. కాదనను. అయితే ఆ ప్రేమనంతటినీ బాధకు పణంగా పెట్టాలి. అప్పుడే జీవనపుష్పం వికసించేది!

నా దృష్టిలో ఎవరైతే సినిమాల్లోలాగా ప్రేమగీతాల్ని చైతెక్కలాడుతూ గానం చేస్తారో అలాంటి ప్రేమికులు దురదృష్టవంతులు. ఆర్భాటంతో కూడిన లయ ఉండే ప్రేమగీతాలు నిర్భాగ్యమైనవి.

హృదయగీతాలు నాభినుండి నిశ్శబ్దంగా వెలువడాలి. ప్రేవులు స్వరాలను పలికించాలి. సమస్త చైతన్యం శృతినందుకుని ఝుంకారం చేయాలి.

నా ప్రేమగీతాలు ఇలానే పుడతాయి. నా ఎదలో ప్రేమజ్యోతిని వెలిగించాలంటే నన్ను నేను కరిగించుకుంటాను. ఏదో అవ్యక్తమైన బాధ అక్షరాల రూపం దాల్చి భావమవుతుంది. ఆ భావం ధారగా ప్రవహిస్తుంది.

ఈ ధారయెక్క జలపాతమే నా ద్వారా "రా చెలీ, తేనె జాబిలికీ!" అంటూ కవితామయంగా గానం చేయించింది. నా ఈ పిలుపుకి నక్షత్రాలు వంతపాడాయి. నా ఈ ఆహ్వానానికి లోకంలోని ప్రకృతి అంతా అసూయపడింది.

"రా చెలీ, తేనె జాబిలికి!" అని నా ప్రియురాలిని ఆహ్వానించే సమయానికి మానసికంగా బాగా అలసిపోయాను. అయితే జీవన మాధుర్యాన్ని అణువణువూ ఆస్వాదించటమే నా ఈ హనీమూన్ లక్ష్యం! ఆ మహత్వాకాంక్షను తీర్చుకోవటానికి కట్టుకున్నామె దగ్గర నీళ్ళు నమలటానికి సైతం సిద్ధమయ్యాను. నాలో ఇంతటి దైన్యం వుందని ఇంతవరకు నాకే తెలియదు.

ఈ పాడు బలహీనత ఎక్కడ్నించి పుట్టుకొచ్చింది. ఎన్నడూ ఎవరినీ దేనికీ యాచించినవాడినే కాను. ప్రాధేయపడటమనేది నా జ్ఞాపకంలో లేనేలేదు. మరి ఇది నా దౌర్బల్యం కాకపోతే మరేమిటి?

నేను ఒకేసారి నీరయ్యాను. నిప్పునూ అయ్యాను. ఏ భయం నన్ను నీరుగా ర్చింది? ఏకోరిక నాలో నిప్పును రగిల్చింది.

ఈ ప్రశ్నలకు సమాధానం ఇప్పుడు చెప్పలేను.





ఇప్పుడు నా ధ్యాస అంతా హనీమూన్ మీదే కేంద్రీకృతమై వుంది. క్షణక్షణం ఆ ఆలోచనలతో వేడెక్కిపోయే అయాచిత సంభ్రమం నాలో నిండివుంది.

నిజానికి ఈ హనీమూన్ గురించిన ప్రణాళికలు పెళ్ళికి ముందురోజునుంచే నాలో మెరపులా మెరిసి నలుదిక్కులా ప్రకాశించటం మొదలెట్టాయి. ప్రకాశవంతమైన ఆ వెలుగులోనే నేను జీవితసత్యాన్ని కనుగొన్నాను. జీవితపు సార్థకతను తెలుసుకున్నాను.

అవును! జీవితం సార్థకం కావాలి. కోరుకున్నట్టుగా జీవించినప్పుడే జీవితం సార్థకమవుతుంది. నా జీవితాన్ని సార్థకం చేసుకోవాలంటే నేను వెంటనే హనీమూన్‌కి బయల్దేరాలి. సకల గుణసంపన్నురాలు, త్రిలోక సుందరి అయిన నా సహధర్మచారిణితో కలిసి సగర్వంగా తలెత్తుకుని విర్రవీగుతూ ప్రయాణం చెయ్యాలి. దారిపొడుగునా నా హృదయంలో గూడుకట్టుకుని వున్న వేలాది పాటలకు జీవం పోయాలి. ప్రకృతిలోని అనంత చైతన్యాన్ని నా ప్రేయసికి పరిచయం చెయ్యాలి. ప్రేమ పాఠాల్ని చెప్పాలి. జీవన సత్యం ప్రేమలోనే దాగివుంటుందని అరచి అరచి మరీ చెప్పాలి.

మాటిమాటికీ ప్రేమ, ప్రేమ అంటే నేనేదో గొప్ప రూపవంతుడినని అపోహ పడవద్దు. నేను చాలా సాధారణంగా వుంటాను. ఐదడుగుల మూడంగుళాలు పొడవు వుండొచ్చు. బరువు అరవై అయిదు కేజీలు. నా ముఖంలో అమాయకత్వం కోమలత్వం వున్నాయని కొందరంటే నా భార్య 'ప్రేమ' మాత్రం "కాదు... అది ఒట్టి మొద్దుతనం" అని కొట్టిపారేస్తుంది. నా నుదురు విశాలంగా వుంటుంది. ఉండక తప్పుతుందా, జుత్తు అంతగా రాలిపోయాక! కాస్త నింపుకున్న పొట్ట వున్నా పలచగానే వుంటాను. నావి వెజిటేరియన్ కళ్లు! వాటి నెప్పుడూ నులుముకోకపోయినా ఉబ్బినట్టు ఎర్రగా కనిపిస్తుంటాయి. కళ్ళద్దాలు పెట్టుకుంటే తలనొప్పి వస్తుందని మానేశాను. పొడవు ముక్కు! నడిచేటప్పుడు ఒకవేపుకు కాస్త వాలి నడవటంవల్ల బూట్లు ఆ పక్క ఎక్కువగా సమసిపోతాయి. జీవితంలో అయిదు పైసలు సంపాదించిన పాపానపోలేదు. తండ్రి సంపాదించిన ఆస్తికి ఏకైక వారసుణ్ణి కావటంవల్ల ఎన్నడూ ఆర్థిక సమస్య వేధించలేదు.

కవిని కావాలని మహాచెడ్డ ఆశ నాకు. ఎన్నెన్నో, ఏమేమో రాసి పంపాను. అన్నీ తిరిగొచ్చాయి. నాకు లోకంపట్ల కోపం వుంది. నా కవితలపట్ల మాత్రం గౌరవభావముంది. వాటిని నేను మెచ్చుకుంటాను. పాడుకుంటాను. నేను రాసిన కవితలన్నిటినీ నేనే పాడగలను.

నేను అమితంగా అభిమానించే యెజ్డీ ఎప్పుడూ నా దగ్గరే వుంటుంది. అయితే సినిమా హీరోలా నేను దాన్ని రైల్వే గేటు మీంచి దూకించలేను. ఒకే చక్రంపై వురికించలేను. దార్లో ట్రబులిచ్చినా పెట్రోలు అయిపోయినా హీరోలమాదిరిగా కాక చతికిలబడవలసిందే!

నేను స్త్రీని ప్రేమించగలను.

ప్రేమ విషయంలో నేను చండమారుతాన్ని.

అంత అందంగా వుండని నేను ప్రేమించకూడదా?

'ప్రేమ' అందంగావున్న వాళ్ల సొత్తా?

అబద్ధం!

ప్రేమించటం నా హక్కు! నా భావనా ప్రవాహాన్ని హీనంగా చూసే హక్కు ఎవరికీ లేదు, నేను ప్రేమించగలను...

నేనిప్పుడు వంద అడుగుల వెడల్పాటి రోడ్డుపై ఉల్లాసంగా అడుగులు వేస్తున్నాను.



హనీమూన్‌కి వెళ్ళబోతున్నాననే భావన నాలో వెర్రి ఆనందాన్ని రగిలిస్తోంది. నా ఆనందాన్ని చూసి ఎవరైనా నవ్వేస్తారని గాని, నన్ను ఎగతాళి చేస్తారనిగానీ నాకు సంకోచంలేదు. నాలో వురకలేస్తున్న ఉత్సాహం అన్నపానీయాల్ని సైతం మరిపిస్తోంది. వేలాది కలల్ని ఆభూషణాలుగా ధరించిన సర్దారుగా మారిపోయాను. నాలోని కోరికల గుర్రాలు దిగంతాలవైపు పరుగులు తీస్తున్నాయి. గాలిలో తేలియాడుతున్న పాదాలు ఏదైనా గోతిలో పడి విరిగిపోతాయని భయం వేసింది. అయినా ఫరవాలేదు. అపాయాల వ్యూహాలకు బెదిరి కోరికల గుర్రాలు దిగలేను- అని గట్టిగా నిర్ణయించుకున్నాను.

నేనిలా నా మనసునీ, శరీరాన్నీ ఊహల పల్లకిలో విహరింపనిస్తూ నడుస్తూ దారిలో ఎదురైన డేవిడ్‌ని హఠాత్తుగా ఢీకొన్నాను. ఆకాశ విహారం చేస్తున్న నన్ను ముందే గమనించినా డేవిడ్ కూడా కావాలనే నన్ను ఢీకొన్నాడు. తర్వాత ఎగతాళిగా పలకరించాడు.

"వివేక్ కాస్త నేలమీద కళ్ళుంచి నడువ్. ఆకాశంలో సంచరిస్తున్నట్టున్నావ్? "

డేవిడ్ నా ప్రాణమిత్రుడు. అతని దగ్గర కూడా ఎంతటి దాపరికం?

నేను హనీమూన్‌కి వెళుతున్న విషయాన్ని ఉత్సాహంగా చెప్పాను.

అతని కళ్ళు మెరిశాయి.

"కాస్త కాఫీ చప్పరిస్తూ మాట్లాడుకుందాం, రాహోయ్" అంటూ ఆహ్వానించాడు.

కాని, నిజం చెప్పాలంటే నాకిప్పుడు కాఫీ తాగేటంత తీరికలేదు. నేను నా ప్రేమని చూడటానికి వెడుతున్నాను మరి. అయితే డేవిడ్ కూడా నాకు ఆత్మీయుడే. నేను కోమలంగా, మృదువుగా మాట్లాడినప్పుడల్లా ఓ విషాదపు నవ్వుతో నా భావాల్ని తిరస్కరిస్తూ 'బతుకంటే ఓ చేదు విషం!' అని వ్యాఖ్యానించేవాడు. కొన్నిసార్లయితే నా మాటలన్నీ ఒట్టి భ్రమలనీ, అతని మాటలే వాస్తవాలని నాకు అనిపించేది. అందువల్ల ప్రేమని కలిసేముందు కాస్సేపు డేవిడ్‌తో గడపటానికి నిశ్చయించుకున్నా.

ఇద్దరం రమ్యా రెస్టారెంట్‌లోకెళ్ళి కూర్చున్నాం.

"ఏదైనా, తిందాం? " అన్నాడు డేవిడ్.

అతను మాట్లాడే మూడ్‌లో వున్నాడనిపించింది.

"సరే" అంటూ రవ్వదోసెకు ఆర్డరిచ్చాను.

వెయిటర్ వెళ్ళిపోయాక డేవిడ్ చిలిపిగా నవ్వుతూ అన్నాడు- "నువ్వేమైనా అనుకో గురూ, గాఢంగా ప్రేమించుకునే రెండు ప్రాణులకు అస్సలు పెళ్ళి అనేదేదీ చెయ్యకూడదు"

నేను తెల్లబోయాను. అతని మాటల పరమార్థం ఏమిటా అని ఆలోచిస్తూ వుండిపోయాను.

నా కంగారు అతనికి అర్థమైనట్టుంది. నా భుజం తడుతూ నన్ను నవ్వించ ప్రయత్నించాడు.

"అది కాదు వివేక్... నీకూ ప్రేమకు వివాహం జరిగింది. ఇక జీవితాంతం నీతోనే వుంటుంది. అక్టోబర్ రెండున పెళ్ళి చేసుకున్నవాడివి ఆరో తేదీకే హనీమూన్‌కి బయలుదేరుతున్నావ్. నీ కలలన్నీ నీ అరచేతిలోనే వున్నాయిగా. అయినా ఎందుకింత హడావిడీ. ఎందుకు కంగారు"

"నా కనులనిండా ఆమె రూపం! ప్రతిక్షణమూ ఆమెను సుఖంగా వుంచాలని నా తాపత్రయం!"

నా పలుకులు కవితా పంక్తుల్లా ధ్వనించాయి.

"ఏయ్ దొంగా ఆమె ఒక్కతే కాదు. నువ్వు కూడా సుఖంగా వుండాలని కోరుకుం





## సచిత్ర విచిత్రం

### పురుగులకు శిక్షణనిచ్చే వ్యక్తి



హాలీవుడ్ నిర్మాతలకి తమ సినిమాల్లో నటించడానికి ఏ రకమైన పురుగులు కావాల్సి వచ్చినా స్టీల్ కచర్‌కి ఫోను చేస్తారు. అలాగే టీ.వీలోని ప్రకటనల నిర్మాతలు, మేగజైన్ ఎడిటర్స్ కూడా వీటి కోసం ఇతన్ని ఆశ్రయిస్తారు.

52 ఏళ్ల కచర్ 1977లో ఈ వృత్తిలోకి చాలా కాకతాళీయంగా ప్రవేశించాడు. 'ఎక్సార్సిస్ట్ పార్ట్ టు' తీస్తున్నారప్పుడు. దర్శకుడికి కొన్ని గొల్లభామలు అవసరమయ్యాయి. అప్పుడు కచర్ సహాయం తీసుకుని పిక్చర్‌లోని ఆ సీన్‌ని విజయవంతంగా తీయగలిగాడు. అప్పటినుంచీ అతన్ని అనేక మంది అలాంటి అవసరాలకోసం ఆశ్రయించసాగారు. 'అర్చనోఫోబియా' అనే చిత్రంలో సాలెపురుగుల చివర్లలో సన్నని వైర్లుకట్టి అన్నీ పద్ధతి ప్రకారం వెళ్లేలా చేశాడు. 'కాపీకేట్' అనే చిత్రంలో పడుకున్న ఓ నటిపై పుట్టలు పుట్టలుగా చీమల్ని పాకించాడు. అయితే ఆమె శరీరానికి ఓ ఎలర్జీ కలిగించే మందును పూయడంతో అవి కుట్టలేదు. ఇంక తేనెటీగలు, సీతాకోకచిలుకలు, గొంగళీలు, బొద్దింకలు లాంటివాటిని వివిధ సినిమాల్లో ఇతని ఆధ్వర్యంలో చిత్రీకరించారు. 'జురాసిక్ పార్క్' సినిమాలో అతి పెద్ద దోమల్ని ఇతనే రూపొందించాడు.

టున్నావన్న సంగతి ఒప్పుకో" డేవిడ్ కొంటెగా అన్నాడు.

నేను మనసారా నవ్వాను.

"అమ్మగార్ని చూడ్డానికి వెళుతున్నట్టు న్నావ్. నా వల్ల నీకు ఆలస్యమవుతుం దేమో. అయినా ఎంత! పావుగంటలో నిన్ను వదిలేస్తాలే. ఫరవాలేదుకదా? "

నాలో రవ్వంత పశ్చాత్తాపం కలిగింది.

నా పెళ్ళిలో వీడియో కెమేరా మోసుకుని పరుగులు తీసిన డేవిడ్, పూలతో ఇల్లంతా అలంకారం చేయించిన మను, ఆర్కెస్ట్రా పిలి పించి పాడించిన సారంగధర వీళ్లంతా నా పెళ్ళిలో ఎంతో శ్రమపడినవారే. వీళ్ళంద రికీ మనస్ఫూర్తిగా థ్యాంక్స్ చెప్పి పార్టీతో సహా తాంబూలం ఇవ్వాలనే కామన్ సెన్స్ నాలో ఎందుకు కొరవడింది?

నాలాగే పెళ్ళయ్యాక అందరికీ మతిమ రుపు వస్తుందా? లేక ఇది నా ఒక్కడి తప్పిదమా?

ఎంతో వైభవంగా ఎలాంటి ఇబ్బందీ లేకుండా నా పెళ్ళితంతు ముగిసింది. అందుకు సహకరించిన వాళ్ళందరికీ నేను థ్యాంక్స్ చెప్పానా? లేదు. పైపెచ్చు నేను డేవిడ్ ముందర స్వార్థపరుడిలా నా హనీ మూన్ గురించి ముచ్చటిస్తున్నాను.

"ఏమిటోయ్ ఆలోచిస్తున్నావ్? " డేవిడ్ కాస్త వెక్కిరిస్తున్నట్టు అడిగాడు.

"మీరంతా నా పెళ్ళిలో ఎంతో శ్రమప డ్డారు"

"అందుకు నువ్వు 'థ్యాంక్స్' చెప్పనక్కర లేదు. మీ నాన్నగారు డబ్బుతోపాటు థ్యాంక్స్ కూడా అందజేశారులే. మను, సారంగ, బసణ్ణల అకౌంట్లన్నీ సెటిల్ చేసే శారు"

"ఆయన మంచి వ్యవహార దక్షత గల మనిషి"

"లేకపోతే, నీలా ప్రింటుకాని కవితల్ని రాస్తూ కూర్చోమంటావా? "

"చూస్తూ వుండు. ఏదో ఒకరోజు నా కవి తల్ని అభ్యర్థించి మరీ ప్రింటు చేయాల్సిన దుర్గతి ఈ పొగరుబోతు ఎడిటర్లందరికీ పడుతుంది" రోషంగా అన్నాను.

"అలా అని హనీమూన్‌లో కవితలు రాస్తూ కూర్చోకు. ప్రేమకు బోర్ కొట్టించకు సుమా. ఆమెకు నీ కవితలు, గివితలు అవ సరమేం లేదు"

రవ్వదోసె వచ్చింది.

బల్లపై వుంచిన దోసె చివరి అంచును మడుస్తూ డేవిడ్ యోగిపుంగవుడిలా నన్ను ఆశీర్వదించాడు.

"వివేక్... నీకు సుఖప్రదమైన దాంపత్య జీవితం లభించుగాక"

అతనికి ఎందుకలా అనాలనిపించిందో నాకు అర్థంకాలేదు. పైగా అతని కంఠంలో విషాదం ధ్వనించింది. తన బిరుసుగడ్డాన్ని రుద్దుకుంటూ, సిగరెట్ కాలుస్తూ అతను చెప్పిన తీరు చూస్తే 'నాకెలాగూ దాంపత్య సుఖం లభించలేదు. అది నీకైనా దొరకనీ' అనే భావం ఇమిడివున్నట్టు అనిపించింది.

నాకు డేవిడ్ గురించి తెలుసు. అతడొక దురదృష్టవంతుడు.

అతను తన భార్యను ఎంతో గాఢంగా ప్రేమించాడు. గిటార్ చక్కగా వాయించే వాడు. బహుశా ఆ గిటారే వాళ్ళిద్దర్నీ కలిపి వుంటుంది. అంతేకాదు, వాళ్ళిద్దర్నీ ఏకం చేసిన ఆ గిటారే వాళ్లిద్దర్నీ వేరుచేసింది. డేవిడ్ ఇంట్లో గిటార్ నేర్చుకోవటానికి చాలామంది అబ్బాయిలు వచ్చేవారు. వారిలో రాబర్ట్ ఒకడు. రాబర్ట్‌కూ, డేవిడ్ భార్యకూ మధ్య ప్రేమ అంకురించింది.

ఒకరోజు వాళ్ళిద్దరూ పారిపోయారు.

తర్వాత డేవిడ్‌కి భార్యనుంచి విడాకుల నోటీసు వచ్చింది. అలా అతని బతుకు




చిన్నాభిన్నమైంది.

నేనతనికి ఎంతో సన్నిహితుణ్ణి గనక అతడి కష్టాల్ని దగ్గరుండి గమనిస్తూ వచ్చాను. అతణ్ణి చూస్తే అయ్యో అనిపిస్తుంది.

భార్య అతన్ని మోసగించిందనే నా అభిప్రాయాన్ని అతను ఇప్పటికీ అంగీకరించడు.

"ఇది మోసం కాదు. కేవలం 'ఎన్నిక'కు సంబంధించిన సమస్య మాత్రమే. నేను ఆమెకు అవసరం అనిపించలేదు. విడిచి వెళ్ళిపోయింది. ఇష్టంలేని వ్యక్తితో బలవంతంగా కాపురం చేయటం కంటే ఇష్టపడ్డచోటికి వెళ్ళి, ఇష్టపడ్డ వ్యక్తితో కలిసి జీవించటమే ఉత్తమం. ఆమె అదే చేసింది. నాకామెపై ద్వేషంలేదు" అంటూ అతను విషయాన్ని తేలిగ్గా తీసుకుని మాట్లాడతాడు.

కాని అది పచ్చి అబద్ధం!

అతని గుండెల్లో అగ్ని వుంది. అసహాయత వుంది. ఆ సంగతి నేను వూహించలేనా?

నేను ప్రశాంతంగా అడిగాను.

"డేవిడ్, నీ మాటలు ఇంకా వినాలనిపిస్తోంది. దాంపత్యం, భార్య, ప్రేమ, జీవితం ఇలా దేన్ని గురించైనా మాట్లాడు, ప్లీజ్!"

"వద్దు వివేక్, భార్య నుంచి డైవోర్స్ పొందిన వ్యక్తిని నేను. హాయిగా హనీమూన్‌కెళుతున్న నీతో ఏంమాట్లాడినా అసందర్భంగా వుంటుంది. నా మాటలన్నీ నీకు చేదుగా అనిపిస్తాయి"

అతనలా అంటూండగానే నేను మధ్యలోనే కల్పించుకుని "అలాంటిదేంలేదు. నువ్వు చెప్పాల్సిందే. నీ మాటలు ఎంత చేదుగా వున్నా ఫరవాలేదు. అవి నీవు అనుభవించి కనుగొన్న నగ్నసత్యాలు! నేను వాస్తవాల్ని అభినందిస్తాను. అనుభవాలను గౌరవిస్తాను. ఎందుకో తెలియదు. నాకు నీ చేదు మాటలే వినాలనిపిస్తోంది" అన్నాను.

అతను నన్ను తదేకంగా చూశాడు. నేన తనికి విచిత్రమైన మనిషిలా కనిపించి వుండాలి. దోసె తినటం ఆపి గంభీరంగా చెప్పనారంభించాడు.

"మనిషి కుతూహలమైన ప్రాణి! కుతూహలం కొద్దీ ఏదేదో చేస్తూవుంటాడు.

"పాఠశాలలో విద్యనూ, దేవాలయంలో సత్యాన్నీ, స్త్రీలో ప్రేమనూ, కామాన్నీ అన్వేషిస్తూ వుంటాడు.

"ఇక్కడ నేను 'మనిషి' అని సంబోధిస్తున్నది కేవలం 'మగవాణ్ణి' గురించి మాత్రమే.

"ఎందుకంటే ఆడది మనిషి కాదు. ఆమె ఓ హీనమైన విషజంతువు అయినా అయి వుంటుంది. లేదా సహనానికి ప్రతీక అయిన మాతృమూర్తి అయినా అవుతుంది.

"ఆమె సమయసాధకి, అవకాశవాది, అబల, అసహాయ, మాతృమూర్తి, దేవత ఇలా స్త్రీ ఎన్నో రూపాల్లో దర్శనమిస్తుంది.

"అవన్నీ వాస్తవాలే...కాదనను.

"చెప్పు... వివరంగా చెప్పు. నాకు అర్థమయ్యేలా చెప్పు"

"లేదు వివేక్. ఎంత చెప్పినా స్త్రీ ఎవరికీ అర్థంకాదు.

"మగవాళ్లు పాలిస్తూ వచ్చిన ఈ సమాజంలో ఆదినుంచి స్త్రీ రోదిస్తూనే వుంది.

"సహనంతో కష్టాల్ని భరించింది.

"తనలో దాచుకున్న, తనకు ప్రకృతి ప్రసాదించిన అందచందాల్నీ, ఆకర్షణనూ పెట్టుబడిగా పెట్టి మగవాళ్ళ మధ్య యుద్ధాల్ని కూడా రగిలించింది.

"రక్తపుటేర్లు ప్రవహింపజేసింది.

"బలవంతుడి అంతఃపురంలో చేరి ఆడింది, పాడింది.



"మగవాడి పట్ల అసహ్యం వున్నప్పటికీ అవసరార్థం 'ఆహ్, ఓహ్' అంటూ తియ్యగా మూలిగి వాళ్ళను ఉద్రేకపరచింది.

"ఈ మగవాళ్ళు తన స్తనద్వయాన్ని చూస్తూ ఛొంగ కార్చుకుంటారని ఆమెకు తెలుసు.

"తనలోని శూన్య సామ్రాజ్యాన్ని తాకటానికి తహతహలాడతారనీ ఆమెకు తెలుసు"

"నువ్వు కేవలం కామం గురించే చెప్తున్నావ్ డేవిడ్! నా ప్రేమ గురించి కూడా చెప్పు. నా ప్రేమ ఎంత పవిత్రమైందో, ఎంత నిస్వార్థమైనదో నీకు తెలుసుకదా. ప్రేమ అంటే ఆరాధన కాదా! నేను నా భార్య 'ప్రేమ'ను ఎంతగా ఆరాధించానో నీకు తెలియదా? "

డేవిడ్ నా మాటల్ని మధ్యలోనే తుంచేస్తూ అన్నాడు.

"కాస్త ఆగు వివేక్, నువ్వింకా చిన్నవాడివి. నా మాటల్ని పూర్తిగా విను. మగవాళ్ళందరూ ఆలస్యంగానైనా చివరికి నా అభిప్రాయానికే వస్తారని నా నమ్మకం. స్త్రీ పురుషుల మధ్య అలాగే మిగిలివున్న కుతూహలం కారణంగానే ఈ రహస్య మందిర నిర్మాణం జరిగింది. అయితే ఈ స్త్రీ పురుష సంబంధపు పరమోచ్చమైన లక్ష్యం కామం మాత్రమే!

"నీలాంటివారు మాత్రం 'ప్రేమ' అనే డొంక తిరుగుడు దారిలో నడిచివస్తారు. బహుదూర ప్రయాణం చేసి అలసిపోయామని భ్రమిస్తూ కూలబడిపోయి తమ త్యాగానికి తామే గర్వపడతారు. అదే నాలాంటివారైతే 'కామ' లక్ష్యాన్ని చేరటానికి 'ప్రేమ' మెట్లను వాడుకోరు. ఒకేసారి లక్ష్యంవేపు ఎగిరి దూకుతారు. ఒక్క గెంతులో లక్ష్యాన్ని చేరుకుంటారు. లక్ష్యసా





ధనకోసం మన ఇరువురి దారులు వేరైనా లక్ష్యం మాత్రం ఒక్కటే"

నా మనసు చివుక్కుమంది. బాధగా అరిచినట్టు చెప్పాను.

"ఏమంటున్నావ్ డేవిడ్? నువ్వూ గతంలో ప్రేమించలేదా? ఆ రోజుల్ని గుర్తుకు తెచ్చుకో"

డేవిడ్ శూన్యమనస్కుడిలా అన్నాడు.

"గుర్తు తెచ్చుకోనక్కరలేదు. అవి జాగ్రదావస్థలోనే వున్నాయి. ఆమె నన్నెందుకు వదిలిపోయిందో కూడా నాకు తెలుసు. ఆ సమయంలో నేనామెకు బోర్ కొట్టించే సోమరిలా కనిపించి వుండొచ్చు దాంపత్య జీవితంలో భార్యభర్తలు ఎంతో జాగ్రత్తగా మసలుకోవాలి. ఒకరికొకరు బోర్ కలిగిస్తే మాత్రం 'ప్రేమ పర్వం' ముగుస్తుంది. ద్వేషభావం అంకురిస్తుంది. గొడవలు మొదలవుతాయి. మా విషయంలోనూ సరిగ్గా అదే జరిగింది. రోజూ పోట్లాటలు జరిగేవి. ఆమె పారిపోతుందని నేను ముందుగానే వూహించాను"

"అలాంటప్పుడు ఆమెను ఆపవచ్చు కదా..."

"ఆమె పారిపోవాలనే నా మనసు కూడా లోపల్లోపల కోరుకుందేమో ఎవరికి తెలుసు. మనసు గతి ఇంతే. దాంపత్యం బోరు కొట్టకుండా వుండాలంటే ఏమైనా చేస్తుండాలి వివేక్. ఓ అందమైన చిన్న తోట, ఓ చక్కటి లైబ్రరీ, ఓ ముద్దులొలికే బిడ్డ. ఇలాంటివాటితో ప్రేమ తన పరిధిని నలువైపులా విస్తరించుకోకపోతే దంపతులు చాలా బాధపడాల్సివస్తుంది. కామంపట్ల ఆసక్తి కొద్దిరోజులవరకే వుంటుంది. ఆ తరువాత నిదానంగానైనా ఇతర అభిరుచులు పెరగాలి. నా జీవితంలో అదే కొరవడింది. ఆమె నిర్లిప్తంగా పక్కన పడుకు

నేది. తన యవ్వన సంపదను తెరిచిన పుస్తకంలా బహిర్గతపరుస్తూ పడుకునే ఆమె నాపట్ల రానురాను ఓ జడపదార్థంలా మారుతూ నాకు ఓ చెక్కమొద్దులా అనిపించసాగింది. ఒక్కోసారైతే ఆ సంపదను నాకు అందించటానికి సైతం సతాయించేది. నాకు ప్రాధేయపడటానికి మనసొప్పేది కాదు. అయితే ఆమె పారిపోయాక మాత్రం నేనేదో పోగొట్టుకున్న భావంతో విలవిల్లాడాను"

అతని మాటలు నా మనసుని కలిచివేశాయి.

టీ వచ్చింది.

ఇద్దరం కప్పులు అందుకుని మెల్లగా చప్పుడు చేస్తూ చప్పరించసాగాం. ఇద్దరి చప్పుళ్లు ఒకదాని తర్వాత ఒకటి వినిపిస్తూ లయబద్ధమవుతున్న సమయంలో నేను తడబడుతూ అడిగాను.

"డేవిడ్... నా జీవితంలోనూ అలాంటి దుర్ఘటన వేచివుందంటావా? "

అతనన్నాడు-

"నేను జ్యోతిష్కుడ్ని కాను. నాకు నీ భవిష్యత్తు గురించి తెలియదు. అయితే అలా జరగకూడదని మాత్రం కోరుకుంటాను. ప్రేమ మంచి అమ్మాయి. నువ్వు ఆమెకన్నా మంచివాడివి. అయితే మనిషి స్వభావం కాలానుగుణంగా మార్పులు చెందుతూ వుంటుంది. పైగా మంచీ, చెడూ అనేవి మనిషినిబట్టి మారుతూవుంటాయి. నీ మంచితనం ఆమె దృష్టిలో చెడ్డతనంగా కనిపించవచ్చు. అలాగే ఆమె చెడులు నీ ఆరాధనలో మంచితనాలుగా కనిపించవచ్చు"

"అలాగైతే దాంపత్యమనే మాటకు అర్థమేమిటి? "

"నా అభిప్రాయం చెప్పమంటావా? ప్రేమ, కామాల కుతూహలంతో మగవాడు వివాహమనే మహాద్వారం ద్వారా దాంపత్య మందిరంలోకి ప్రవేశిస్తాడు. బలికి సిద్ధమైన గొర్రెలా మగవాడు ఆరోజు శుభ్రంగా స్నానం చేసి, సెంటు పూసుకుని, కొత్త బట్టలు ధరించి అందంగా తయారైవస్తాడు. అంతవరకు అతని కోసమే ఎదురు చూస్తున్నట్టు పట్టుచీర ధరించి, నగలు పెట్టుకున్న స్త్రీ పాలగ్లాసు చేతబట్టుకుని అతని చెంతకు వస్తుంది. వాళ్ళిద్దరూ కేవలం కుతూహలం కొద్దీ ఒకర్నొకరు పరస్పరం 'కలవటాన్ని' కొన్ని నిఘంటువులు 'ప్రథమ రాత్రి' అని వర్ణిస్తాయి.

"ఆ తరువాత మగవాడు నెమ్మదిగా ఆమెలో ప్రవేశిస్తాడు.

"అలా ప్రవేశించిన మగవాడు మందిరం లోపలి అపురూప కుడ్యాలను గమనించి తెల్లబోతాడు. అక్కడి ముగ్ధమనోహర కళా విన్యాసాలను తాకి తాకి పరవశిస్తాడు.

"ఇంతకాలం తను ఈ అపూర్వ సుఖం లేక ఎలా వంచింపబడ్డానా అని మధనపడతాడు. ఇక ఈ సమస్త నిధి తనదేనని గర్వంతో పొంగిపోతాడు. ఆ నిధిని ముట్టుకుని, తట్టి, నలిపి పొర్లుతూ ముందుకు సాగుతాడు.

"అట్టడుగు గమ్యాన్ని తాకాలనే చాపల్యంతో మందిరంలోని గర్భగుడివరకూ పాకుతాడు. సుఖాల మత్తులో తేలిపోతాడు.

"చివరికి 'నేను గెలిచాను' అని గర్వంతో మురిసిపోతాడు."

"అయితే..."

"ఈ సుఖం, సంభ్రమం, గర్వంపట్ల కాస్సేపట్లోనే మొహం మొత్తుతుంది. తను ఇక మందిరంనుంచి బయటపడాలనుకుంటాడు. బయటికొచ్చే దారికోసం అన్వేషిస్తాడు. అయితే ఆ మందిరంనుండి బయటికి దారి తీసే ద్వారమేదో అతనికి అంతుచిక్కదు.

అతను పిచ్చిగా పరుగులు తీస్తాడు. పడ తాడు, లేస్తాడు, కేకలు వేస్తాడు. అయినా తలుపు కనిపించదు. కనిపించేమాట అటుంచి ఈ వెదుకులాటలో అతను మరింత లోతుకు జారిపోయి గర్భగుడిలో చేరుకుంటాడు. క్రమంగా అది అతనికి శాశ్వత చెరసాలగా మారిపోతుంది. శ్రమ పడకుండానే మగవాణ్ణి బంధించానన్న గర్వంతో స్త్రీ మురిసిపోతుంది. పంజరంలో బందీ అయిన మగవాడు మాత్రం బయటికి రాలేక ద్రవమవుతాడు. చివరికి నాలా నాశ నమవుతాడు"

డేవిడ్ తాగుతున్న టీనీ, మాటల్నీ ఒకే సారి ముగించాడు. అతని మాటలన్నీ తుపాకీ గుళ్ళ మాదిరి నా ఎదను సూటిగా చీల్చాయి.

కాస్సేపు తననుతాను నియంత్రించు కున్నాక డేవిడ్ హఠాత్తుగా మాట మార్చాడు.

"సారీ గురూ, ఐ యామ్ వెరీ సారీ... ఏదేదో మాట్లాడేశాను. ఒక్కోసారి నేను నాకు తోచిందంతా ఇలాగే చెప్పేస్తుంటాను. సరే, ఈ సంగతి వదిలెయ్. ప్రేమ చెల్లాయ్ హనీమూన్‌కి వెళ్ళటానికి ఇంత త్వరగా ఎలా ఒప్పుకుంది? గుళ్ళు గోపురాలకెళ్ళటం, బంధువుల్ని, ఊరినిండా వున్న స్నేహితుల్ని కలవటం పూర్తయిందా? "

నేను వాస్తవంలోకి వచ్చాను.

"లేదు గురూ! ఆమె రానని మొదట్లో మొరాయించింది. నేను వదిలిపెడితేగా? రైల్వేలో తెలిసినవార్ని పట్టుకుని రిజర్వేషన్ కూడా చేయించేశాను. ఇక ఇప్పుడామెను బయల్దేరదీయటమే మిగిలింది"

"గట్టివాడివే! వెళ్ళిరా. నేను ఏదేదో మాట్లాడాను. వద్దనుకున్నా ఎందుకో అలాం టిమాటలు నా నోటి వెంబడి వచ్చేస్తుం టాయి. ఆ పాడు మాటల్ని దయచేసి ఇక్కడే మర్చిపో. నా చేదు అనుభవాలు, మాటలు నీ తీయటి కలల ప్రపంచాన్ని పాడుచెయ్యకూడదని మనసారా కోరుకుం టున్నాను"

అతను లేచి నించున్నాడు. నేనెంత వారించినా వినకుండా తనే బిల్లు చెల్లిం చాడు.

హోటల్‌నుంచి బయటపడ్డాక మేం ఎవరి దారిన వాళ్ళం బయలుదేరాం?

అతని మాటలు ఇంకా నా చెవుల్లో గింగు రుమంటూనే వున్నాయి.

ఏదో అర్థంకాని బాధ అనుభవంలోకి రాసాగింది.

జేబులోని రిజర్వేషన్ టిక్కెట్లు శరీరానికి ఒత్తుకుంటున్నట్లనిపించింది.

అడుగుల వేగం పెంచాను.

## డేవిడ్



అతను వెళ్ళటాన్నే చూస్తూ నుంచు న్నాను.

ఆకాశంలో మండిపడుతున్న సూర్యుడు రమ్యా రెస్టారెంటుమీద నిప్పులు చెరుగుతు న్నాడు. ఆతురతగా ప్రేమ ఇంటివేపు బయ లుదేరిన వివేక్‌ని చూస్తుంటే వద్దనుకున్నా

విషాదపు నవ్వు నా పెదవులమీదికి తోసుకొచ్చింది. అసలు సిసలైన స్వప్నజీవి అతను. ఒక్కోసారి నాకతను బుద్ధిమంతుడిగాను, మరొకసారి ఒట్టి గొర్రెలాగానూ కనిపిస్తాడు.

నేను రెస్టారెంటులోనే కూర్చుండిపోయాను. ఎందుకనో అక్కడినుంచి కదలబుద్ధికాలేదు. బేరర్‌తో మరో టీ తెమ్మని చెప్పాను. ఈ మండుటెండలో నేను మరో 'టీ' తాగటం బేరర్‌కు చోద్యంగా అనిపించి వుండాలి.

ఏఏ మాటల్ని, ఏఏ భంగిమల్లో, ఏఏ హెచ్చుతగ్గుల్లో వివేక్‌తో మాట్లాడానో పునఃస్మరణ చేసుకోసాగాను. ఏదో అపరాధభావనతో మనసు నిండిపోయి ఆ భావన నన్ను బాధించసాగింది. నేను ఆ విధంగా మాట్లాడకుండా వుండాల్సింది. ప్రతీ వ్యక్తికీ తనదంటూ ఓ స్థానముంటుంది. ఆ స్థానంలోనే వుండి మాట్లాడటం సమంజసం. వ్యతిరేక స్థానాల్లో వుండి జరిపే వాదోపవాదాలన్నీ వ్యర్థమైనవే. ఒకరి మాటలు మరొకరికి తలకెక్కవు. అందరూ చెప్పటానికే ప్రయత్నిస్తుంటారు. చెప్పటమనేది తెలివైన పనని, పరమ కర్తవ్యమని అందరి నమ్మకం. కాని మౌనంగా మాటల్ని ఆలకించేవాడే నిజమైన బుద్ధిమంతుడు. నేను వివేక్ మాటల్ని వినివుండాల్సింది. మౌనంగా విని వుండాల్సింది.

అప్పుడు కూడా నేను ఇలాగే చేశాను.

స్టెల్లా ఏం చెప్పినా అప్పట్లో వినిపించుకోలేదు. అంతా నేను మాట్లాడాను. అదంతా ప్రేమ వాగుడే. నా ప్రేమ వ్యాఖ్యానాల్లో ఒక్కదాన్నైనా ఆమె అర్థంచేసుకుని ఆనందించకముందే, నేను ఇంకొకటి, మరొకటి ఇలా పుంఖానుపుంఖాలుగా ఆమె ముందు ప్రేమ వ్యాఖ్యానాలను ఒలకబోశాను. ఇదంతా అనుభవజ్ఞుడైన ఓ సేల్స్‌మ్యాన్

'వాగుడు' అని ఇప్పుడు అనిపిస్తూవుంది. నా తొందరపాటుకు సిగ్గువేస్తోంది.

మౌనం అనేది సమస్త ఆపదలనుండి మనల్ని సురక్షితంగా కాపాడుతుంది. మౌనాన్ని ఆశ్రయించిన వ్యక్తి ఆపదల్లో పడడు. నేను నా వాగుడు కారణంగా ఆపదలో చిక్కుకున్నాను. నా మాటలవలను నేనే అల్లుకుని అందులోనే బందీనయ్యాను.

ఇప్పుడు వివేక్ వంతు వచ్చింది.

అయితే తేడా ఒకటే!

నేను గొప్ప ఇంటెలెక్చువల్ గా • బుద్ధిజీవి వేషంలో ప్రేమిస్తే, వివేక్ ఆధునిక యుగపు భావకవిలా ప్రేమించాడు. అయితే వాటి పరిణామం ఒక్కటే.

గోతిలో పడటం!

స్త్రీ దేహంలో విచిత్రమైన ఊబిని సృష్టించటం వెనకగల భగవంతుడి వుద్దేశ్యం ఇదే కామోసు!!

స్టెల్లా అసమాన సౌందర్యవతి! లేదా, కింగ్స్ కోర్టు హోటల్‌లోని రిసెప్షన్ డెస్క్ వెనక ఆమె తన మోహన వృత్తిపరమైన కృత్రిమ దరహాసాన్ని పులుముకుని నుంచున్న తీరు, నేను ఆమెను చూసిన ఆ ఘడియ నా దృష్టిలో ఆమెను అందాలరాశిగా మార్చి వుండాలి. ఫలానా స్త్రీ గొప్ప రూపవతి అనే భావన మన మదిలో ఒకసారి ప్రవేశిస్తే చాలు. ఆ భావం మన మనసులో శాశ్వతంగా తిష్టవేసుక్కూర్చుంటుంది.

నా విషయంలోనూ అదే జరిగింది.

ప్రతి రోజూ సాయంత్రం ఆమె డ్యూటీ ముగించుకుని ఇంటికి బయలుదేరే సమయానికి నేనక్కడ హాజరయ్యేవాణ్ణి. అలా మా మధ్య ప్రేమ మొలిచింది. నిజానికి నేనే మొలిచేలా చేశాను.

ప్రేమ అంటే ఏమిటి?

లైంగిక మోహమా?



గోతిలో పడాలనే చాపల్యమా?

ఇందులో తప్పు ఎవరిది?

నా ఒక్కడిదేనా?

'నన్ను ప్రేమిస్తున్నావా? ... పెళ్ళి చేసుకుంటావా?' అని ఈ రెండు ప్రశ్నల్నీ ఒకే సారి స్టెల్లా ముందు వుంచాను.

బహుశా 'చాముండికొండ' మెట్లు ఎక్కుతూ వుండగా ఈ ప్రశ్నలు వేసినట్టుగా గుర్తు. నిజానికి మొదటి ప్రశ్నే చాలు. దానికి సమాధానం తెలుసుకుని అరగించుకున్నాక కొంతకాలానికి రెండవప్రశ్న వేసి వుండాల్సింది. తొందరపడ్డాను. దానికి నా వాచాలతే కారణం అయివుండొచ్చు. పెళ్ళి ప్రస్తావన లేకుండా ప్రేమ గురించి మాటలాడకూడదనే అజ్ఞానం నాలో వుండివుండాలి. ప్రేమలో దాగి వుండే అభద్రతా భావాలు పెళ్ళిద్వారా తొలగి, ప్రేమ- భద్రతను పొందుతుందనే ప్రగాఢ మూఢనమ్మకం కూడా నాలో పనిచేసి ఉండాలి.

ఏమైతేనేం? ... అడిగేశాను!

ఆమె చిరునవ్వు నవ్వింది.

అక్కడ కూడా మౌనానిదే గెలుపు. ఆ చిరునవ్వుకు ఎన్నో అర్థాలు చెప్పవచ్చు

"ఉండవయ్యా... ఎందుకింత తొందర?"

"ఓరీ మూర్ఖుడా! నిన్నెలా వలలో వేసుకున్నానో చూశావా?"

"ప్రస్తుతానికి వేట దొరికింది. పూసుకున్న పౌడరు, రాసుకున్న స్నో వృథా కాలేదు"

"ఓరి మగపురుగా! ఈ చిరునవ్వు కోసమే కదా నీవు అంగలార్చేది, ఖబడ్దార్!"

ఇలా ఏదైనా కావచ్చు

"చప్పుడుచెయ్యని ఈ చిరునవ్వుతో నేను మహాయుద్ధాల్ని చేయించగలను!"

"ఘోర రక్తపాతాల్నే సృష్టించగలను!!"

"నా కడగంటి సైగతోటే ప్రాణాల్ని హరించివేయగలను!!!"

అని కూడా కావచ్చు

అయితే ఈ అర్థాలేవీ అప్పట్లో నాకు స్ఫురించలేదు. ఆమె ఎంతటి జాణ అంటే నా మొదటి ప్రశ్నని పక్కనపెట్టేసి, రెండవ ప్రశ్నకు కార్యరూపం ఇవ్వటానికే ఆసక్తి చూపింది.

ఆ చిరునవ్వుకు మరో అర్థం కూడా వుందని నాకు బోధపడింది. అదేమంటే "మొదట పెళ్ళిచేసుకో. తరువాత ప్రేమ, దోమ గురించి ఆలోచిద్దాం" అని.

గోవాలో ఓ చర్చిలో మేం పెళ్ళి చేసుకున్నాం!

ఈ వివేక్‌లానే నేనూ అప్పుడు ఒక్కసారిగా సంభ్రమసంద్రంలో మునిగిపోయాను.

ఎలాంటి సంభ్రమమది!

కోరి, వరించిన స్త్రీ శరీర స్పర్శకై తపించిపోయే అపూర్వ సంభ్రమం!

ఈ కారణంగానే నేను పెళ్ళికి గోవాను ఎన్నుకొన్నాను. పెళ్ళికి, హనీమూన్‌కి ఒక్క గంటకన్నా ఎక్కువ అంతరం వుండకూడదనేది నా అభిలాష. అంతా అనుకున్నట్టుగానే జరిగింది. ఏది పెళ్ళి ఏది హనీమూన్ అని ప్రత్యేకంగా విడదీసి చెప్పటానికి అసాధ్యం అనిపించేలా రెండూ వెంటవెంటనే జరిగిపోయాయి.

స్టెల్లాతో సెక్స్ ముగిసిన మరుక్షణం నేను సముద్రాన్ని చూస్తూ కూర్చున్నాను. బాల్కనీలోకి సముద్ర వాయువులు దూసుకువస్తున్నాయి.

ఉవ్వెత్తున ఎగిసిపడుతున్న కడలి అలలు వేగంగా ఒడ్డును తాకుతున్నాయి. సెక్స్ అనుభవాన్ని స్మరించడం విచిత్రమైంది. నా మనసు సెక్స్ అనుభవాన్ని నెమరువేసుకొంటోంది. రకరకాల ప్రశ్నలు నామీద మూకు




మ్మడిగా దాడిచేశాయి.

కింగ్స్ కోర్టు రిసెప్షనిస్ట్ ఎవరు?

చాముండికొండ ఎక్కేటప్పుడు చిరునవ్వు నవ్విందెవరు?

చర్చిలో నాచేత ఉంగరం తొడిగించుకున్న దెవరు?

నాతో సెక్స్‌లో పాల్గొన్న స్త్రీ ఎవరు?

ఇన్ని అవతారాలు ఎత్తింది ఒకరేనా?

కాదు కాదు!

వీళ్లంతా ఒకరు కాదు... వేరు వేరు వ్యక్తులు!

నేను చూసింది ఒక స్త్రీని...

ప్రేమించింది ఇంకో స్త్రీని...

పెళ్ళాడింది మరో స్త్రీని...

అనుభవించింది ఇంకో స్త్రీని...

ఇలా స్వల్ప వ్యవధిలోనే స్టెల్లా ఎత్తిన నానా రకాల అవతారాలను మనసులోనే స్మరించుకోసాగాను.

అంతలో ఆమె తన సరికొత్త అవతారం ఎత్తి దగ్గరికొచ్చి అడిగింది.

"ఇప్పుడు నువ్వు నెలకు ఎంత సంపాది స్తున్నావు? "

ఆ తర్వాత చెప్పాను. ఇద్దరం పనాజి వీధుల్లో తెగతిరిగాము. ఆమెకు షాపింగ్ పిచ్చి నాకు షాపింగ్ అంటే మంట. అడు క్కునే వాడిలా అంగళ్ళముందు చేతులు కట్టుకుని నుంచోవటం ఆమె షాపింగ్ కోసం గంటలతరబడి కాలాన్ని వ్యర్థబు చ్చడం నాకు నచ్చదు.

కాని అదే జరిగింది.

అదే మళ్ళీమళ్ళీ పునరావృతం అయ్యింది. నేను భరించలేకపోయాను. సహనం వహించలేకపోయాను.

చివరికి అలసిపోయాను.

నా మదిలో హనీమూన్ గురించిన కల్పన మరోలా ఉండేది. స్త్రీ పురుషులు శారీరకంగా, మానసికంగా ఒకరికొకరు దగ్గరై అర్థం చేసుకోవటం, చెవుల్లో గుసగు సలాడుతూ సిగ్గులుపోవటం, ప్రకృతి ఒడిలో ఒక్కటవ్వడమూ, అలౌకిక ఆనందాన్ని అనుభవించటం, వాటి గురించి మాట్లాడటం, సరదాగా ఆడటం, పాడటం, మధుర సంగీతాన్ని వినటం, ఇలాంటివన్నీ వెరసి హనీమూన్ అవుతుందని నేను భావించాను. అలా గడపాలని సరదాప డ్డాను. అయితే స్టెల్లాకి వున్న సరదా ఒకటే.

షాపింగ్!

షాపింగ్!!

షాపింగ్!!!

షాపింగ్ అంటే కొనటం.

కొనటం అంటే వ్యాపారం.

ఆమె వస్తువుల్ని ఏరేటుకు కొంటుందో నాకు తెలుసును! అంతే కాదు, నాకు తెలి యని ఓ ధరకు నన్ను కూడా ఆమె కొనేసిం దనే చెప్పాలి.

"నాకు షాపింగ్ ఇష్టంలేదు"

"నాకు షాపింగ్ అంటే మహా ఇష్టం"

"నాకు చేపలంటే చాలా ఇష్టం"

"ఛీ...ఛీ చేపల్ని చూస్తే నాకు డోకొ స్తుంది"

"దారిలో మగవాళ్ళు ఎదురుగా వస్తుంటే కాస్త పక్కకు తప్పుకుని దారి యివ్వు!!"

"వై షుడ్ ఐ? వాళ్ళనే పక్కకి తప్పుకో మను. తప్పుకోకపోతే వాళ్లని గుద్దుకుంటూ వెళతాను"

"ఎవర్ని చూసినా చిరునవ్వు చింది స్తావు? నన్ను చూస్తే ఎందుకు చిటపటలా డుతావు? "

"నేను వృత్తిరీత్యా రిసెప్షనిస్ట్‌ని 'చిరునవ్వు' -మా ముఖాలను ఎప్పుడూ అంటిపెట్టుకునే వుంటుంది.

ప్రపంచం దృష్టిలో మేము కృత్రిమంగా నవ్వేవాళ్లం. అయితే భర్తముందు కూడా కృత్రిమంగా ఉండాల్సిన అవసరమేముంది?

"అయిదు నిముషాలు నా కోసం కేటాయిస్తావా? గిటారు వాయించి వినిపిస్తాను"

"అబ్బబ్బా నాకు పరమబోర్... అయినా హనీమూన్‌కి ఎవరైనా గిటార్ తెస్తారా? విరిచి పొయ్యిలో పెట్టేస్తాను"

ఇలా ప్రతీ విషయంలోనూ మామధ్య బేధాభిప్రాయాలు కలగసాగాయి. అవి అలాగే పెరుగుతూ పోయాయి. 'యతి' అంటే 'ప్రతి' అన్నట్టు మామధ్య వ్యతిరేక భావాలు తలెత్తాయి.

హనీమూన్‌లోనే మా ఇద్దరిమధ్య మన స్పర్థలు చోటుచేసుకున్నాయి. ఇద్దరినడుమ మొదలైన మౌనపోరాటం రానురాను శృతి మించి వీధి గొడవలా రూపుదాల్చింది.

చూస్తూ చూస్తూండగానే స్టెల్లా, నేను మనసారా ప్రేమించిన స్టెల్లా, పట్టపగలు, పనాజీ వీధిలో, ఆకాశంలో మండేసూర్యుడి సాక్షిగా జనానికంతా వినిపించేలా, కనిపించేలా.

"యూ స్టుపిడ్"

అని తిట్టి తన చేతిలోని హేండ్‌బ్యాగును నా ముఖానికి విసిరికొట్టింది.

ఆమెనుంచి ఇలాంటి ప్రతిక్రియను ఆశించని నాకు తీవ్రమైన మనస్తాపం కలిగింది. తల కొట్టేసినట్టయింది. నడివీధిలో నన్ను నగ్నంగా నుంచోబెట్టినట్టు అవమానభారంతో చితికిపోయాను.

లోగుట్టు మనిషిలా గబుక్కున నన్ను నేను లోపలికి లాక్కున్నాను. ఆమెను తిరిగి కొట్టలేదు. కనీసం తిట్టనూ లేదు.

గదికి తిరిగొచ్చాక "ఐయామ్ సారీ..." అంది.





అప్పటికీ నేనేమీ మాట్లాడలేదు.

నాకు మగవాళ్ళ దౌర్జన్యం తెలుసు, క్రౌర్యం తెలుసు. కాని ఇదేమిటి?

ఓ స్త్రీ అందులోనూ కోరి పెళ్లాడిన వ్యక్తి హనీమూన్‌లో భర్తపై చేయిచేసుకోవటమా?

ఇలా జరగటం సహజమేనా?

ఇది ఆమె క్షణికావేశ ఫలితమా? లేక నా పట్ల ఆమెకున్న గాఢమైన తిరస్కారపు పరిణామమా?

శృతి రాగతాళాల మేలుకలయిక జరగని గీతంలా మారింది మా దాంపత్యం?

ఆమెతో నేను నెరపిన సెక్సులోనూ రంగు, రుచి, వాసనలు లేనేలేవు.

ఓ యాంత్రిక క్రియలా నిశ్శబ్దంగా, నిర్లిప్తంగా అది గడిచిపోయేది. 'కావలసినదాన్ని ఎన్నుకోండి' అంటూ అంగడివాడు బట్టలన్నీ మనముందు పరచి నిర్లిప్తంగా నుంచున్నట్టు, ఆమె నా ముందు దుస్తులన్నీ తీసేసి తన నగ్నశరీరాన్ని ప్రదర్శిస్తూ పడుకునేది. ఎలాంటి క్రియ, ప్రతిక్రియ, స్పందన, ప్రతిస్పందనలు లేకుండా సెక్స్‌లో సుఖాన్ని ఎలా పొందగలం? ఆక్రమించటం, స్ఖలించటం, సుఖించటం అన్నీ ఒకే స్థాయిలో జరిగిపోయేవి.

నా భ్రమలు తుడిచిపెట్టుకుపోయాయి.

కల్పనామయ ముష్టిమైథునం ఎలాంటి స్వర్గం?

డబ్బు లేదు.

భయం లేదు.

కల్పనకు హద్దులు లేవు.

నా భావనా ప్రపంచాన్ని కాలదన్ని నేనెందుకు ఈమెను ఎన్నుకున్నాను. ఈమె నాకు ఏ కొత్తదనాన్ని అందించింది. వేలికున్న ఉంగరాన్ని చూపిస్తూ 'చూడు నిన్నెలా బంధించానో' అనే భావాన్ని గర్వంగా ప్రదర్శిస్తోంది.

ఆహ్లాదకరమైన గోవా వాతావరణంలో సైతం మేము ఊపిరికట్టేసినట్టు విలవిల్లాడ సాగాము. ఆమెలోనూ అసహనం, కలవర పాటు బుసలుకొడుతున్నట్టు నాకనిపిం చింది.

ఓరోజు "ఇక చాలు, వెళ్ళిపోదాం పదా..." అంది.

ఇద్దరం గోవాకి వీడ్కోలు చెప్పి మైసూరుకు బయలుదేరాం.

తిరుగు ప్రయాణంలో మామధ్య కుదిరిన ఒప్పందాలే వేరు!

హనీమూన్‌లో మామధ్య ఏమైనా జరిగి వుండనీ, ఆ విషయాల్ని బయటపెట్టకూడదు, మాదొక విజయవంతమైన హనీమూన్ యాత్ర అని మా మిత్రులందరికీ చాటిచెప్పాలి. దాంపత్యజీవితంలో దొరికే సుఖసమృద్ధి గురించి తప్పెట మోగిస్తూ అరిచి అరిచి చెప్పాలి. అలా చెప్పి బ్రహ్మచారులైన మిత్రులందరినీ పెళ్ళిళ్ళకు సిద్ధంచేయాలి. సూటిగా చెప్పాలంటే గొర్రెల్ని బలి పీఠంమీదికి తీసుకురావాలి.

ఇదంతా సూచించింది నేనే. నా ప్రతిపాదనను ఆమె కూడా అంగీకరించింది.

స్టేషన్‌లో నన్ను చూడగానే వివేక్ "హనీమూన్ ఎలా గడిచింది? " అన్నాడు కొంటెగా నవ్వుతూ.

నేను బుగ్గలు రుద్దుకుంటూ "ఓహ్ అద్భుతంగా గడిచింది. సుఖమే... సుఖం..." అన్నాను.

నేను బుగ్గలు రుద్దుకున్నందుకు ఆ కవి మహాశయుడు అది చుంబన సంబంధితంగా భావించాడోఏమో ఫక్కున నవ్వాడు!

నేనూ నవ్వి ఆ నవ్వులో అవమానాన్ని దాచుకున్నాను!

## స్టెల్లా

నేను డేవిడ్‌ని కొట్టకుండా వుండాల్సింది. అదొక అసంకల్పిత ప్రతీకార చర్య అతను వ్యర్థంగా పోట్లాడే రకం. అతనో, అతని మాసిన గడ్డమో నన్ను బాగా రెచ్చగొట్టి ఉండాలి.

ఒకరిపట్ల మరొకరికి ఇష్టం లేనపుడు కలసి జీవించటం దుర్భరంగా వుంటుంది. నాలోని అసహనం అతి కొద్దికాలంలోనే బద్దలయ్యింది.

తిరుగు ప్రయాణంలో మామధ్య జరిగిన ఒప్పందాన్ని వుల్లంఘిస్తూ ఆ తర్వాత ఓ రోజున ప్రేమతో చెప్పేశాను, "నేను హనీమూన్‌లో డేవిడ్‌ను కొట్టాను..." అని.

నా మాటలకు ప్రేమ మొదట తెల్లబోయింది. తరువాత గర్వపడింది. అటు తరువాత సరైన పనే చేశావన్నట్టు నావేపు మెచ్చుకోలుగా చూసింది.

ఇద్దరం ఆమె అగరొత్తుల ఫ్యాక్టరీ మూడవ అంతస్థులో వున్న మేనేజింగ్ డైరెక్టర్ ఛేంబర్‌లో కూర్చొని చాలాసేపు మాట్లాడుకున్నాం. 'నేను డేవిడ్‌ను కొట్టాను...' అనే విషయంమీద మేమొక చిన్న సెమినార్‌నే నిర్వహించామని చెప్పాలి.

"నువ్వు అతని ముఖం పగలగొట్టడం మంచిదే అయ్యింది. ఇంకాస్త ఆలస్యం జరిగివుంటే అతనే నీ చెంపలు వాయించి వుండేవాడు" ప్రేమ చాలా కూల్‌గా అంది.

ఆవాళ మగవాళ్ళ గురించి మేము చాలా విషయాలు మనసు విప్పి మాట్లాడుకున్నాం. ప్రేమ తను చూసిన మగవాళ్లను, వారి కోతిచేష్టలను గురించి చెప్పింది. నా దృష్టిలోకి వచ్చిన మగవాళ్ళ వెర్రిపనులు గురించి నేను కూడా వివరించాను.

బస్టాపుల్లో, ఆఫీసుల్లో, ఇతర బహిరంగ ప్రదేశాల్లో మగవాళ్ళు ఆడదాన్ని ఆకర్షించటా

నికి వేసే ఎత్తుల్ని, చేసే కసరత్తుల్ని కళ్ళకు కట్టినట్టు ప్రేమ వర్ణించింది. ఆడదాని కొంగు కనిపించగానే చొల్లు కార్చే మగరాయళ్ళ గురించి వర్ణించేటప్పుడు 'కుక్కలు', 'నక్కలు' వంటి పదాలను ఆమె ప్రయోగించటం నాకు ఇంకా గుర్తుంది.

అయితే డేవిడ్, వివేక్‌లు ఆ బాపతు మగవాళ్ళు కారు. డేవిడ్ ఆడదాన్ని చొంగకారుస్తూ చూసే రకం కాదు. అతను నా ఒక్కదాని దగ్గరే 'ప్రేమ యాచన' చేశాడు. వివేక్ కూడా అంతే. అతను చక్కటి సంస్కారవంతుడు. ప్రేమను తప్ప మరో ఆడదాన్ని కన్నెత్తి చూసిన పాపాన పోలేదు.

ఇదంతా ఈవాళ మేము కొత్తగా తెలుసుకున్న వాస్తవం కాదు. ఇప్పటికిప్పుడే మాకు స్ఫురించిన సత్యమూ కాదు. ప్రేమా నేను సహాధ్యాయులం, డిగ్రీవరకు కలిసే చదువుకున్నాం. అప్పట్లో ఎన్నోసార్లు మా క్లాసులో ఇలాంటి వ్యాఖ్యానాలు, వెక్కిరింపులు, అశ్లీలాలు సెమినార్లరూపంలో మారుమ్రోగిన సందర్భాలు ఎన్నో వున్నాయి.



డేవిడ్ మరీ గంభీరంగా తయారయ్యాడు.

ఇంట్లో వున్నంతసేపూ మాటలే రాని మూగవాడిలా కూర్చుని వుండేవాడు. ఇద్దరి మధ్యన మాటలు పొదుపు కావటంతో ఇల్లంతా నిశ్శబ్దంతో బావురుమంటూ వుండేది.

మౌనానికి గల శక్తి విచిత్రమైనది. మనుషుల్ని, మనసుల్ని నిలువుగా చీల్చి చెండాడే శక్తిగల మౌనం మా దాంపత్యజీవితంలో వికటాట్టహాసం చేయసాగింది.

ఉదయాన్నే లేవటం, గబగబా తయారు కావటం, ఆదరబాదరగా ఆఫీసులకు పరుగెత్తడం, రాత్రి అలసిపోయి ఇంటికి చేరుకోవటం, ఎడమొహం పెడమొహం పెట్టుకుని పక్కలపై చేరటం, మాకు అలవాటుగా మారిపోయింది. అతనిలో ఉత్సాహం పొంగులెత్తిన రోజున నేను మంచుగడ్డలా చల్లగా వుండిపోయేదాన్ని నాలో ఉత్సాహం వురకలేసిన రాత్రి అతను కొరకరాని కొయ్యలా మారిపోయేవాడు.

ఇంటినుంచి బైక్‌మీద బయలుదేరాక నన్ను కింగ్స్‌కోర్టు హోటల్‌ముందు దింపేసి అతను బైక్‌తోసహా మాయమైపోయేవాడు. సాయంత్రం నా పని ముగిసేసమయానికి ఠంచనుగా వచ్చి నాకోసం ఎదురుచూస్తూ హోటల్‌ముందు నుంచునేవాడు. స్టాండులోని ఆటో డ్రైవర్‌లా!

ఇంతకీ అతను నన్ను ఎందుకు పెళ్ళిచేసుకున్నాడు? సుఖాలకోసం ఆశపడి, ఆ ఆశల గూటిలో ఇద్దరం బందీలయ్యామా?

ప్రేమ అనేది "ఊరుకో... అంతా చక్కబడుతుంది. ఈ మగవాళ్లంతా ఒట్టి మూర్ఖులే. వివేక్‌లా భ్రమల్లో బ్రతికే పిచ్చివాళ్ళు. నువ్వు పట్టుసడలిస్తే నెత్తిమీదికి ఎక్కి కూచుంటారు. ఆ డేవిడ్‌ను ఎప్పట్లాగే పికప్, డ్రాపు చేస్తూ వుండనివ్వు. డేవిడ్ ఆ పనులకే తగినవాడు. అతనికి గిటారు ఆభరణం. నా వివేక్‌కి పద్యాలే భూషణాలు"

ఆమె మాట్లాడుతున్నప్పుడు ఆమె వెలిబుచ్చిన ప్రతి అభిప్రాయమూ వాస్తవమే అని





పిస్తుంది. అయితే ఇంటికి రాగానే ఊపిరి కట్టివేసే మౌనం నన్ను వుక్కిరిబిక్కిరిచేసే స్తుంది. రోజువారీ దినచర్యలన్నీ క్రమబద్ధ మైన కంప్యూటర్ ప్రోగ్రాముల మాదిరి జరి గిపోయేవి. మామధ్య కోపగించుకోవటాలు లేవు, ప్రేమ సంభాషణలు లేవు. అలకలు-అర్థింపులు లేవు, పలకరింపులూ లేవు. అంతటా స్మశానమౌనం. ఒకవేళ ఏ మాట లైనా ప్రేమగా మాట్లాడితే వ్యంగ్యపు మాట లుగానో వ్యర్థాలాపనలుగానో మిగిలిపో తాయి.

మదిలో మంటల్ని రేపే మౌనంలో ఎలా బతకటం! ఒక్కమ్మాట కూడా మాట్లాడ కుండా రోజంతా కలసి వుండటం అనేది ఎంతటి భయంకరమైన శిక్ష!

ఈ భయంకర మౌనంలో బతకలేని నేను మహారాజా ప్యాలెస్ దీపాలంకరణ చూద్దాం రమ్మని డేవిడ్‌ను పిలుచుకుని వెళ్ళే దాన్ని. అయితే అక్కడి దీపాల తోరణాలు చూసి కూడా అతని కళ్ళు తళుకుమనేవి కావు. ప్యాలెస్ ముందరిభాగంలో వున్న పచ్చటి గడ్డిపరుపుపై ఒంటరిగా కూర్చుండి పోయేవాడు. దీపాలు ఆర్పినవెంటనే వచ్చిన పని అయిపోయిందన్నట్టు బయలుదేరటా నికి లేచి నుంచునేవాడు. నేను మౌనంగా అతన్ని అనుసరించేదాన్ని. ప్యాలెస్‌లోని అసంఖ్యాక దీపాలే మనిషి జీవితంలో కలల విత్తనాల్ని నాటకుంటే ఇక దేనివల్ల అతనికి జీవితంపట్ల స్పందన, నమ్మకం కలుగుతాయో నాకు అంతుబట్టలేదు.

ఆరోజు చాలా ఆహ్లాదకరమైన రోజు...

నాకు, డేవిడ్‌కు ఎదురుగా ప్రేమ, వివే క్‌లు ఉన్నారు. మహారాజా ప్యాలెస్ దీపాల తోరణాలకు ఎదురుగా మావి చూడముచ్చ టైన రెండు జంటలు!

అయితే నేను, డేవిడ్ వెళ్ళి హనీమూన్ విరసపు అంచుల్లో వూగిసలాడుతూ వుంటే ప్రేమ, వివేక్‌లిద్దరూ ఇంకా పెళ్ళికి ముందు సహజంగా ఉండే సరసపుటంచుల్లో మునిగి తేలుతున్నారు.

ఆరోజు ఆదివారం కావటంతో అందరు అక్కడే కలుసుకుని మాట్లాడుకుంటూ కూర్చున్నాం.

చుట్టుపక్కల అంతటా కోలాహలం రేపు తున్న జనసందోహం. అక్కడ తిరుగాడే ఒక్కొక్కరిలోను ఒక్కోరకమైన సంభ్రమం. పూర్వపు రాజుల వైభవానికి ప్రతీకలా నిలిచి ఉన్న అంతఃపుర ప్రాంగణంలో సామాన్యజనం సైతం ఠీవిగా సంబరంగా విహరిస్తున్నారు. అమ్మాయిలను అల్లరి పెట్టే కుర్రకారు, భుజాలమీద పసిపిల్లల్ని కూర్చోబె ట్టుకుని బయలుదేరిన తండ్రుల జంబూ సవారి, బెలూన్లు అమ్మేవారు, భర్తల భుజా లకు అతుక్కుపోయి వగలుపోయే భార్యలు, విజిల్ వూదుతూ తిరుగాడే కావలి మను షులు వీరందరి వెనక రంగురంగుల దీపాల్లో దేదీప్యమానంగా వెలిగిపోతున్న రాజభవనం!

నలుగురం ఆ జనసందోహం మధ్యనే కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నాం. లేదు... లేదు... కబుర్లు చెప్పుకునే ప్రయత్నం చేస్తున్నాం. నిజానికి అదొక వ్యర్థప్రయత్నం మాత్రమే. మా నోటివెంట సహజమైన మాటలు రావటమే గగనమైపో యింది. తాము మాట్లాడే మాటలు ఎదుటి వారిలో ఏ ప్రతిక్రియను రేకెత్తిస్తాయో, ఎలాంటి పరిణామాలకు దారితీస్తాయో అని అందరిలోనూ ఒకటే భయం.

వివేక్ భావకవిలా ఫోజివ్వబోయి భంగ పడ్డాడు. అతని తీరు నాటకీయంగా, కృత్రి మంగా అనిపించింది. అతనూ డేవిడ్ కళ్ళ తోటే ఒకరితో ఒకరు మాట్లాడుకొన్నట్టు అనిపించింది. మేము మాత్రం తక్కువ తిన్నామా అన్నట్టు నేనూ, ప్రేమ కూడా కళ్ళ తోటే నవ్వుకున్నాం. వీరిద్దరూ కలిసి ఎంతగా మాట్లాడుకున్నారో అంతకుమించి

ఎన్నో రెట్లు మేమిద్దరం మాట్లాడుకున్నాం సుమా అనే అర్థాన్ని సూచించే చిరునవ్వు అది.

మామధ్య ఈ దాగుడుమూతలు చాలా సేపు నడిచాయి. ఆ దాగుడుమూతలు పురుషజాతికి వ్యతిరేకంగా స్త్రీ, స్త్రీ జాతికి విరుద్ధంగా పురుషుడు నడిపే 'కుట్ర'ల్లా వున్నాయి. అయితే ఇదంతా అనవసరమైన పోటీ అనే ఇంగితజ్ఞానం నాకూ ఉంది. అయితే ఏవో దుష్టశక్తులు మాచేత ఈ నాటకం ఆడిస్తున్నాయనిపించింది.

అంతలో ప్రేమ మేము ఆడుతున్న ఈ నాటకాన్ని రక్తికట్టించాలన్నట్టుగా నావేపు వొంగి చెవిలో ఏదో గుసగుసగా అంది. ఆమె భలే కిలాడిపిల్ల! "స్టెల్లా..." అని ఆమె అనటం మాత్రమే నాకు వినిపించింది. అయితే నేను ఏదో కొత్త రహస్యం విన్నట్టు మొహంపెట్టి 'హహ్హాహ్హా...' అంటూ నవ్వాను. డేవిడ్, వివేక్ లిద్దరిలోను కల వరం పుట్టించటానికే నేనలా నటించాను. 'మీ ఇద్దరి బండారం బయటపడింది' అన్నట్టు మేమిద్దరం గట్టిగా నవ్వసాగాం.

మా ధోరణి చూసి వాళ్ళిద్దరిలో నిజంగానే కలకలం రేగింది. డేవిడ్ వివేక్‌వేపు వొంగి అతని చెవిలో ఏదో రహస్యంగా చెప్పాడు. బహుశా అది మేము ఆడుతున్న నాటకంలాంటిదే కావచ్చు... లేదా మేముఆ డుతున్న వుత్తుత్తి నాటకం పసిగట్టి ఆ సంగతి మిత్రునికి తెలిపాడేమో. లేదా నా గురించి ఏదైనా నీచంగా మాట్లాడాడా? నాలో అసహనం పెరిగింది. అతనిపై పగ తీర్చుకోవటానికన్నట్టు నేను కూడా ప్రేమ చెవిలో ఏదో వూదాను. డేవిడ్ మళ్ళీ వివేక్ చెవిలో గుసగుసలాడాడు.

అలా మా మధ్య ఓ పోటీ ఏర్పడింది. వుద్దేశ్యరహితమైన, బూటకపు ఆత్మాభిమానాల పోటీ అది. ఫలితంగా రెండు జంటల్లోనూ నవ్వులే నవ్వులు. ఈ నవ్వుల గల గలలు మనసుల్ని సేదదీర్చి స్వాంతన చేకూర్చటానికి బదులు అపనమ్మకపు గంభీర వాతావరణాన్ని సృష్టించాయి.

హనీమూన్‌లో నా ప్రవర్తన గురించి డేవిడ్ చులకనగా మాట్లాడి వుండవచ్చనే అనుమానం నా మనసులో మెదిలి మన సంతా అల్లకల్లోలమైంది. ఇక వుండబట్టలేక నోరు తెరచి అడిగేశాను.

"మీరేం మాట్లాడుకున్నారో చెప్పండి? "

"ముందు మీరు మాట్లాడుకున్నది చెప్పండి? " వివేక్ ఎదురు ప్రశ్న వేశాడు.

"ముందు మీరే చెప్పాలి" ప్రేమ మొండిగా అడిగింది.

"ముందుగా మీరే చెప్పాలి. ఆ తరువాత మేం చెబుతాం" వివేక్ పట్టుబట్టాడు.

చివరికి ప్రేమ బయటపడింది "నిజానికి మేం మాట్లాడుకున్నది ఏమీ లేదు. మిమ్మల్ని ఆటపట్టించాలని ఏదో మాట్లాడు కున్నట్టు నటించాం" అంది.

"మేమూ అంతే. ఊరకే నాటకం ఆడాం. అందులో ఏ రహస్యమూ లేదు" అన్నాడు డేవిడ్.

అప్పుడు నలుగురం మనసారా నవ్వు కున్నాం. మొదటిసారిగా మా గుండెల్లోంచి వుబికి వచ్చిన సహజమైన నవ్వు అది. ఏమీ లేకుండానే ఏదేదో వూహించుకున్న మా అతితెలివికి, వ్యర్థమైన, అనవసరమైన, అహంకారానికి సిగ్గు పడాల్సివచ్చింది.

అయితే-

మామధ్య రహస్యాల్లు లేనేలేవా? చెవుల్లో ఊదని, ఊదటానికి సాధ్యం కాని రహస్యాలు... ఉండవచ్చు ఉండకపోనూ వచ్చు

నేను ఈ ఆలోచనల్లో వుండగానే మహా




రాజా ప్యాలెస్ దీపాలు ఆర్పేశారు.

★ ★ ★

ఒకరోజు.

రహస్యానికి విత్తనం దొరికింది.

అది మొలిచింది.

ఆ తరువాత చిగురించింది.

చిగిర్చి నా జీవనమార్గంలో ఒక రమ్యమైన చీలికకు దారితీసింది.

ఆవేళ డేవిడ్ ఛదులైన తన గిటార్ తీగల్ని బిగించి కడుతూ దాన్ని శృతిచేసుకుంటున్నాడు. అతని మొహంలో ఏదో సరి కొత్త జీవకళ!

'ఓరి మగడా, ఇంతకాలానికి కాస్త మనిషిలా కనిపిస్తున్నావ్, ఫరవాలేదు' అనుకుంటూ నేను లోపలికి నడిచాను.

టీపాయ్‌మీద 'స్టార్ ఆఫ్ మైసూర్' పత్రిక పేజీలు గాలికి రెపరెపలాడుతున్నాయి. అనుకోకుండా నా దృష్టి ఆ పత్రికలోని ఓ ప్రకటనపై పడింది. అందుకు కారణం ఆ ప్రకటన పెన్సిల్‌తో మార్కు చేయబడివుంది.

నేను కుతూహలంగా దాన్ని చదివాను. డేవిడ్ ఇచ్చిన ప్రకటన అది.

'గిటారు నేర్పబడును. ఆసక్తిగలవారు కింది చిరునామాలో సంప్రదించి గిటారు నేర్చుకోగలరు' అంటూ కింద మా ఇంటి చిరునామా ఇవ్వబడి వుంది.

కొత్తగా ఏదో ఒక వ్యాపకం పెట్టుకున్నాడులే అనుకుని నేనూ సంతోషించాను. ఆ సంతోషంతోనే అతనికి టీ చేసి ఇచ్చాను.

అదేరోజు సాయంత్రం నుంచే కుర్రాళ్ళు రావటం మొదలయ్యింది. ఆడపిల్లలెవరూ రాకపోవటం చూసి నేను డేవిడ్‌ని వెక్కిరించాను.

"నువ్వు అమ్మాయిలకు గిటార్ నేర్పవా? "

నా మాటలకు అతను ఖంగుతినలేదు.

"అదేమీలేదు అమ్మాయిలు వస్తే వాళ్ళకూ నేర్పుతాను" అన్నాడు నెమ్మదిగా.

అయితే అమ్మాయిలెవరూ రాలేదు. కనీసం ఒక్క అమ్మాయి అయినా గిటారు నేర్చుకోవటానికి వస్తే బాగుండుననిపించింది. అమ్మాయి రావాలి, డేవిడ్ ఆమెతో అఫైర్ నడపాలి, నేనది కళ్లారా చూడాలి. అప్పుడే కదా నేనతన్ని వెక్కిరించగలిగేది. 'నువ్వూ మామూలు మగాడివే...' అంటూ దెప్పిపొడవగలిగేది.

ఊహూ! ఆ అదృష్టం నాకు దక్కలేదు. అతని దగ్గర గిటారు నేర్చుకోటానికి ఒక్క ఆడ గుడ్లగూబ కూడా రాలేదు. కాకపోతే పిచ్చిమొహాలేసుకుని పది పన్నెండుమంది వెర్రిబాగుల కుర్రాళ్ళు మాత్రం క్రమం తప్పకుండా రోజూ వచ్చేవారు.

నా ఇంట్లో వారి రాక నాకు పెద్ద న్యూసెన్స్‌గా మారిపోయింది. ఈ తలనొప్పినుంచి విముక్తి పొందాలనే ఆలోచనతో ఓ రోజు ఇంటిబయట మరోచోట ఎక్కడైనా మ్యూజిక్ క్లాసులు నడుపుకోమని డేవిడ్‌కు సూచించాను.

అందుకు డేవిడ్ నింపాదిగా జవాబిచ్చాడు. "మైసూరులో అద్దెలు ఆకాశాన్నంటుతున్నాయి. ఆ లెక్కన స్టూడెంట్స్ ఇచ్చే ఫీజులు అద్దెకే తక్కువ పడతాయి. పోనీ క్లాసులు మానేద్దామనుకున్నా సాధ్యంకాదు. ఇప్పటికే స్టూడెంట్స్ దగ్గర అడ్వాన్స్ తీసుకున్నాను. ఒకవేళ నీకు మరీ ఇబ్బంది కలిగిస్తూ వుంటే నువ్వు డ్యూటీకి వెళ్ళిపోయాక క్లాసులు మొదలెడతానులే" అంటూ తన అసహాయతను వెలిబుచ్చుకున్నాడు.

ఇది నాకు ఏమాత్రం ఇష్టంలేని విషయం. మగవాళ్ళలో అసహాయతను, చేతకానితనాన్ని చూస్తే నాకు అసహ్యమేస్తుంది.

ఎలాగైనా అఘోరించు అనుకుంటూ నేను మవునంగా వుండిపోయాను.

ఇంట్లో పిల్లగిటారుల సంఖ్య పెరగసాగింది. ఉదయం నేను ఇంటినుంచి హోటల్ కి బయలుదేరాక మొదలయ్యే ట్రింగ్... ట్రింగ్ ల గోల నేను సాయంకాలం ఇల్లు చేరుకోగానే ఎవరో ఆజ్ఞాపించినట్టుగా ఆగిపోయేది. రోజూ ఇదేవిధంగా జరిగేది.

ఆ ఆదివారం రోజు స్పెషల్ మ్యూజిక్ క్లాసు వుండకపోయి వుంటే బహుశా నా జీవితంలో ఆ కొత్త మలుపు సంభవించి వుండేది కాదేమో...!

ఆ స్పెషల్ క్లాసులో నాకు కనపడిన ఆ స్పెషల్ కుర్రవాడి పేరే రాబర్ట్!

అతను చాలా అందంగా వున్నాడు.

నవయవ్వనోత్సాహంతో తుళ్లిపడుతూ వున్నాడు.

లోకం అంది - నువ్వు వివాహితవు, పర పురుషుడిని కన్నెత్తి చూడకూడదు.

మనస్సు అంది - అతన్ని కనులారా చూడు. అతనెంత అందంగా వున్నాడో తెలుసా?

ధర్మం అంది - పతియే ప్రత్యక్షదైవం.

మనస్సు అంది- జీవిస్తే రాబర్టు వంటి వ్యక్తి తోడుగా వుంటేనే జీవించాలి.

సమాజం అంది- నువ్వు గురుపత్నివి. నువ్వు అతనికి తల్లితో సమానం.

మనస్సు అంది- అతని వుంగరాలజుత్తు, మెరిసే బుగ్గలు, జీవనోత్సాహంతో తుళ్ళిపడే తుంటరి కళ్ళు, గడ్డంలేని ముఖం, ఆహా! మగసిరి వుట్టిపడుతున్న అసలైన మగవాడు ఇతనే!

  

లోకానికి, ధర్మానికీ, సమాజానికి సమ్మతం కాని దాన్నే మనస్సు ఎందుకు కోరుకుంటుంది? అలా కోరుకోవటాన్ని లోకం, ధర్మం, సమాజం పాపంగా ఎందుకు పరిగణిస్తుంది? అదే పాపమైతే మనస్సులో అలాంటి భావాలను పుట్టించే ప్రకృతికి ఆ పాపంలో భాగంలేదా? కోరికలను నియంత్రించకపోవటం తప్పు అనుకుంటే, ఆ కోరి కల్ని, ఆశల్ని సృష్టించటం తప్పుకాదా? క్యూలో డేవిడ్ కన్నా ముందే రాబర్టుని విధి ఎందుకు నిలపలేదు?

విధి నాతో ఎందుకిలా దాగుడుమూతలాడుతోంది?

ఆరోజు రాబర్ట్ ఇచ్చిన 'లైవ్ బ్యాండ్' కార్యక్రమానికి వెళ్లాను. అబ్బా! అతన్ని చూడటానికి రెండు కళ్ళూ చాల్లేదు. అతనిలో జీవనోత్సాహం, యవ్వనోత్సాహం, నవనవోత్సాహం పోటీలు పడుతున్నట్టనిపించింది.

ఆ రాత్రంతా అతను ఆడుతూ పాడుతూ గంతులేశాడు.

నాలో తారుణ్యం మళ్ళీ తిరిగొచ్చింది...

యవ్వనం పడగలు విప్పుకుంది...

ఏదో హోటల్ లోని ఏదో గదిలో నన్ను నేను అతనికి వడ్డించుకుని తనివితీరా అతనికి తినిపించాను. అయినా చాల్లేదు!

శతాబ్దాల దాహమేమో?

తీరనేలేదు...

అటు తరువాత...

డేవిడ్ కి భయపడకుండా ధైర్యంగా తిరిగాను.

అయినా నా దాహం తీరలేదు!

చివరికి ఒకరోజు

రాబర్ట్ వెంబడి బొంబాయి రైలు ఎక్కాను.

నన్ను క్షమించు ప్రేమా! నీకూ వివేక్ కూ ఈ సంగతి చెప్పటానికి కుదరలేదు.

అందరూ నన్ను 'లేచిపోయింది' అని





అంటారని తెలుసు.

అననీ!

ఉన్నచోటే వుండి, పాచికట్టిన డేవిడ్ గడ్డపు వాసన, చెమటకంపు, దగ్గు, కంటి పుసులను భరించటానికి బదులుగా జింక లాంటి రాబర్ట్ దేహంలో దేహమై- ఉత్సాహంగా గంతులేస్తూ, స్వేచ్ఛాలోకపు సరికొత్త గాలిని పీలుస్తాను.

## నాయకుడు

భయంకర మౌనం రాజ్యమేలుతున్న ఆ ఇంట్లోకి నిశ్శబ్దంగా ప్రవేశించాను. ఒకప్పుడయితే ఆ ఇల్లు నా అత్త కూతురు అయిన 'ప్రేమ'ది. ప్రస్తుతం అది నా భార్య ఇల్లు. ఒక్కోసారి ఒక్కోరకమైన అవతారంలో దర్శనమిస్తుందా ఇల్లు. నేనా ఇంట్లోకి ప్రవేశించిన ప్రతిసారీ అది ఇదివరకటి ఇంటిలా కాకుండా కొత్తగా అనిపిస్తుంది.

ఇంటి పై కప్పును దయ్యాల్లాంటి స్థంభాలు కిందికి పడకుండా పట్టి నిలిపినట్టుగా నుంచుని వున్నాయి. వసారా చాలా విశాలంగా వుంది.

అంత పెద్ద ఇంట్లో నా 'ప్రేమ' అనే పుష్పం సంపూర్ణంగా వికసించి సుగంధాలు వెదజల్లుతూ వుంది. ఆమె తల్లి, తండ్రి కొందరు పనివాళ్ళు తప్ప ఆ ఇంట్లో ఇంకెవ్వరూ లేరు. పెద్ద బంగాళాలా వున్న ఆ ఇంట్లోని మేడమీదున్న ఒకానొక గదిలో నా ప్రేమ వుంటుంది.

ప్రేమ తన తండ్రి నడిపే అగరొత్తుల ఫ్యాక్టరీ వ్యవహారాలు చూసుకుంటుంది. 'నాకు ఈ పిల్ల కొడుకుతో సమానం బాబూ' అంటూ ఆమె తండ్రి బడాయిగా చెప్పుకోవటానికి కారణం ఇదేనని నాకు బాగా తెలుసు. ఆడపిల్లగా పుట్టిన మనిషి, జమా ఖర్చులు రాస్తూ కూర్చునే బదులు చక్కటి గృహిణిగా సంతోషంగా గడపడం సంతృప్తి నివ్వదా? ఫ్యాక్టరీ కార్మికులకు జీతాలు చెల్లించే చోటుకెళ్ళి కూర్చోవాల్సిన అవసరమేమిటి? జీతం పెంచమని అడిగినవారినీ, ఒకరోజు పని ఎగ్గొట్టిన వారినీ ఎడాపెడా తిట్టి వారిజీతం కొయ్యమని తండ్రికి సిఫార్సు చేస్తుంటుంది కూడా మహా పిసినారి.

ఆ సంగతి అలా వుంచితే ఆమె ఇప్పుడు హఠాత్తుగా మా కుటుంబానికి యజమానురాలై కూచుంది. నా తల్లిదండ్రులు కూడా ఆమెనే సమర్థిస్తారు.

"కనీసం మాకు కోడలయినా బుద్ధిమంతురాలు దొరికింది. మా అబ్బాయి ఒక్కరోజు కూడా షాపులో కూర్చోలేదు. ఒక్కరోజైనా అద్దెలు వసూలు చెయ్యలేదు. రెండిండ్ల ఆస్తిపాస్తుల వ్యవహారాలు చూసుకోవటం వాడికి చేతకాదు. మేం ఎన్నాళ్ళుంటాం? మా తదనంతరం ప్రేమ ఈ బాధ్యతల్ని సమర్థవంతంగా నిర్వహించగలదు" అంటూ ఎంతో ఆదరంగా ప్రేమను మా కుటుంబంలోకి ఆహ్వానించి అతి ముఖ్యమైన స్థానమిచ్చేశారు.

ఈ ఆలోచనలతోటే నేను ప్రేమ గదిలోకి అడుగుపెట్టాను.

అప్పుడు ప్రేమ ఈజీ ఛైర్‌లో కూర్చుని దీక్షగా ఫైళ్ళు చూస్తోంది. ఆమె కూర్చున్న తీరు తను ఈ దేశానికి ప్రధానమంత్రిని అన్నట్టు డాబు చూపుతున్నట్టుంది. ఆ వెధవ ఫైళ్లకు బదులు మంచి పుస్తకమొకటి చదవొచ్చు కదా!

హఠాత్తుగా నాకో చిలిపి ఆలోచన తట్టింది.

ఆమె చూడకుండా వెనకనుంచి వెళ్ళి ఆమె కళ్ళు మూసి భయపెట్టాలనీ, ఓ చిన్న సైజు సరస శృంగార కాండని నడపాలనీ అనుకున్నాను. దగ్గర్లో అత్తగారు కూడా కని

పించలేదు.

నేను దొంగలా అడుగులేస్తూ ఆమె వెనక్కి చేరాను. ఇక ఆమెను ఆట పట్టించా లనుకునేంతలో ఆమె తల తిప్పకుండానే "ఎప్పుడొచ్చావు? " అంది నెమ్మదిగా.

నేను నిరాశగా అన్నాను- "ఓహ్, నిన్ను భయపెట్టాలనుకున్నానే..."

"ఆ పప్పులేం నా దగ్గర వుడకవు" అంది కాసింత గర్వంగా.

తర్వాత నావైపు తిరిగి "కాఫీ చేసి ఇవ్వనా? " అంటూ ఉత్సాహంగా పైకి లేస్తూ తన చేతుల్ని దండలా నా మెడ చుట్టూ వేసింది.

"కాఫీ ఇవ్వటమేమిటి? ఇప్పుడు నేను చెప్పబోయే తియ్యటి వార్త వింటే వున్న ఫళాన వెయ్యి ముద్దులు ఇచ్చేస్తావ్!" నేను సస్పెన్స్ క్రియేట్ చేస్తూ అన్నాను.

"ఏమిటో ఆ తియ్యటి వార్త? " నా షర్టు కాలర్ని పట్టి సుతారంగా లాగుతూ గోముగా అడిగింది.

ఆమెను కాస్సేపు ఏడ్పించాలనిపించింది. "అదొక గుడ్ న్యూస్. ఆ న్యూస్ నీకు సంబంధించినదే. అత్తగార్ని పిలువ్. మామగార్ని రానివ్వు. అందరిముందు అనౌన్స్ చేస్తాను"

ఆ గుడ్‌న్యూస్ ఏమిటో అర్జెంటుగా చెప్పె య్యమని బతిమలాడసాగింది.

ఆ సమయంలో ఆమె ఎంత అందంగా కనిపించిందో! రకరకాల భావాలు, వర్ణనలు అందమైన స్త్రీలో కలగలసినప్పుడు ఆ స్త్రీ సౌందర్యం రెట్టింపు అందచందాల్ని, ఆకర్ష ణనీ సంతరించుకుంటుంది. ఆ సౌందర్యపు మాయా స్వరూపాన్ని తనివితీరా చూడసా గాను.

"అదేమిటో చెప్పమ్మా" అంటూ ఆమె నన్ను ప్రాధేయపడటం నాకెంతో సంతో షాన్ని కలిగించింది.

"ముందు ఆ వెధవ అకౌంట్ ఫైల్సన్నీ దూరంగా పారెయ్" అన్నాను.

నేను చెప్పబోయే తియ్యటి వార్తను వినటం కోసం చెప్పిందంతా చేసింది. ముఖంమీద త్రికోణాకారంలో మూడు ముద్దులు పెట్టమని మరో షరతు విధిం చాను. నుదుటి మీదొకటి, రెండు చెంప లపై ఒకటొకటి పువ్వులాంటి మృదువైన ముద్దుల్ని పెట్టింది. "నేనూ ఓ ముద్దు పెడ తాను" అంటూ ఆమె ఎర్రటి పెదాల్ని అందుకుని అధర మధుర రసాన్ని తనివి తీరా గ్రోలాను.

"అబ్బా, ఇక చాలు! ముందు విషయమే మిటో చెప్పు" అంటూ మారాం చేసింది.

"ఏమై ఉంటుందో వూహించు చూద్దాం" అన్నాను వుడికిస్తూ.

"ఏదైనా నగ తెచ్చి వుంటావు!" అందామె.

నేను చిరుకోపంతో నుదురు కొట్టుకు న్నాను...

"అది కాకపోతే ఏదైనా కొత్త ప్లాటు కొను క్కుని వుంటావు" అంది.

"నా ఖర్మ" అనుకున్నాను.

"అదీ కాకపోతే 'వివేక్ ట్రేడర్స్'లో మంచి లాభం వచ్చివుండాలి" అంది ఉత్సాహంగా.

ఆమె చెప్పిన మూడు సమాధానాలు విన గానే వువ్వెత్తున ఎగిసిపడుతున్న నాలోని వుత్సాహం సర్రున దిగిపోయింది. ఏం మాట్లాడాలో తోచక మౌనంగా నుంచుండి పోయాను.

నగల్ని, ప్లాటుని, డబ్బుని మాత్రమే **తియ్యటి** వార్తలుగా భావించే ఈ శ్రీమం **తుల** అమ్మాయి ఎదుట నేనిప్పుడు **తెచ్చిన తియ్యటి** వార్తని చెబితే నిజంగానే **అది ఆమెకు తియ్యటి వార్త అవుతుందా?** అని సందేహం కలిగింది.




చివరికి జేబులోంచి రిజర్వేషన్ టిక్కెట్లు బయటికి తీసి, అవి ఆమె చేతికి అందించకుండా నా చేతిని పైకెత్తి తెచ్చిపెట్టుకున్న ఉత్సాహంతో అన్నాను-

"రిజర్వేషన్ చేసుకొచ్చానోయ్! రేపు ఆదివారం ఉదయం పదిగంటల ట్రైనుకు మన హనీమూన్ మొదలవుతుంది"

ఉత్సాహం సర్రున దిగిపోయే వంతు ఇప్పుడు ఆమెదయింది. పెద్దగా రగడ చేస్తున్నట్లు కోపంగా అంది- "నేను హనీమూన్‌కి రాను. నువ్వొక్కడివే వెళ్ళు" అంది.

"ఒక్కడినే వెళితే అది హనీమూన్ ఎలా అవుతుంది? దేశాటన అవుతుంది గానీ..." అంటూ ఆమెకు నచ్చజెప్పటానికి శతవిధాలా ప్రయత్నించాను.

తనకు చెప్పకుండా, తనను అడక్కుండా హనీమూన్ కోసం టిక్కెట్లు తేవటం ఆమెకు మింగుడు పడలేదు. కోపంతో మాట్లాడకుండా కూర్చుండిపోయింది. ఇలా ఆమె బిగుసుకుపోయి కూర్చోవటం, నేను బతిమిలాడ్డం ఎన్నిసార్లు జరుగలేదు?

"నేను కొంచెం కోపంగానే అన్నాను-

"హనీమూన్‌కి తీసుకెళతానంటే ఏడిచే భార్యను నిన్నే చూశాను"

ఆమెకూడా నాపై విరుచుకుపడింది.

"పెళ్లయి వారం తిరక్కుండానే హనీమూన్ బయల్దేరిన భర్తను నేనూ ఈనాడే చూస్తున్నాను. అయినా నాతో మాటమాత్రంగానైనా చెప్పకుండా ఎందుకు రిజర్వేషన్ చేయించావు? చాముండేశ్వరికి ఇంకా పూజలు చేయించలేదు. శ్రీరాముని గుడికి ఇంకా వెళ్లనేలేదు. నా స్నేహితురాళ్ళను, బంధువుల్ని ఇంకా సరిగ్గా పలకరించనైనా లేదు. రిజర్వేషన్ క్యాన్సిల్ చేయించు, నేను రాను"

"ప్లీజ్... ప్లీజ్... కాదనకు టిక్కెట్టు దొరకటం కష్టం. అష్టకష్టాలు పడి టిక్కెట్లు సంపాదించాను. హనీమూన్ నుండి వచ్చాక గుళ్ళూ గోపురాలకు రోజూ వెళ్ళ నిన్నెవరు వద్దంటారు? "

ఆమె ఓ క్షణం మౌనంగా వుండిపోయింది.

"ఇంతకీ ట్రిప్ ఎక్కడికి వేశారు? " అడిగింది.

"కులూ వ్యాలీకి!"

"కులూవ్యాలీ? "

"ఎస్. కులూవ్యాలీయే!" అంటూ నేను కాస్త పారవశ్యంతో మునిగినట్లు కళ్ళు అరమూతలు పడుతుండగా 'కులూ' లోయల అందచందాల్ని వర్ణించటం మొదలెట్టాను.

"అక్కడేం వుంది? " ఆమె కంఠంలో ఉత్కంఠత ధ్వనించింది.

"లోతైన లోయలు, హిమ పర్వత శ్రేణులు, వేడి నీటి బుగ్గలు, రోరిచ్ అద్భుత మ్యూజియం... ఒకటేమిటి... అక్కడున్నవన్నీ విశేషాలే"

"ఈ ప్రయాణానికి ఎంత ఖర్చవుతుంది? "

ఆమె అడిగిన ఈ ప్రశ్నకి నా అరికాలి మంట నెత్తికెక్కింది. అయితే నా కోపతాపాలు ఈ ధనవంతుల ఆడపిల్ల ముందు పని చెయ్యవని మరుక్షణమే గుర్తొచ్చింది.

"చూడు ప్రేమా, ఈ ట్రిప్పుకి పదివేలు ఖర్చు కానీ ఆ పదివేలు నేనే పెడతాను. హనీమూన్ ఆనందంగా గడపటం ముఖ్యంగానీ డబ్బు ముఖ్యం కాదు. నీది మరీ 'అతి' అయ్యింది" నేను కాస్త బాధగా అన్నాను.

"'అతి' నాది కాదు, నీదే! ఇక్కడే వున్న కె. ఆర్. ఎస్, నంజనగూడు, బేలూరు, హళిబీడులాంటి ప్రదేశాలు చూడ్డం హనీమూన్ అన్పించుకోదా? హనీమూన్‌కోసం అంత దూరం వెళ్ళాలా? పదివేలు! ఖర్చుపెట్టేది



నీ డబ్బు అయినా నీ డబ్బు నా డబ్బు కాదా? " అంది రోషంగా.

సరిగ్గా అప్పుడే మా అత్తగారు రంగప్రవేశం చేశారు. మా మాటలన్నీ విన్నట్టున్నారు. కూతుర్ని గదమాయిస్తూ, "అబ్బాయి అంతగా ముచ్చట పడుతుంటే నువ్వు మరీ ఇంత మొండిగా మాట్లాడటం నాకేం నచ్చలేదు. కాస్త పిసినారితనం తగ్గించుకొని అతనితో హాయిగా హనీమూన్‌కి వెళ్ళిరా" అన్నారు.

అత్తగారి మాటలతో నాలో మాయమైన ఉత్సాహం మరలి వచ్చింది.

"ప్రేమా, నువ్వు పైసా తేనక్కర్లేదు. ఖర్చంతా నాదే. నేను కాలేజీ రోజుల్లో కులూకి ట్రెక్కింగ్‌కు వెళ్ళాను. ఎంత అద్భుతమైన ప్రదేశమో తెలుసా? బహుశా నీ జన్మలో అలాంటి సుందర దృశ్యాల్ని చూసి వుండవు. అక్కడికి వెళ్ళాక నీ నోటివెంట ఇదేమాట రాకపోతే అప్పుడను..." అన్నాను.

ఆ దెబ్బతో 'ప్రేమ' అనే ఆ రాజకుమారిని, సుందరసుకుమారిని నావెంట 'హనీమూన్' అనే 'తేనెజాబిలి' యాత్రకు బయలుదేరదీయాలనే నా ప్రయత్నం ఫలించింది.

★ ★ ★

స్టేషన్లో రైలు నిల్చుని వుంది...

అది నన్ను మహత్తరమైన లక్ష్యంవేపు తీసుకెళ్ళే రహదారిలా పడుకుని వుంది. మా పనివాళ్ళు సూట్‌కేసుల్నీ, బెడ్డింగుల్నీ, చిరుతిళ్ళ బుట్టల్నీ మా కంపార్టుమెంటులోకి చేర్చారు. డేవిడ్ ప్రేమను పక్కకి తీసుకెళ్ళి ఏవో సలహాలు ఇస్తున్నాడు. అతనేం చెప్పగలడు? బహుశ 'భర్తను బాగా చూసుకో' అని చెబుతుండాలి.

'వివేక్ అండ్ ఫామిలీ' అని వేసిన పేర్లను ఛార్ట్‌లో వెదికాక లగేజీని లెక్కపెట్టసాగాను. మా అమ్మనాన్నలు, ఆమె తల్లిదండ్రులు, షాపులోని పనివాళ్ళు, నా స్నేహితులు బసణ్ణి, డేవిడ్, ప్రభు, మనులతో పాటు ఆమె కాలేజీ ఫ్రెండ్స్ అందరూ వచ్చారు. నాలో అహం పెంచటానికి అన్నట్టు వాళ్ళంతా ప్రేమకి హితబోధలు చేశారు. "నువ్వు కాస్త మొండిదానివి. పిసినారివి. వెళ్ళినచోటల్లా పైస పైసకూ లెక్క వెయ్యకు. ఆయనతో జాలీగా గడుపు..." ఇలాంటి సలహాలు ఆమెకు పదేపదే చెప్పారు.

ఇద్దరి ఇళ్ళనుంచి వచ్చిన చిరుతిళ్ళ బుట్టలు భారీ లగేజీని తలపిస్తున్నాయి. ఇక ప్రేమ ఒంటినిండా నగలతో మహారాణీలా వెలిగిపోతోంది.

ఏ కారణంవల్లనో తెలియదుగానీ రైలు బయలుదేరుతున్న సూచన కనిపించగానే మా అత్తగారి మంచితనం, మామగారి ప్రేమాభిమానాలు నన్ను హఠాత్తుగా భావుకుణ్ణి చేశాయి. ఒక్కసారిగా వంగి వాళ్ళ పాదాల్ని తాకాను. నా కళ్ళల్లోంచి కన్నీటి చుక్కలు రాలి వాళ్ళ పాదాలపై పడి వుండాలి.

ముఖ్యంగా మా అత్తగారు అచ్చం మా అమ్మలా వుంటారు. మా ఈ హనీమూన్ యాత్రకి తన కూతుర్ని ఒప్పించటంలో ఆమె ముఖ్యపాత్ర వహించారు.

ఆ తర్వాత మా అమ్మ నన్ను దగ్గరికి తీసుకుంది.

"వివేక్, ప్రేమను కష్టపెట్టకురా. ఒక్కగానొక్క కూతురు కావటాన గారాబంగా పెరిగిన పిల్ల. ఆమెతో సర్దుకుపోవాలి సుమా" అంటూ నాతల నిమిరింది. అప్పుడు కూడా నా కళ్ళల్లో కన్నీళ్ళు తిరిగాయి. ఎవరూ గమనించకుండా తుడుచుకున్నాను.

డేవిడ్ అడిగాడు "మళ్ళీ ఎప్పుడు తిరిగొస్తారు? మిమ్మల్ని రిసీవ్ చేసుకోవటానికి

# ఏరిన ముత్యాలు

★ అడ్డదారులు తొక్కి సాధించే విజయం నిజమైన విజయం కాదు

-సర్. పి. సిడ్నె

★ సకాలంలో చర్య తీసుకుంటే దాని ఫలితం పది కాలాలపాటు పనికి వస్తుంది

-లావెటర్

★ నిజానికి తనదైన ఒక నుడికారం ఉంటుంది. అబద్ధం దానిని ఎప్పుడూ అనుకరించలేదు

-లార్డ్‌నేపియర్

★ సహేతుకత వున్నచోటే శాంతి వుంటుంది

-డబ్ల్యు కొలిన్స్

★ దేశభక్తి అంటే మస్తిష్క మథనంలో హాలాహలం తర్వాత వచ్చే అమృతం లాంటిది

-ఆస్కార్‌మైల్డ్

★ అసూయ, ఆవేశం మనిషి జీవిత కాలాన్ని తగ్గిస్తాయి

-ఎక్లెసిమాస్టెస్

★ తన విధులను ఆసక్తి అంకితభావంతో నిర్వహించేవాడెప్పుడూ జీవితంనుంచి పారిపోడు

-శామ్యూల్ గోల్డ్విన్

★ ఆసక్తి పట్టుదల వుంటే కొండలను కదిలించవచ్చు. మూర్ఖులను రంజింపజేయవచ్చు. అది లేకుండా ఏ విజయమూ సాధ్యంకాదు

-బ్యూమేర్ లిట్టన్

★ తాను అసలు తప్పులే చేయలేదని ఎవరైనా అంటే అతడు అసలు ఏమీ చేయడంలేదనే అర్థం చేసుకోవాలి

-ఇ.జె. ఫెల్ప్స్

★ ధర్మం లేని రాజకీయాలు మురికి కూపాలు

-బర్క్

★ ఇతరుల తప్పుల్ని ఎత్తిచూపి నిందించేముందు సమాజంలో వారు చేసిన మంచిని కూడా గమనించాలి

బైనాసామెత

★ జడలు ధరించినా లేక శిరోముండనం చేయించినా కాషాయ వస్త్రాలు ధరించినా తెలుసుకోవలసిన జ్ఞానం తెలుసుకోనపుడు ఈ వేషాలన్నీ ఉదర పోషణార్థమే. ఇవి వృథా.

-ఆది శంకరాచార్య

సేకరణ : కొత్రుగడ్డ వెంకట్రావు




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

సెప్టెంబరు చతుర నవల తేనెజాబిలి

.......................................................................

**సమీక్షకుని పేరు :** .......................................................

**చిరునామా :** ...............................................................

.......................................................................

.......................................................................

.......................................................................

స్టేషన్‌కు నేను రానా? "

"ఇప్పటి ప్రోగ్రాం ప్రకారం పదహారుకి తిరిగొస్తాం. నీకు వెళ్లగానే ఉత్తరం రాస్తానులే" సమాధానం చెప్పాన్నేను.

డేవిడ్ తన దగ్గరున్న ఉలెన్ స్వెట్టర్ యిస్తూ- "అక్కడ చాలా చలిగా వుంటుంది. ఇది తీసుకెళ్ళు" అన్నాడు ప్రేమగా.

"నా దగ్గర వుందిలే, వద్దు" అని ఎంత వారించినా అతను విన్పించుకోలేదు.

"ఉండనీ, చలివేసినప్పుడు దీన్ని వేసుకో. నా గుర్తుగా నీ దగ్గరే వుండనీ" అన్నాడు. మళ్ళీ చెవిలో మెల్లిగా చెప్పాడు- "మొన్న రెస్టారెంట్‌లో నేను ఏదేదో వాగాను. దాన్ని నువ్వేం సీరియస్‌గా తీసుకోకు. అది నేను చూసిన, అనుభవించిన జీవితం మాత్రమే. నీ జీవితం సుఖంగా గడవాలని నాకోరిక"

అదే సమయంలో నాన్నగారు నా దగ్గరికి వచ్చి- "డబ్బు, ట్రావెలర్స్ చెక్స్ అన్నీ తీసుకున్నావా? ఇంకా డబ్బు కావాలా? " అనడిగారు.

నాకు నోట మాట రాలేదు. ప్రేమించే ఆత్మీయులు ఇంతమంది నాచుట్టూ వున్నారు కదా అనిపించింది. మైసూరుకు చెందిన పరువు ప్రతిష్ఠలు గల రెండు గొప్ప కుంటుంబాలనుంచి వచ్చిన నన్నూ, ప్రేమను సాగనంపటానికి మొత్తం మైసూరు నగరమే స్టేషన్‌కు తరలి వచ్చిన అనుభూతి కలిగింది.

"నాన్నగారూ, నా దగ్గర కావాల్సినంత డబ్బుంది. మీరేం చింతించకండి. మీ ఆరోగ్యం జాగ్రత్త. ప్రతి చిన్నా పెద్దా పనికి షాపుకు తిరగొద్దు. నేను తిరిగొచ్చాక షాపు పనులు చూసుకుంటాను" నా కంఠంలో ధృఢ నిశ్చయం ధ్వనించింది.

"ఫరవాలేదోయ్, నా కోడలు నీలో గొప్ప మార్పు తెచ్చిందే..." ఆయన పెద్దగా నవ్వేస్తూ, సంతోషంగా అన్నాడు.

ఆ నవ్వుల తరంగాలు గాలిలో తేలి ఇంజన్ డ్రైవర్ చెవిని సోకినట్లున్నాయి. వెంటనే ట్రైన్‌ని కదిలించాడు.

మేము చేతులు వూపుతూ టాటా చెప్పాం. మైసూరు నగరాన్ని వదులుతుంటే తల్లి గూటిని వదిలి ఆకాశంకేసి ఎగిరిన పిల్ల పక్షిలో కలిగే ఉత్సాహం, బాధ రెండూ ఒకేసారి నాలో కలిగాయి. చివరిసారి అన్నట్టు భయసంతోషాల మిశ్రమ భావాలతో అమ్మానాన్నల, అత్తామామల ముఖాల్ని స్థిత ప్రజ్ఞత గల డేవిడ్ మోమునీ, బసణ్ణి, ప్రభు, మనుల తుంటరి నవ్వుల్నీ మనసులో గబగబా నింపుకున్నాను. నాకు తెలుసు ఇలాంటి దృశ్యాలు జీవితంలో మళ్ళీ పునరావృతం కావు. జీవితంలో తిరిగి రానివన్నీ అమూల్యమైనవి. అందువల్లనే నన్ను సాగనంపటానికి వచ్చిన సున్నిత హృదయులందరికీ మనస్సులోనే ధన్యవాదాలు అర్పించుకున్నాను.

రైలు వేగం పెరగటంతో ఆ ముఖాలన్నీ నానుంచి దూరం... మరింత దూరం కాసాగాయి.

"చివరికి నేనే గెలిచాను" కాలర్ ఎగరేస్తూ అన్నాను. సంతోషంతో నా ముఖం వెడల్పయింది.. విజయగర్వంతో నవ్వాను. నాకు నిజంగానే గర్వంగా అనిపించింది.

మనసు గాలిలో తేలియాడసాగింది.

రైలు బెంగుళూరు స్టేషన్‌ని సరిగ్గా నాలుగుంపావుకు వదిలింది.

"రిటర్న్ జర్నీకి కూడా రిజర్వేషన్ చేయించావా? " ప్రేమ హఠాత్తుగా అడిగింది.

"ఓ" నేను ముక్తసరిగా జవాబిచ్చాను.

"ఏదీ, టికెట్లు చూపించు" అంది.

నేను విసుక్కున్నాను. "అబ్బా! అన్నీ రెడీగా వున్నాయిలే. అవన్నీ సూట్‌కేసు అడుగున వున్నాయి. తర్వాత చూద్దువుగాని. ఇప్పుడు వాటన్నిటిని బయటికి

లాగటం ఎందుకు? ఇదిగో కాలక్షేపం కోసం ఈ పుస్తకం చదువు. చాలా బాగుంది" అంటూ 'ఒన్ హండ్రెడ్ ఇయర్స్ ఆఫ్ సాలిట్యూడ్' పుస్తకాన్ని ఆమె చేతికి అందించాను.

"ఈ పుస్తకాన్ని ఎంతకు కొన్నావు?" చప్పున అడిగింది.

"నేను ఎంతకు కొన్నానన్నది వదిలెయ్, ఈ పుస్తకానికి 1982లో నోబెల్ ప్రైజ్ వచ్చింది తెలుసా? నువ్వు తప్పకుండా చదవాల్సిన పుస్తకం ఇది" అన్నాను.

కాని ఆమె పుస్తకం చదవలేదు. ఊరికే పేజీల్ని అటూ ఇటూ గబగబా తిప్పేస్తూ వుండిపోయింది.

అదే సమయంలో కొన్ని ఫ్లాష్‌బ్యాక్‌లు నా తలను ఆక్రమించుకున్నాయి.

మా ఇద్దరికీ బాల్యస్నేహం. ఇద్దరికీ పాత బంధుత్వాలున్నాయి. కలిసిమెలిసి ఆడుతూ పాడుతూ పెరిగాం. చిన్నప్పట్నించీ ఆమెను 'పొట్టిపిల్ల' అంటూ జడపట్టి లాగుతూ వెక్కిరించేవాణ్ణి. గిల్లేవాణ్ణి, కొట్టేవాణ్ణి.

ఆమె తండ్రి మహా తెలివైనవాడు. ఆయనకు అగరొత్తులు తయారుచేసే ఓ ఫ్యాక్టరీ వుంది. తన ఫ్యాక్టరీలో అగరొత్తుల తయారీకి అయ్యే ఖర్చుకంటే ఎక్కువగా వాటి ప్రకటనల కోసం ఖర్చు పెడుతుంటాడాయన.

మా నాన్నగారూ, మామగారు ఇద్దరూ సరిసమానమైన ఐశ్వర్యవంతులు! 'జగన్మోహిని ప్యాలెస్' వుండే రోడ్డులో కాస్త ముందుకువెళితే ఎదురుగా పెద్ద రావిచెట్టు వుంది కదా, దాని కుడిపక్కనే 'వివేక్ ట్రేడర్స్' అని పెద్ద బిల్డింగ్ వుంది. అది మాదే. ఆ బిల్డింగ్‌పైన షాపులన్నీ మావే! రెండు మూడువేల రూపాయల అద్దె వస్తుంది.

నాకు మా కొట్లో గల్లాపెట్టె ముందు కూర్చోవాలంటే ఎక్కడలేని విసుగు పుడుతుంది. ఊటీనుంచి వచ్చే ట్రంకాల్స్, ఉల్లిపాయల మూటలు, కోడిగుడ్ల ధరలు, బంగాళాదుంపల రేట్లు... ఈ గొడవలన్నీ నా మనస్తత్వానికి సరిపోవు. తన కొడుకు తనలా బాడిగలు వసూలు చేయాలనీ, ఉల్లిపాయలు, బంగాళాదుంపల మూటలు లెక్క రాయాలనీ మా నాన్నగారి ప్రగాఢ వాంఛ. ఈ రోజు కాకపోతే రేపయినా ఆ పనులు చేయకపోతానా అని మా నాన్నగారు ఆశగా ఎదురు చూస్తున్నారు.

ఇక నాది ఆకాశంలో చుక్కల్ని మాత్రమే వెదికే కుర్రతనం. చాముండి కొండల ఒడిలో కూర్చుని పద్యాలు, కవితలు రాయాలనే పిచ్చితనం. అమ్మను బాధ పెట్టడం ఇష్టంలేక ఎప్పుడైనా షాపుకెళ్ళినా అక్కడుండే కూరగాయ మూటల ఘాటు ముక్కుకు సోకగానే అక్కడ్నించి వెంటనే పారిపోవాలనిపించేది. లారీవాళ్ళ, మూటలు మోసే కూలీల అరుపులు, స్టాక్ రేట్లు నా తలను తినేసేవి.

నా భావనా ప్రపంచమే వేరు. నేను రాసిన కవితలు ప్రచురణార్హత లేనివని నాకు తెలుసు. ఆ కవితలన్నీ ఆయా సంపాదకుల విచారాన్ని ప్రకటిస్తున్న జవాబులను జతపరచుకుని తిరిగొచ్చినవే. అయినప్పటికీ నేను నా కవితల్ని ప్రేమించటం మానలేదు. ఇప్పటికీ వాటిని అభిమానిస్తాను. ఎందుకంటే వాటినిండా నేనే నిండి వున్నాను. నా "ప్రేమ" కూడా వుంది. జగత్తునూ, జీవన రీతుల్నీ అత్యధికంగా ప్రేమించేవాడు మాత్రమే కవికాడు. నాలా ప్రేమను ప్రేమించేవాడు సైతం కవే! వాళ్ళు నా రచనల్ని ప్రచురించనీ, ప్రచురించకపోనీ, నేను మాత్రం కవినే!

నాకు ఎందువల్లనో 'తత్వ శాస్త్రం'లో ఎం.ఏ. చేయాలన్పించింది. 'నువ్వుకూడా అందులోనే చేరు' అని ప్రేమను కూడా కోరాను. కాని ఆమె నామాట వింటే కదా,




ఆమె 'ఆర్థిక శాస్త్రం' తీసుకుంది. మా మధ్య అభిరుచుల్లోనూ, సిద్ధాంతాల్లోనూ ఎన్నో భిన్నాభిప్రాయాలు వున్నాయి. ఆమె ఎన్నడూ నా కవితల్ని చదవలేదు. చదవ కుండానే వాటిని విమర్శించే శక్తియుక్తులు మాత్రం ఆమెకున్నాయి. ఇలాంటి వైవిధ్యమ యమైన స్త్రీని నేను అమితంగా ప్రేమించటా నికి గల కారణాలేమిటో అది ఎలా సాధ్య పడిందో నాకే తెలియదు. 'ప్రేమ గుడ్డిది' అనటం అందుకేనేమో!

నేను ప్రేమను అంతగా ప్రేమిస్తున్నా ఆమె నన్ను బాధపెట్టిన సందర్భాలే ఎక్కువ. ఎన్నోమార్లు ఎంతో బాధపడ్డాను. అలాంటి సమయాల్లో ఇక ఆమెను ప్రేమిం చకూడదు అని గుండెల్లో గట్టి నిర్ణయం చేయ ప్రయత్నించి ఘోరంగా విఫలమయ్యే వాడిని. విచిత్రమేమిటంటే ఇలా ఆమె ద్వారా భంగపడిన ప్రతిసారీ, ఆమెపట్ల గల ప్రేమ అది మోహం కావచ్చు-మరింత పెరు గుతూ పోయింది. అందుకు కారణం ఆమె అద్భుత సౌందర్యం కావచ్చు! ఆ రూపసి ముందు నేనొక 'గుడ్లగూబ'ననిపిస్తుంది. ఆమెతో కలిసి కాలేజీ క్యాంపస్‌లో అడు గుపెట్టడమే నాకు గర్వకారణం. అది నాకు ఒక అద్భుత అనుభవం! ఆమెను నా బైక్ మీద కూర్చోబెట్టుకుని 'ఈ సౌందర్యవతి, అప్సరస నా అత్తకూతురు, నాకు కాబోయే భార్య' అంటూ వీధి వీధిలో మూగగా చాటి చెబుతూ వెళ్ళటం నాకెంతో ఇష్టమైన విషయం! అలాంటి మరువలేని, మరపు రాని అనుభవాలెన్నో మామధ్య చోటు చేసు కున్నాయి.

అయితే వివాహానికి ముందు నేనెప్పుడూ తప్పటడుగు వేయలేదు. ఆమెను నా శారీ రక వాంఛలకు బలి చెయ్యలేదు. ఆమె పాదాలపై పూలు జల్లుతూ మానసిక ఆనం దాన్ని పొందే భక్తుడనయ్యాను గానీ కామో ద్రేకంతో ఇంగితజ్ఞానం మరిచే కాముకు డిలా, క్రూర మృగంలా ప్రవర్తించలేదు. గట్టిగా ముద్దుపెట్టుకుంటే ఆ సుకుమార సుందర పుష్పం ఎక్కడ నలిగిపోతుందో అని జాగ్రత్త పడుతూ ఆమెను కంటికి రెప్పలా కాపాడుకుంటూ వచ్చాను.

ప్రేమ అనేది ఒక సుందర పుష్పం. దానిపై దుమ్ము, ధూళి పడకుండా జాగ్ర త్తగా, శుభ్రంగా వుంచాలి. పెళ్ళయ్యాక ఆ పుష్పం తాలూకు సుగంధాన్ని ఆఘ్రాణించే అవకాశాలు, పడక సుఖాలకై ఎత్తే అవతా రాలు ఎలాగూ వుంటాయి కదా!

ఏది ఏమైనా ఈ అపురూప అందాలరా శికి యజమానిని నేనే. అందువల్ల నా కామపు బురదతో ప్రేమను ఎన్నడూ మలినం చేయకూడదని నిర్ణయించుకు న్నాను.

ఇలాంటి నా సిద్ధాంతాల కారణంగానే నేను ప్రేమని ఎప్పుడూ తాకలేదు. కేవలం ఆరాధించాను. పగలూ, రాత్రి ఆమె జ్ఞాప కాల జ్వాలలో దహించబడి పరిపక్వత చెందాను. ఆమె మూడ్ బాగోలేనప్పుడు తరిమేసినా, వూరికే తిట్టించుకుని వచ్చాను కూడా.

నాకో అలవాటు వుంది. అది డైరీ రాయటం! అందులో రోజు వారీ జరిగే ప్రతి చిన్న విషయాన్ని రాసేవాణ్ణి. నా డైరీ లోని ప్రతిపేజీ ప్రేమ గురించిన విష యాలు, వర్ణనలతోనే నిండిపోయింది. ఆమె కనుల అందాన్ని వర్ణించడానికి ఎన్ని పుటలు కేటాయించానో...? అంతేకాదు, ఆమె నన్ను నొప్పించిన రోజులోనూ నేనా డైరీ రాయటం మానలేదు. నేను ఆమెను ప్రేమించటం నూటికి నూరుపాళ్ళు వాస్తవం! డైరీల్లో వాస్తవాలు వుండాలి కదా. అందువల్ల నా డైరీలో వాస్తవాల్నే రాశాను. ఆ కారణంగా నా డైరీ అనేది ఓ కవితా సంకలనం లాంటిది. దాన్ని జాగ్రత్తగా

కాపాడుకుంటూ నా దగ్గరే వుంచుకున్నాను.

## నాయిక



**అ**వును! వివేక్ డైరీలోని ప్రతిపేజీలో నా గురించే రాయబడింది.

అతని దృష్టిలో నేనొక దేవతను!

ఇది నాకెంతో సంతోషాన్ని కలిగించే విషయమే. ప్రతి స్త్రీ తనను ఆరాధించే మగవాడినే కోరుకుంటుంది. పూజింపబడటం ఎవరికి మాత్రం ఇష్టముండదు.

అయితే వివేక్‌ది మరీ మితిమీరిన ప్రవర్తన. కవితల్ని రాస్తూ కాలయాపన చేసే అతని పిచ్చిని గానీ, తండ్రికి చేదోడువాదోడుగా వుంటూ కష్టించి పనిచెయ్యడం మానేసి బాధ్యతారహితంగా ప్రవర్తించడాన్ని గాని నేనెన్నడూ క్షమించలేను. అతనికి డబ్బు విలువ తెలియనే తెలియదు. ఆ డబ్బే గనక లేకపోయి వుంటే మా నాన్నగారు సుశీలా మహల్ వంటి విశాల భవంతిని కట్టించగలిగేవారా? మైసూరు నగరం మొత్తంమీద అలాంటి భవనం లేదు. 'మీ ఇల్లంటే మామూలు ఇల్లు కాదే, రాజ భవనమే!' అంటూ నా ఫ్రెండ్స్ పొగిడితే వివేక్ మాత్రం 'ఇంత పెద్ద ఇంట్లో మీరు ముగ్గురే వుండటం విచిత్రంగా లేదూ? మీకిది మరీ పెద్ద ఇల్లాయె' అని అనేవాడు. ఎన్నెన్నో కర్ర చెక్కడాలు, ఫర్నీచర్లు మా ఇంట్లో ఉన్నాయి.

మా ఇంటి ముందే సిటీ బస్టాప్ వుంది. 'ఎవరండీ! సుశీలా మహల్, సుశీలా మహల్, దిగండి' అంటూ బస్ కండక్టర్లు మా ఇంటి నామజపం చేయటం, 'సుశీలా మహల్‌కి రెండు టికెట్లు కొట్టండి' అంటూ ప్రయాణీకులు అడగటం ఇలా అనునిత్యం ప్రజల నోట్లో నానే అదృష్టం ఎవరికి దొరుకుతుంది? పైగా మా ఇంటి మలుపులో డ్రైవరు సిటీ బస్సుని టర్న్ చేయటం ఎంత తమాషాగా వుంటుందో... సీటునుంచి లేచి నుంచుని చకచకా స్టీరింగ్ తిప్పే ఆ భంగిమ, లాంగ్ హార్న్ కొట్టే ఆ ఫోజు... ఇదంతా కేవలం మా 'సుశీలా మహల్' కోసమే! మా నాన్నగారే గనక అలాంటి అద్భుత భవంతిని కట్టించకుండా వుండి వుంటే అక్కడి బస్టాప్‌కు ఏదో చెత్త పేరు పెట్టి వుండేవారు. ఇప్పుడు అందరి నోటా మా ఇంటిపేరే...

మా అగరొత్తుల ఫ్యాక్టరీలో పనిచేసే ఆడ కూలీలకు జీతాలు పంచేది నేనే. ఆ పని మా నాన్నగారిమీదే వదిలేస్తే, ఆయన మతిమరుపువల్ల పని చెయ్యని రోజులకు కూడా కూలీవాళ్ళకు జీతాలు ఇచ్చేస్తుంటారు. నేను అక్కడికి వెళ్ళిన వెంటనే 'అమ్మగారు వచ్చారు' అంటూ పనివాళ్ళు ఉలిక్కిపడటం చూస్తే నాకు మనసులో గర్వంతో కూడిన సంతోషం కలుగుతుంది. 'ఏమే, వూరికే వస్తుందా డబ్బు? ఒళ్ళొంచి పనిచేసి సంపాయించండే గాడిద మొహల్లారా!' అంటూ నేను చెడామడా తిట్టినా ఎవరూ నోరెత్తరు. దోసిలి పట్టి నేను లెక్క చూసి ఇచ్చింది కిమ్మనకుండా పుచ్చుకుంటారు. దరిద్రులు! యూనియన్ ఏర్పాటు చేస్తే ఏ కీలుకాకీలు

విరగ్గొట్టేస్తానంటూ బెదిరించాక మా ఫ్యాక్ట రీలో ఎవరూ ఆ ధైర్యం చెయ్యలేక పోయారు. నా తడాఖా అలాంటిది మరి.

ఈ వివేక్‌కి ఓ వెయ్యిసార్లు చెప్పి వుంటాను. ఓసారి మా ఫ్యాక్టరీకి వచ్చి మా అడ్మినిస్ట్రేషన్ ఎలా వుందో చూడమని! అతడు వినిపించుకుంటేనా? ఫ్యాక్టరీవైపు కన్నెత్తి కూడా చూడలేదు. నా కాలేజీ దగ్గ రికి మాత్రం క్రమం తప్పకుండా బైకు తీసు కుని వచ్చేవాడు.

అతను ప్రతిరోజు నన్ను వెదుక్కుంటూ కాలేజీకి రావటం ఎందుకో ఈమధ్య నాకు సరిపడటంలేదు. చేతిలో బండి వుందికదా అని తిరగడమేనా? పెట్రోల్ దండగ కాదూ? ఏభై పైసలు పారేస్తే ఎంచక్కా మా ఇంటిముందరే బస్టాప్‌లో బస్ దిగొచ్చు. ఓ బస్ పాస్ తీసుకుంటానని చెప్పినా విన్పించుకోలేదు. అతనికి డబ్బు పొదుపు చెయ్యటమే తెలీదు. తన బైకుమీద నన్ను కూర్చోబెట్టుకుని అడ్డమైన చోట్లకి తిరుగుతూ డబ్బుని మంచినీళ్లలా ఖర్చుపె ట్టడం మాత్రం బాగా తెలుసు. పనికిరాని ఆర్ట్సు గ్యాలరీలకూ, మ్యూజియంలకు వెళ్లి అడ్డమైన వస్తువులు కొని డబ్బు తగలేస్తుం టాడు. అర్థంకాని సినిమాలకు పిలుచుకెళ్లి తలాతోకా లేని ఆ సంఘటనల్ని ఉత్సా హంగా వివరిస్తూ నన్ను బోర్ కొట్టిస్తాడు. నేను చేసేదేం లేక వూరికే 'ఆఁ... ఊఁ' అంటూ బలవంతంగా అతని సోది వింటుం టాను.

మా మామగారు గొప్ప శ్రీమంతులు! రేపు ఆయన ఆస్తిపాస్తులన్నీ ఈ వివేక్ చేతిలోకి వస్తే అతను నెల తిరిగేసరికి ఆస్తంతా ఖాళీ చేసేసి రోడ్డున పడతాడేమో నని నాకు అనుమానమేస్తుంటుంది. అందు వల్ల ఇకనుంచి మా ఇద్దరి ఆస్తిపాస్తుల్ని నేనొక్కదాన్నే చూసుకోక తప్పదు. ఇతని పాకెట్ మనీకి రోజూ కొంత డబ్బిచ్చేస్తే సరి. ఇతనికి అంతకంటే ఇంకేం అక్కర్లేదు.

ధనవంతుల అబ్బాయిగా పుట్టి కూడా కవి తలు రాస్తాడట! ఫిలాసఫీ చదువుతాడట! అవన్నీ దరిద్రులు చేయాల్సిన పనులని ఎంత చెప్పినా చెవికెక్కదు. కవితలు రాయటం గొప్పతనమా? నా మాదిరి ఎక నామిక్స్ మెయిన్ సబ్జెక్ట్‌గా తీసుకుని వుంటే డబ్బు వ్యవహారాల గురించి కొంతలో కొంతయినా తెలిసివుండేది.

ఇవే ఆలోచనల మధ్య నేను కిటికీలోంచి తొంగిచూశాను. ట్రైన్ ధర్మవరం స్టేషన్‌లో ఆగివుంది.

వివేక్ నావైపు చూస్తూ "టొరినో తాగు తావా? " అనడిగాడు.

"ఖరీదెంతో కనుక్కో" అన్నాను.

అతనికి కోపం వచ్చింది. "నీది మరీ అతి అయ్యింది. ఖరీదు ఎంతైనా ఫరవాలేదు. తాగాలని అనిపిస్తే తాగు లేదా మానెయ్" నన్ను కసురుకుంటూ అన్నాడు.

అతను అందించిన టొరినో తాగుతూ అడిగాను "మన ప్రయాణం ఏయే ఊర్లమీ దుగా సాగుతుంది? "

వివేక్ వివరించాడు, "ఇక్కడ్నించి నేరుగా ఢిల్లీ! అక్కడ్నించి చండీగడ్ మీదుగా కులూకు ప్రయాణం... అక్కడ్నించి మనాలి... ఇక ఆపై ఇదే రూటులో తిరుగు ప్రయాణం!"

నేను ఒక సలహా ఇచ్చాను- "వివేక్, వెళుతూ వెళుతూ దారిలో కొన్ని దేవాలయా లైనా దర్శించి వెళదాం. తమిళనాడులో ఎన్నో దేవాలయాలున్నాయటగా!"

అతను బయటికి చూస్తూ కొంటెగా నవ్వాడు.

"హనీమూన్‌కి వెళ్ళేవాళ్లు గుళ్లూ గోపు రాలూ చూడరు సుమా" అన్నాడు. ఓ క్షణం ఆగి మళ్ళీ అన్నాడు, "దేవుడంటే

ప్రేమ! ప్రేమ అంటే మంచితనం! ఈ మంచితనమే మనలో వుంటే దేవుళ్లు, దయ్యాలు, పుణ్యస్థలాలు, పూజలు ఇవేవీ అక్కర్లేదు"

ఈ వివేక్ పాడు ఫిలాసఫీ చదివి ఏదేదో నేర్చుకున్నాడు. ఈ జన్మలో ఇతనికి బుద్ధి రాదు. నాకే గనక తెలివితేటలు లేకపోతే ఈ రెండిండ్ల ఆస్తిపాస్తులు మట్టికొట్టుకు పోవటానికి ఎంతోకాలం పట్టదని అనుకున్నాను.

అప్పుడే వివేక్ డైరీ నా కంట పడింది. చప్పున దాన్ని లాక్కున్నాను.

"ఇతరుల డైరీల్ని చదవకూడదు సుమా" అన్నాడు వివేక్.

"ఇతరుల డైరీలు చదవకూడదు. కాని భర్త డైరీని చదవొచ్చు" నేను మొండిగా అన్నాను.

"నేను నీ భర్తని కాను" అతను కొంటెగా నవ్వుతూ అన్నాడు.

"ఏదీ, ఆ మాట కాస్త గట్టిగా అను, చూద్దాం! అక్టోబర్ రెండున పాత అగ్రహారపు విద్యాభారతి కళ్యాణ మంటపంలో నా మెడలో తాళి కట్టింది నువ్వు కాదా?" అంటూ మెడలోని మాంగల్యాన్ని బయటికి తీసి చూపించాను.

అది చూసి అతను ఓ క్షణం మౌనంగా వుండిపోయాడు.

"అది కాదు ప్రేమా, అది నా పర్సనల్ డైరీ! అందులో నా కోసం, నా ఒక్కడి కోసం రాసుకున్న డైరీ. నా వ్యక్తిగత ఆలోచనలు అందులో వున్నాయి. నాకు ఏ విషయం ఎలా అనిపించిందో అలాగే రాసుకున్నాను. ఆ విషయాలు చదివితే నీకు విసుగు, కోపం, బాధ కలగవచ్చు నువ్వు బాధపడ్డం నాకిష్టంలేదు. అందువల్ల దాన్ని చదవకు" అన్నాడు.

"అలాగైతే నేను దీన్ని తప్పకుండా చదువుతాను" అంటూ పట్టుబట్టాను.

"సరే, నీ ఇష్టం..." అతను నిస్పృహాయంగా అన్నాడు.

ఆ తర్వాత నేను డైరీ తెరిచి పేజీలు తిరగేశాను. ఓ పేజీలో-

ఒక ఆదివారం!

"ఈరోజు నేనూ ప్రేమ తగువులాడుకున్నాం. సర్వసాధారణమైన 'దుబారా' ఖర్చు గురించి! నేను ఒక్క నయాపైసా సంపాయించటం చేతగాని వాడినని ప్రేమ నా ముఖంమీదే అనేసింది. నేను మనసులో మౌనంగా దుఃఖించాను. ఆమెకు కావల్సిన ధనాన్నీ, ఆస్తిపాస్తుల్నీ తను ఒక్కతే దాచుకుని పూజ చేసుకోనీ, అయితే నేను మాత్రం ఆమెనే పూజిస్తాను. కేవలం డబ్బు కారణంగా నేను ప్రేమను ప్రేమించకుండా వుండలేను, ఆమెకు దూరంకాలేను"

ఓ శుక్రవారం సాయంత్రం!

"సూర్యాస్తమయ సమయంలో నాకిలా అనిపించింది-

ఓ సూర్యభగవాన్! ఈ జగత్తులోని సత్యాలన్నీ నీకొక్కడికే తెలుసు! నీకు నా ప్రేమ గురించి తెలుసు. 'ప్రేమయుద్ధం'లో నేను మళ్ళీ మళ్ళీ అవమానింపబడుతున్నాను. ఆమె అకారణంగా నాపై మండిపడుతోంది. నా ప్రేమపూరితమైన మాటలన్నీ, కన్నీటి చుక్కలై కరిగిపోతున్నాయి. ప్రేమ లేకుండా నేను బ్రతకలేను. నీవు నీ లేత కిరణాల ద్వారా ఆమెకు ఉపదేశించు. వివేక్ అనే ఈ పిల్లవాడు కేవలం నీ బంధువుకాదు, నీ పాదసేవకుడు, నీ సౌందర్య ఆరాధకుడు... అని నా మనసులోని మాటలన్నీ చెప్పి ఆమె మనసుని కరిగించు. చల్లగాలి, నీ లేత బంగారు కిరణాలు, పక్షుల కిలకిలారావాలు ఇవి తప్ప నా ప్రేమను వేరెవరూ మార్చలేరు"




నాకు ఆశ్చర్యం వేసింది. కిరణాలు, గాలి, పక్షుల కిలకిలలు ఇవన్నీ మనిషి మనసు లోకి ప్రవేశించటం సాధ్యమేనా? ఈ వివేక్ ఎంత పిచ్చివాడు అనిపించి నవ్వుకున్నాను.

తర్వాత డైరీలోని మరో పేజీ తిప్పాను. కుతూహలంతో నా కళ్లు అక్షరాల వెంట పరిగెత్తాయి.

సోమవారం!

కణకణలాడుతున్న ఎండ.

నేను ప్రేమను తీవ్రంగా, గాఢంగా ఇష్టప డుతున్నాను. 'నా ఇష్టాలు ఎన్నటికీ విఫలం కాకూడదు భగవాన్!' అని వేడుకుంటు న్నాను. మండుతున్న ఎండను చూడగానే అనిపించింది. ఈరోజు ఖచ్చితంగా వర్షం కురుస్తుందని! ఊహించినట్టుగానే సాయం సమయానికి మబ్బులన్నీ గుట్టుగా ఓవేపు చేరి ఆకాశంలో సద్దు చేయసాగాయి. హోరుమంటూ వర్షం మొదలయింది. ఆమెకు సోమవారం క్లాసు మూడు గంట లకు అయిపోతుందని నాకు తెలుసు. ఈ సమయంలో ఆమె తడిసిపోతూ కాలేజి నుంచి బస్‌స్టాప్‌కు కదిలి వెళుతున్న దృశ్యం నా మదిలో మెదిలి కంగారుపడ్డాను. భోరున పడుతున్న వర్షాన్ని సైతం లెక్క చెయ్యకుండా బైక్ తీసుకుని కాలేజీకి బయ ల్దేరాను.

ఇరవైనాలుగో నెంబరు బస్సు డ్రైవర్‌కి ఎంత పొగరో నాకు బాగా తెలుసు. అమ్మా యిల్ని ఆటపట్టించాలని కావాలని సడన్‌బ్రే కులు వేసి వేధిస్తుంటాడు. కండక్టరూ అంతే! వాళ్ళిద్దరూ మొన్న కాలేజీ క్యాంప స్‌లో అమ్మాయిల్ని వెక్కిరించటం, ఫ్రంట్ డోర్ వద్ద నించోమనటం, తలతిక్కగా మాట్లాడటం- ఇదంతా చూసి మనసు అదోలా అయిపోయింది. నా ప్రేమకు అలాంటి పరిస్థితి రాకూడదు. పైగా సిటీ బస్సుల్లో అమ్మాయిల శరీరాలకు చేతులు, కాళ్లు తగిలిస్తూ ఆనందించే పోకిరీ వెధవల ఆగడాలు మితిమీరిపోయాయి. వీళ్లను చూస్తే నాకు మహామంట! ఈ వర్షంలో నా ప్రేమ పుస్తకాల బరువు మోస్తూ తడిసి ముద్దవటం ఇష్టం లేక నేను నా బైక్ వేగాన్ని మరింత పెంచాను. కాలేజీ చేరుకు నేసరికి నేను నా బాగా తడిసి ముద్దయిపో యాను.

నేను వెళ్ళేసరికి ప్రేమ ఇంకా రీడింగ్ రూమ్‌లోనే వుంది. అప్పటికి వర్షం కూడా కాస్త తగ్గుముఖం పట్టింది.

నేను ఆత్రంగా ప్రేమని సమీపించి "థాంక్ గాడ్, నువ్వెక్కడ వర్షంలో చిక్కుకుని తడిసిపోయావో అని కంగారు పడ్డాను సుమా. లే, వర్షం తగ్గింది, ఇంటికి వెళదాం" అంటూ ఆమె చెయ్యి అందుకుని లేపబో యాను. కాని, అదేదో అసభ్యకర ప్రవర్తన అన్నట్టు ప్రేమ "ఛీ. ఛీ... వదులు" అంటూ విసురుగా తన చేతిని విడిపించుకుంది.

నా మనసు చివుక్కుమంది. నా వేదనను ఆమెకెలా చెప్పాలి? కుండపోత వర్షంలో ఆమె కోసం తడిసి ముద్దయి వచ్చిన నన్ను అలా చీదరించుకోవటం న్యాయమేనా? అప్పటికీ నేను సభ్యతగా 'సారీ' అంటూ చేయి తీసేశాను. నా బట్టల్లోంచి ధారగా నీళ్లు కారుతున్నాయి. చలివల్ల నా శరీరం సన్నగా వణుకుతోంది. నా పరిస్థితి దైన్యంగా వుంది.

కాని...

తన పక్కన కుర్చీ ఖాళీగా వున్నా ఆమె నన్ను కూర్చోమనలేదు.

పైగా "లర్న్ సమ్ డిసిప్లిన్" అంటూ నాకు నీతిబోధ చేసింది.

అన్నిటినీ సహించాను. అప్పుడేమో కరా ఖండిగా చెప్పేసింది. "నువ్వెళ్లు... నేను తర వాత వస్తాను"

నాకు తల తీసేసినంత అవమానంగా

తోచింది. కొందరు మా ఇద్దర్నే గమనిస్తూ వున్నారు. నేను కాస్త కోప్పడుతూ "రా వెళదాం. మళ్ళీ వర్షం ఎక్కువ కావచ్చు నీ కోసం బైక్ తెచ్చాను. పద వెళదాం" అంటూ మళ్ళీ ఆమెను లేపబోయాను.

ఆమె తోక తొక్కిన త్రాచులా ఎగిరిపడింది. "నన్నొదులు. ఎవరైనా చూస్తే ఏమనుకుంటారు? " అంటూ నామీద మండిపడింది.

నాకూ కోపం వచ్చింది. "ఎవరేమనుకుంటారు? మన సంబంధం ఏమిటో అందరికీ తెలిసిందేగా. త్వరలో మనం పెళ్లి చేసుకోబోతున్నాం. ఇవాళే కొత్తగా నిన్ను పికప్ చేయటానికి వచ్చానా? నేను కాకుండా ఇంకెవరైనా నీ కోసం వెతుక్కుంటూ వస్తారా? " అన్నాను.

"నీ పికప్, డ్రాప్‌ల అవసరం నాకు లేదు. మరోసారి డ్రాప్ చేస్తాను. పికప్ చేసుకుంటాను అంటూ ఇక్కడికి రాకు నేను ఫ్రెండ్స్‌తో కలిసి బస్సులోనే ఇంటికి వెళతాను. 'పెళ్ళి చేసుకోబోతున్నాం' అంటూ అందరి ముందూ అసహ్యంగా ప్రవర్తించటం నాకు ఇష్టం వుండదు!" అనేసింది నా ముఖాన. ఇంకా ఆమె ఏదేదో గొణుగుతూనే వుంది. నేనింక వినలేక విసురుగా వెనక్కి తిరిగాను. వర్షంలోనే ఇంటికి వచ్చేశాను.

ఆరోజు నాకు జ్వరం వచ్చింది. రాత్రంతా అమ్మ నా నుదుటిపై చెయ్యి పెట్టే ఉన్నట్టు జ్ఞాపకం.

ఆరోజునుంచి మరెప్పుడూ నేను ఆమె కాలేజీవైపు వెళ్లనేలేదు. నా క్లాసు అయ్యాక నేరుగా ఇంటికి వచ్చి నా గదిలో విషాదగీతాల్ని పాడుతూ గడిపేవాణ్ణి.

ఆరాధించటం నా బలహీనత. ఈ బలహీనత నుండి నేనెప్పుడూ బయటపడలేననే సంగతి ఆమెకు బాగా తెలుసు. ఓ మనిషి మరో మనిషికి అందించే 'ప్రేమ' మనిషి మంచితనానికి నిదర్శనం. దాన్ని హృదయ సంపన్నులు మాత్రమే తిరిగిఇస్తారు. హృదయ దరిద్రులు దాన్ని ఇవ్వలేరు. ప్రేమ భౌతికంగా మాత్రమే సంపన్నురాలు. ఆమె పేరులో వున్న 'ప్రేమ' ఆమె మనసులో లేదు. హృదయపరంగా ఆమె దివాళా తీసింది. ఆమె తండ్రి ఫ్యాక్టరీలో తయారయ్యే అగరొత్తుల సుగంధం ఆమెలో లేనేలేదు. ఆమె తన జీవితాన్ని తనకు ఇష్టమొచ్చిన రీతిలోనే బతకనీ. అయితే ఏదో రోజు రానే వస్తుంది. ఆమెకు నా ప్రేమ విలువ తెలియనే తెలుస్తుంది. ఆమె నా చెంతకు రానే వస్తుంది. నా పూజకు ప్రతిఫలం దొరకనే దొరుకుతుంది. నేనామెను ప్రేమించటం వరకు మాత్రం సత్యమని నమ్మి అప్పటివరకు విషాదగీతాలు పాడుతూ ఆమె కోసం ఎదురుచూస్తూవుంటాను.

ఆదివారం ఉదయం పది గంటలు!

నేను జలాశయంలోని పలచటి అలల్ని కళ్ళార్పకుండా చూస్తూ కూర్చున్నాను.

ఒక గొప్ప మలుపు జీవితంలో హఠాత్తుగా వచ్చింది. పెద్దవాళ్లందరూ కలిసి చాలా రోజుల్నించి తాము కోరుకుంటున్న పెళ్లి జరిపించటానికి నిశ్చయించుకున్నారు. తమాషా ఏమిటంటే ప్రేమ ఈ పెళ్లికి ఒప్పుకుందట. భక్తుడొకడు తన భర్తగా వుండనీ అని ఔదార్యం చూపింది కాబోలు. మరో పక్షం రోజుల్లో మేం దంపతులం కాబోతున్నాం. ఆమె బలవంతంగా ఒప్పుకుందో లేక నామీద జాలివల్లనో...?

ఇదే సంగతి ఆలోచిస్తూ కూర్చుని వుండగా హఠాత్తుగా ప్రేమ నా దగ్గరికి వచ్చింది. నేను తెల్లబోయాను. ఆమె నా పక్కనే కూర్చుంటూ గబగబా మాట్లాడ్డం మొదలెట్టింది.

"వివేక్, మనం పెళ్ళి చేసుకోబోతున్నాం.




ఇకనుంచి నేను నిన్ను నొప్పించను. నువ్వు ఎన్ని కవితలైనా రాసుకోవచ్చు నేను అభ్యంతరం చెప్పను. అయితే పెద్దలు సంపాయించి పెట్టిన ఆస్తి వ్యవహారాలు నువ్వు చూసుకోలేవు. ఆ పని నాకు చేతన వుతుంది. కాబట్టి ఆ వ్యవహారాలన్నీ నేనే చూసుకుంటాను. మనం ఇకపై పోట్లాడుకో కూడదు. నువ్వు నన్నెంతో ప్రేమిస్తున్నావని నాకు తెలుసు" అంటూ ఆమె నా మెడను చుట్టేస్తూ కౌగిలించుకుంది.

నేను ఎంత ఆపుకున్నా కన్నీళ్లు ఆగలేదు. జలజల రాలి ముత్యాల్లా ఆమె చేతులపై పడ్డాయి. "ప్రేమ, ప్రేమ" అంటూ పసిపిల్లా డిలా ఆమె ఒడిలో తలదాచుకుని వెక్కి వెక్కి ఏడ్చాను. దట్టమైన నా జుత్తులో ఆమె వేళ్లు కదిలిస్తూ నన్ను సేదదీర్చింది. నా కన్నీళ్లు తుడిచింది. అప్పటిదాకా నా మనసులో చోటు చేసుకున్న బాధలన్నీ ఒక్కసారిగా మటుమాయమయ్యాయి"

వివేక్ డైరీలో రాసుకున్నవన్నీ వాస్తవాలే! అతను ఏ రోజుకారోజే తనకు అనిపించిన దంతా ఓపిగ్గా కూర్చుని అక్షరబద్ధం చేశాడు. ఎంతైనా అతను ఓ కవికదా! అందువల్లనే తన భావాల్ని చక్కగా వర్ణిం చాడు.

అప్పుడే నాకో ఆలోచన వచ్చింది. మా పెళ్లి వర్ణన ఎలా చేశాడో చూడాలనిపించి మా పెళ్లి జరిగిన అక్టోబర్ రెండోతేదీ నాటి పేజీని గబగబా తిప్పిచూశాను. నాకు నిరాశ కలిగింది. అక్కడి పేజీలన్నీ ఖాళీ గానే కనిపించాయి. సెప్టెంబర్ ముప్పై తోనే అతని రాత ఆగిపోయింది.

"పెళ్లి సంబరం గురించి ఎందుకు రాయ లేదు వివేక్?" నావేపు అదోలా చూస్తూ కూర్చున్న వివేక్‌ని అడిగాను.

"అవధులు దాటిన సంతోషాన్ని వర్ణించి రాయటానికి పదాలు వుండవు ప్రేమా" అన్నాడు పెదవుల మీదికి నవ్వు తెచ్చు కుంటూ.

"నువ్వు పెళ్లి వర్ణన ఎలా చేస్తావో చూడా లని భలే కుతూహలంగా వుంది" అన్నాను.

"రాస్తాను. అయితే ఇప్పుడు మనం గడిపే ఈ మధుర క్షణాలన్నీ రాయాల్సినవి కావు. అనుభవించాల్సినవి. హనీమూన్ ముగించుకుని వచ్చాక ఒక మహాకావ్యమే రాయాలనుకుంటున్నాను" అంటూ దీర్ఘంగా నిట్టూర్పు విడిచాడు.

"ఒక కవిత ప్రింటవుతే ఎంత ఇస్తారు?" అనడిగాను.

"మళ్ళీ మొదలెట్టావా నీ వ్యాపార బుద్ధి..." వివేక్ కసురుకున్నాడు.

ఒక చిన్న గందరగోళం మాత్రం నాకింకా అర్థం కావటంలేదు. అదేమిటంటే- పెళ్లి ముందరి వివేక్‌కీ, పెళ్లి తరువాత వివేక్‌కీ మధ్య ఓ పెద్ద వ్యత్యాసం వుందని నాకు గట్టి నమ్మకం ఏర్పడింది. అదెలాగంటే,

ఇదివరకు నేను చూసిన వివేక్ ఒక భక్తు డిలా వుండేవాడు. అతని ఆరాధన నాకు పెద్ద ఆటంకంగా అనిపించేది.

అతని కవితలెన్నిటికి నేను 'వస్తువు'ని కావాలీ? ఎన్ని రోజులు అతని నోటి వెంబడి వెలువడే 'శాయరీ'లకు మూగశ్రో తనై కూర్చోవాలి?

మహానుభావుడు... రెండు మూడుసార్లు నన్ను సినిమాకి పిలుచుకు వెళ్ళాడు. ఇద్దరూ పక్కపక్కన కూర్చున్నప్పుడు నాలో ఏదో విచిత్రమైన ఒణుకు. అతని చేతులు నా శరీరంలోని మృదువైన భాగాల్ని స్పర్శి స్తాయేమోనని నిరీక్షించాను. నా చేతివే ళ్ళలో తన వేళ్ళు దూర్చి పటపట విరిచేస్తా డేమోనని ఎదురుచూశాను.

ఊహుం... అలా చెయ్యలేదు. బుద్ధిమం తుడిలా వూరికే నా భుజానికి ఆనుకుని కూర్చున్నాడు. ఈ మనిషి ఎంత అల్పసం



తోషి అనిపించింది.

ఆడదానికి ఇలాంటి కోరికలు కలగటం తప్పా? ఆమె కూడా ఒక మనిషి కాదా? ఈ మగాళ్ళకు స్త్రీకేం కావాలో కూడా తెలియదా? సినిమానుంచి బయటికి వచ్చాక మాత్రం అతను ఓ సుందర ప్రేమకావ్యం రాయగల సమర్థుడయ్యాడనిపించింది. అయితే నాకు కవితలు గివితలు రాయించుకునే ఓ కాగితం ముక్కగా మారటంకంటే కాల్చే కోరికల సెగలో హితంగా ఒంటిని కాచుకోవాలనిపించేది.

వివేక్ విశాలమైన వక్షస్థలంపై దట్టమైన కేశరాశి. అందులో ముఖాన్ని దూర్చి మగవాడి వాసనని, మా ఫ్యాక్టరీలో తయారయ్యే అగరొత్తుల ఘుమఘుమలను పీల్చినట్టుగానే పీల్చేయాలనిపించేది. అతని బిగికౌగిట్లో నలిగిపోవాలనిపించేది. మేం ఎంతగా పెనవేసుకుపోవాలనుందంటే మా ఇద్దరి నరాలు కలగలపి ఓ కొత్త తాడును పేనాలనిపించేది.

ఊహుఁ... ఇవేవీ జరగలేదు. ఇవన్నీ కేవలం కలలుగానే మిగిలిపోయాయి. ఒక్కసారి కూడా వివేక్ నన్ను ఎముకలు విరిగిపోయేలా గట్టిగా కౌగలించుకోలేదు. కోరికతో నా పెదవుల్ని కొరకలేదు.

అతనితో ఏకాంతంలో వున్నప్పుడు మాత్రం- "నీ కళ్లల్లో వెన్నెల విరుస్తోంది. నీ కంఠంలో కోకిల పలుకుతుంది, నీ కళ్లు చంద్రోదయంలో స్నానం చెయ్యనీ..." అంటూ భావుకతగా మాట్లాడేవాడు. అయితే వాస్తవానికి నాకా సమయంలో కావాల్సింది 'క్రియ'. ఒట్టి మాటలు కావు!

అందువల్ల రానురాను నాకతని కవితల పట్ల రోత కలగసాగింది. అవన్నీ అసత్యాలుగా కనపడసాగాయి. దానికితోడు సంపాదకులందరూ అతని కవితల్ని తిప్పి పంపేవారు. పాపం, పిచ్చివాడు! తిరిగొచ్చిన కవితల్ని చూసి ఎంతో బాధపడేవాడు. నాకు మటుకు అలాంటి భ్రమలేం లేవు. ఉండాలని కూడా ఎప్పుడూ అన్పించలేదు. నాకు మా 'సుశీలా మహల్'పట్ల నమ్మకం వుంది. మా ఫ్యాక్టరీనుంచి వచ్చే డబ్బుపట్ల నమ్మకం వుంది. నాన్నగారి దగ్గరికి ఉద్యోగాల కోసం వచ్చేవారు భయంగా పెట్టే నమస్కారాలు నాకెంతో ఇష్టం! ఈ ప్రపంచంలో డబ్బుకన్నా గొప్పది ఏదీ లేదనే నా నమ్మకం!

కాని ఈ వివేక్ డబ్బుని మంచి నీళ్లలా పాడుచేసేస్తుంటే నేనెలా సహించగలను? పూర్తి విరుద్ధమైన మనోభావాలు గల మా ఇద్దరికీ పెళ్లి జరగటమే ఒక విచిత్రం!

ఈ పెళ్లి జరగటానికి రెండు కారణాలు దోహదపడి వుంటాయని నా అభిప్రాయం. ఒకటి- ఇంటి పెద్దలకు మా ఇద్దరి మనస్తత్వాల మధ్యగల గాఢమైన వ్యత్యాసం అర్థమై వుండదు. పైగా ఇప్పుడు గాకపోయినా భవిష్యత్తులో సర్దుకుపోతారులే అనే ఉద్దేశంతో ఈ అంశాన్ని నిర్లక్ష్యం చేసివుండొచ్చు ఇక రెండు కుటుంబాల మధ్యగల పాత బంధుత్వం ఓ కుటుంబంలోని ఏకైక వారసుడికి, రెండో కుటుంబంలోని ఏకైక వారసురాల్ని ఇచ్చి పెళ్లిచేసి రెండు కుటుంబాల ఆస్తిపాస్తుల్ని కాపాడుకోవాలనే ఉద్దేశమే రెండో కారణం అయివుండొచ్చు

అయితే వివేక్‌లో పెళ్ళి తర్వాత వచ్చిన మార్పును చూస్తుంటే నాకెంతో ఆశ్చర్యం కలుగుతోంది. అతనికి హనీమూన్ గురించి ఇంత ఉత్సాహం హఠాత్తుగా ఎక్కడ్నించి పుట్టుకొచ్చింది? నాతో మాటమాత్రంగానైనా చెప్పకుండా రిజర్వేషన్ చేసుకొచ్చాడు. పైగా తను హైస్కూల్ రోజుల్లో వెళ్ళి వచ్చిన 'కులూ' లోయల్నే హనీమూన్ విడిదిగా ఎన్నుకున్నాడు. ఇలాంటి శీతల ప్రదేశాల్లో శృంగార యాత్రకు తీసుకెళ్ళేంత రసికుడైపోయాడా?

అంతకంటే ముఖ్యంగా అతని ఆవేశాన్ని, ఉద్వేగాన్ని కోరికలోని తీవ్రతను మొదటి రాత్రి చూడాల్సిందే. ఓహ్... నేనతనికి సహకరించటానికి బదులుగా అతనిలో వచ్చిన హఠాత్పరిణామానికి ఆశ్చర్యపడటం తోనే రాత్రంతా గడిచిపోయింది. ఉప్పొంగి వస్తున్న ప్రవాహాన్ని ఎన్నో రోజులు బిగప ట్టుకున్నవాడిలా ఒకేసారి నాపై విజృంభిం చాడు. అబ్బా! కొన్నిచోట్ల ఎలాంటి గాయాలు చేశాడో... అవి నయం కావా లంటే వారంరోజులు పట్టొచ్చు.

ఇన్నాళ్లుగా అతనీ రసికతను ఎక్కడ దాచుకున్నాడో? లేక తన చిరకాల తపస్సు ఫలించిన ఆనందంతో ఫలితాన్ని గబగబా అనుభవించెయ్యాలనే ఆశ కావచ్చు. నాకు అతని ఆవేశాన్ని చూస్తే ఒకటే నవ్వు! ఎందుకో అది నాకు సహజమనిపించలేదు. ఇష్టంగా అనిపించలేదు. కారణం నా మన సులో భద్రంగా వున్న వివేక్ ఒక ఆరాధ కుడు! నా శరీరంపై వాలి నన్ను ఆబగా అనుభవించే కాముకుడి రూపాన్ని నేనె ప్పుడూ ఊహించి ఎరగను. ఆ కారణంవ ల్లనే వివేక్ ప్రదర్శించిన ఆవేశాలు, ఆతృ తలు నాకు హితకరంగా అన్పించలేదు. ఇంతకాలం నన్ను పూజించిన చేతులేకదా ఇప్పుడు నన్ను నలిపేస్తున్నాయి. అనే ఆలో చనలతో నిస్పృహ కలిగింది. లేదు... వివేక్ ఎప్పటిలాగే నన్ను ఆరాధించే భక్తు డిలా వుండిపోవటమే నాకు ఇష్టం. అదే అతని సహజమైన వ్యక్తిత్వం! నాతో ఉత్సా హంగా, ఆవేశంగా, ఆరాటంగా, ఆబగా రతి క్రీడలో పాల్గొనే ఈ వివేక్ వ్యక్తిత్వం కృత్రిమ మనిపిస్తోంది.

పిచ్చి వివేక్! స్త్రీకి కామంతోపాటు ప్రేమ లోనూ సుఖమూ, నమ్మకమూ వుంటాయని నీకు ఎలా నచ్చచెప్పాలి? నా వివేక్, నువ్వు మళ్ళీ నీ మునుపటి కలల సామ్రాజ్యాన్ని స్థాపించు. అందమైన కొండకొనన కూర్చుని తనివిదీరా నా సౌందర్యాన్ని వర్ణించు. నువ్విలా నన్ను భోగిస్తూ వుంటే రానురాను నీలోని భక్తి భావన కరిగి మరుగైపో తుంది. ఇప్పటికే కోపగించుకోవటం, గోఌ క్కోవటం నీకు వచ్చేసింది. 'స్త్రీ సుఖం' ఇంతేలే అని నీకు అనిపించినరోజున నీ జీవితం పచ్చదనం లేని పొలంలా బీడువా రిపోతుంది.

పెళ్ళయిన తర్వాత నాకు అర్థమైంది, స్త్రీకి భర్త ఆరాధకుడిగా, భక్తుడిగా వుంటే ఆ స్త్రీ ఎంతో అదృష్టవంతురాలని! ఎన్నటికీ నన్ను అలాంటి అదృష్టంనుంచి వంచించకు వివేక్! ఏ భంగిమలో నిలుచోమంటావో చెప్పు, అలాగే నించుంటాను. నాపై వేలకొద్దీ పద్యాల్నీ, కవితల్నీ రాయి. నన్ను ఆరా ధించు. ఇదిగో ఈ నా కళ్ళల్లోనేగా వెన్నెల విరుస్తోందని అనేవాడివి, ఇప్పుడు వాటినెం దుకు చూడవు? ఈ నా పెదవుల్ని మెచ్చు కుంటూ నువ్వు ఎన్నిసార్లు కవితలు రాయ లేదు. ఈ నా స్తనాలను పొగుడుతూ ఎన్నో పద్యాల్ని రాశావు. ఇప్పుడీ సుందర అంగా లన్నీ నీ దృష్టిలో మళ్ళీ మళ్ళీ దాడి చేయ టానికి పనికొచ్చే ఆక్రమిత ప్రదేశాలుగా మారిపోయాయికదూ? నీలోని ఈ అనూహ్య మార్పుని నేను భరించలేను. వద్దు వివేక్... ప్లీజ్... నువ్వు మళ్ళీ మునుపటి వివేక్‌లా మారిపో భావుకు డిగా... సౌందర్య ఆరాధకుడిగా... నా భక్తుడిగా మారిపో.

## నాయకుడు

ఆంధ్రప్రదేశ్‌లోని ఏవేవో ఊర్లగుండా రైలు ప్రయాణిస్తూ వుంది. నేను బయటికి చూస్తున్నాను. అప్పటిదాకా నా డైరీ చదువు తున్న ప్రేమ ఇప్పుడు నావేపు కళ్ళార్ప కుండా చూస్తోంది.



"వివేక్, నన్ను చాలా గాఢంగా ప్రేమిస్తున్నావ్ కదూ? " అనడిగింది.

ఎందుకో తెలియదు. ఆమె ఈ ప్రశ్న అడగటంతోటే నా మనసు కరిగి కళ్లల్లో నీళ్ళు చిప్పిల్లాయి. ఆర్ద్రంగా ఆమె భుజానికి వొరిగాను.

"వివేక్ నేను కూడా నిన్ను గాఢంగానే ప్రేమిస్తున్నాను" అంది.

ఆమె మాటల్లో యాంత్రికత ధ్వనించినట్టు అనిపించింది. ఎందుకంటే 'ప్రేమ' అనేది అడిగిన ప్రశ్నకు జవాబు చెప్పించే ఇంటర్వ్యూలాంటిది కాదు. ప్రేమ అనేది నాభిలోంచి పుట్టి, ఎదలోంచి ప్రవహించి నిరాటంకంగా, స్వచ్ఛందంగా, తనంతటతానే బహిర్గతం కావాలి. ఎదుటివారి మెప్పుకోసమో, మౌనాన్ని నింపటానికో, జవాబు యివ్వటానికో చెప్పేది 'ప్రేమ' ఎలా అవుతుంది?

ఆమెకు అదే చెప్పాను. "ప్రేమా! ఈ ప్రపంచంలోని అత్యంత మహోన్నతమైన శక్తి ఏదైనా వుందంటే అది ప్రేమే! అదొక అందమైన భావన. అదొక జీవ చైతన్యం. అదొక నిధి! స్త్రీ పురుషుల ప్రేమకన్నా గొప్పది ఏముంది? అది సృష్టికే మూలం! మనిషి పుట్టుక, పెరుగుదల, జీవనంవంటి జీవనావస్థలన్నిటికీ స్త్రీ పురుషుల దాంపత్యమే మూలం కదా? సీతను పోగొట్టుకున్న రాముడు ఎంతగా బాధపడ్డాడో తెలుసా? "

"అయితే రాముడు సీతను అడివికి తరిమేశాడట? నిప్పులోకి తోసేశాడట? రాముడు ఆదర్శవంతుడైన భర్త ఎలా అవుతాడు? "

"నీవు పొరబడుతున్నావు ప్రేమా, ఇక్కడ పురుషుడు అనుమానించింది మరో




పురుషుడ్నే తప్ప స్త్రీని కాదు. రాముడు అనుమానపడింది వక్రబుద్ధిగల రావణుడి మీదేగాని తన భార్య సీతమీద కాదు. ఇందులో సీత ఒక మాధ్యమం మాత్రమే. నిజానికి 'అగ్నిపరీక్ష' నెపంతో రాముడు తనకు భార్యపై గల గాఢమైన ప్రేమనే ప్రకటిస్తాడు. అడవిలోని చెట్లనూ, పుట్టలనూ, పూల తీగల్నీ, రెమ్మల్నీ పట్టుకుని 'నా వైదేహిని మీరు చూశారా... చూశారా?" అంటూ విలపించిన రాముడి మహోన్నత ప్రేమని ఎలా అనుమానించగలం? తన సీత కళంకిని కాదు అని చాటిచెప్పటానికే ఆయన రకరకాలుగా నాటకాలాడాడు"

"చాల్చాలు! ఈ హనీమూన్ ప్రయాణంలో రామాయణ పారాయణం మొదలెట్టకు..."

"ఇందులో తప్పేముంది ప్రేమా? ప్రతి స్త్రీకి తన భర్త రాముడిలా వుండాలనే కోరిక బలీయంగా వుంటుంది. ప్రతి పురుషుడూ తన భార్య సీతలా వుండాలని ఆశపడటం సహజమే. అందువల్లనే సీతారాములు ఇప్పటికీ ప్రజల మనసుల్లో సజీవంగా నిలిచివున్నారు. ఆదర్శ దంపతుల్లా లోకంచేత కీర్తించబడుతున్నారు"

"నీ మాటలు నాకు అర్థం కావు వివేక్" అంటూ ప్రేమ మాటలు ఆపేసింది.

బయట నేలపై గడ్డి పరచినట్టు అంతా పచ్చగా కళకళలాడుతోంది. జనం సంతోషంగా జీవిస్తున్నట్టు అనిపించింది. ఆహ్లాదకరమైన ప్రయాణం! రైలు విచిత్రమైన లయ విన్యాసం చేస్తోంది మృదంగనాదంలా! ధర్ ధక్ ధర్ ధక్... అంటూ మూలుగుతూ, కేకలు పెడుతూ, మెత్తగా జారిపోతూ, జోలపాట పాడుతూ సాగే రైలు సవ్వడి నాకు మనిషి మాట్లాడే అప్రి

యమైన మాటలకన్నా ఎంతో ఇష్టంగా అని పించాయి.

"నీకు నిద్ర పోవాలనిపిస్తే పడుకో" అన్నాను ప్రేమను.

"మరి నువ్వేం చేస్తావ్? " అడిగింది.

"నేను కాస్త ఆలోచించాలి" అన్నాను.

"ఏమి ఆలోచిస్తావ్? నాకూ చెప్పు" అంది.

తమకు ఇష్టంలేని ఆలోచనల్ని షేర్ చేసు కోవటానికి ఎవరూ ఇష్టపడరు. తమకు ఇష్ట మైన వాటినే ఆలోచించాలనీ, ఆమోదించా లని అందరూ కోరుకుంటారు. అలాంటి వారు 'మంచివారుగా' కనిపిస్తారు. మనకు విరుద్ధంగా మాట్లాడే వాడ్ని 'సరైనవాడు కాదు' అని అంటాము.

"ఇప్పుడు నా మనసులోని ఆలోచన నాకు అయిష్టమైనది" అన్నాను.

"ఫరవాలేదు. అదేమిటో చెప్పు చూద్దాం" అందామె.

"నిజంగా చెప్పమంటావా? "

"తప్పకుండా చెప్పు"

ఇలాంటి మాటలే మామధ్య కొద్దిసేపు నడిచాక అన్నాను,

"నీకు వేలకు వేలు సంపాయించిపెట్టే వ్యాపారస్తుడు భర్తగా లభించివుండాల్సింది. నేను బీదవాడ్ని, పైగా తెలివితక్కువవాడిని నేనూ నా కవితలూ ఏ ఒక్కటీ నీకు అక్క ర్లేదు. మీ నాన్నగారినుండి వరకట్నం కింద నేనేమీ కోరలేదని. నీకు నాపై విసుగ్గా వుంది. మీ నాన్నగార్ని కారు అడగమనీ, ఫ్రిజ్ అడగమనీ ఎన్నోసార్లు నన్ను బలవం తంపెట్టావ్? "

అయితే ఆమె నా మాటలేవీ పట్టించుకు న్నట్టులేదు. నేను మళ్లీ అన్నాను.

"నేను వ్యాపారం చెయ్యలేను. ఆస్తంతా అమ్మేసి బాడిగలు వచ్చే కొన్ని అంగళ్ళు మాత్రమే వుంచుకుందామనుకుంటున్నాను" అంటూ ఆమెవేపు చూశాను.

ఊహించినట్టుగానే ఆమె నాపై మండిప డుతూ అంది. "తమాషా చేస్తున్నావా? నీ ఆస్తిలోని ఒక్క అంగుళం జాగా అమ్మటా నికి వీల్లేదు. వ్యాపారం నీకు చేతకాదని నాకు తెలుసు. అయితే ఆ పని నేను చెయ్యా గలను. ఆస్తుల గొడవకు నీవు రాకు. నువ్వు వూరికే చూస్తూవుండు. మా నాన్న గారి ఫ్యాక్టరీని చూసుకుంటూనే మీ అంగడి వ్యాపారాన్ని కూడా నేను నిర్వహిస్తాను. ఒక్క మేనేజరు కూడా నాకు అవసరం లేదు. మనం ఇతరులపై ఆధారపడితే రేపు మన పిల్లలకు చిప్ప పట్టుకోవాల్సిన గతి పడుతుంది. మనం బాగా సంపాయించాలి. మా నాన్నగారిలా మనమూ ఓ పెద్ద బంగళా కట్టించాలి. దానికి 'ప్రేమ మహల్' అని పేరు పెట్టాలి"

చెప్పేసింది, కుండ బద్దలు కొట్టినట్టు చెప్పేసింది. "ఎంతటి ఆశపోతు ఆడది" అని మనసులోనే అనుకున్నాను.

నాకెంతో ప్రియమైన 'కులూవ్యాలీ'వేపే రైలు దడదడమని చప్పుడుచేస్తూ నిర్విరా మంగా సాగుతోంది. నేను కిటికిలోంచి బయటకి చూశాను.

అప్పుడే ఒక మనిషి మా బోగిలోకి అడు గుపెట్టాడు. బక్కపలచగా వున్నాడు. అడ్డది డ్డంగా పెరిగిన తెల్లటి గడ్డం. సన్నటి కాళ్ళపై నరాలు ఒకదానితో ఒకటి ముడిప డినట్టు కనిపిస్తున్నాయి. రక్తమే లేనట్టు పాలిపోయిన ముఖం. చేతిలో ఓ పాత బ్యాగు పట్టుకుని వున్నాడు. అందులో ఏవో వెదురు కర్రలు వున్నట్టున్నాయి. ఆ వ్యక్తి తలుపు దగ్గరే కూర్చున్నాడు.

ప్రేమ బుట్టలోంచి కొన్ని తినుబండా రాలు తీసింది. కొన్ని తిన్న తర్వాత "నీకు ఆకలేస్తుంటే తీసుకో" అంది నాతో, నేను తల అడ్డంగా వూపటంతో బుట్ట సర్ది పడు




కోవటానికి పక్క సిద్ధంచేసుకుంది. "నాకు ఆకలిలేదు. తినమని బలవంతపెట్టకు!" అని అనంతపురంలోనే ఆమెకు చెప్పాను.

ప్రేమ నిద్రపోయేముందు నన్ను దగ్గరికి పిలిచి నా చెవికి దగ్గర నోరుపెట్టి గుసగుసగా చెప్పింది. "వివేక్, ఆ మనిషి ఎవరు? అతన్ని ఇక్కడ్నించి వెళ్ళిపొమ్మని చెప్పు"

"పిచ్చిదానా, ఎవడో చిల్లర వ్యాపారస్తుడు. కంపార్టమెంట్లన్నీ నిండుగా వున్నాయని ఇక్కడికి వచ్చినట్టున్నాడు. చోటులేనపుడు ఎక్కడికి వెళ్తాడు. నువ్వు కంగారుపడకుండా నిద్రపో" అని నచ్చజెప్పాక ప్రేమ తన బెర్త్‌మీదికి నడుంవాల్చింది

నేను నా బెర్త్‌పై మేనువాల్చి కాస్సేపు పుస్తకాలు చదువుతూ గడిపాను. బయట వర్షం కురుస్తోంది. చలిగా అనిపించి ఒంటి నిండా దుప్పటి కప్పుకున్నాను. ఎలాగో నిద్ర పట్టేసింది.

ఉదయం నాకు మెలకువ వచ్చేసరికి సమయం ఏడు గంటలైంది. పైబెర్త్‌మీద పడుకున్న ప్రేమ ఇంకా లేవలేదు. నేను లేపే ప్రయత్నం చెయ్యలేదు.

బయటికి తొంగి చూస్తే ఏదో స్టేషన్ కనపడింది. అది సికింద్రాబాద్ అని గుర్తుపట్టాను. అదే సమయంలో ప్రేమ కెవ్వున కేకేస్తూ బెర్త్‌మీంచి లేచింది.

"ఏమైంది ప్రేమా? ఏం జరిగింది?" నేను కంగారుగా అడిగాను.

"అయ్యయ్యో, నా గొలుసు దొంగతనమైంది. రెండు పేటల బంగారు గొలుసు. మా అమ్మ పెళ్ళికి చేయించి ఇచ్చింది..." అంటూ గొడవ చెయ్యటం మొదలెట్టింది.

ఇలాంటి సందర్భాల్లో జనం గుంపులుగా చేరటం, అందరూ మాపై జాలిపడటంలాంటివి నాకు రుచించవు. నేను సమాధానపరుస్తున్నా విన్పించుకోకుండా ప్రేమ పెద్ద పెట్టున కేకలు వెయ్యసాగింది.

రాత్రి మా కంపార్ట్‌మెంట్‌లోకి వచ్చి కూర్చున్న ఆ చిల్లర వ్యాపారస్తుడు ఇంకా కూర్చున్న చోటనే వున్నాడు.

ప్రేమ అతడ్ని వేలితో చూపిస్తూ "వీడే... వీడే నా గొలుసు దొంగిలించాడు..." అంటూ అందరి ముందు ప్రకటించింది.

అంతలో ఓ రైల్వే పోలీసు వచ్చాడు. అతను సగం తెలుగు సగం ఇంగ్లీషులో అడిగితే ఈమె సగం కన్నడ, సగం ఇంగ్లీషులో వివరించింది. "నా గొలుసు దొంగతనం అయింది. రాత్రి ఈ మనిషి మా కంపార్ట్‌మెంట్‌లోకి వచ్చాడు. నేను నిద్రపోతున్నప్పుడు నా గొలుసుని దొంగిలించాడు" అని ఫిర్యాదు చేసింది.

పోలీసు ఆ ముసలోడ్ని రెక్క పుచ్చుకుని పైకి లేపాడు. నాకా ముసలోడిపై జాలి కలిగింది. పోలీసుతో అన్నాను, "ఇతను దొంగ అయివుండడండి. ఇతనే గొలుసు తీసివుంటే ఇంకా ఇక్కడెందుకుంటాడు? ఏదో ఒక స్టేషన్‌లో దిగి పారిపోయివుండేవాడు"

నా తర్కం మింగుడుపడక ప్రేమ నాపై విరుచుకుపడింది. తర్వాత పోలీసుతో,

"ఇతనే దొంగ, చైను ఎక్కడైనా దాచేసి నంగనాచిలా ఫోజు పెడ్తున్నాడు. నా చైను నాకు ఇప్పించండి" మొండిగా అంది.

మా ఇద్దరి భిన్నాభిప్రాయాలు విన్న పోలీసు ప్రేమను సమర్థించే ధోరణిలోనే మాట్లాడసాగాడు. దాంతో "పోన్లెండి, ఆ ముసలోడ్ని చెక్‌చెయ్యండి. అతనే గొలుసు తీసి వుంటే అది అతని దగ్గరే దొరుకుతుంది కదా" అన్నాను.

పోలీసులకు ఇలా చెప్పేవాడే కావాలి. నా మాట విన్న మరుక్షణం ముసలోడిపై పడ్డాడు. బంగారు గొలుసు వెదికే నెపంతో ముసలోడ్ని మెలికలు తిప్పుతూ ఎముకలు విరిచినంత పనిచేశాడు. చివరికి అతని దగ్గరున్న మురికిబ్యాగును కూడా బోర్లించాడు.



లొడలొడమంటూ వెదురు కర్రలు కిందపడ్డాయి. అవన్నీ ముగ్గులు వేసే కర్రలే.

నా కళ్ళు మెరిశాయి. ఓ కర్రని అందుకుని పరీక్షగా చూశాను. ఆ కర్రనిండా రంధ్రాలున్నాయి. ఇందులో ఎంత కళ దాగివుంది అనుకుంటూ పరవశంగా దానినే చూస్తుండిపోయాను. కంపార్ట్‌మెంట్ నేల మీదంతా ఇప్పుడిలాంటి కర్రలే పడివున్నాయి. వీటితో ఇప్పుడు ముగ్గుపిండి వుండివుంటే ఎలాంటి సుందర చిత్రాలు రూపుదిద్దుకుని వుండేవి. రంగురంగుల చిత్రాలు అనేకం కళ్ళముందు కదలాడుతుండగా మనసంతా సంతోషంతో నిండిపోయింది. ఊహల్లోనే ఇంత ఆనందం వున్నప్పుడు వాస్తవంలో ఎలా వుంటుందో అనిపించింది.

వెంటనే జేబులోంచి పది రూపాయల నోటు తీసి వృద్ధుడి ముందు చూపుతూ "నాకొక ముగ్గుకర్ర ఇవ్వు" అన్నాను.

అది చూసి పోలీసు నన్ను అదోలా చూస్తూ గొణుక్కున్నాడు. ముసలోడి దగ్గర గొలుసు దొరకలేదు గనక ఏమీ చేయలేక విసుక్కుంటూ వెళ్ళిపోయాడు.

ఇందాకట్నించీ ఈ గొడవకు విసుక్కుంటున్న రైలు కూడా మెల్లగా ముందుకు కదిలింది.

ప్రేమకు బాగా కోపం వచ్చిందనటానికి గుర్తుగా ఆమె ముఖం ఎర్రబారింది. నేనామెను శాంతపరుస్తూ అన్నాను, "పోతే పోయిందిలే వెధవ గొలుసు, మీ నాన్నకి చెబితే అలాంటివి పది గొలుసులు చేయించి ఇస్తాడు"

ఆమె ధుమధుమలాడుతూ నన్ను తినేసేలా చూసింది. ఓపక్క తన బంగారు గొలుసు పోవటం, మరోపక్క నేను ఆమె తరపున వాదించకుండా ఆ ముసలివాడి దగ్గరే ముగ్గుల కర్ర కొనటంతో అగ్నికి ఆజ్యంపోసినట్టు ఆమె కోపంతో మండిపడింది.

నేను మరో ప్రయత్నం చేస్తూ "ప్రేమా, బీదవాళ్ళంతా దొంగలే అనుకుంటే ఎలా? ..." అని చెప్పబోయాను.

"చాల్చాలు నీ ఉపన్యాసాలు! బంగారుగొలుసు విలువ ఏమిటో నీకు తెలిస్తే కదా, ఒక్క గొలుసు చేయించే స్తోమత లేదుగాని..." అంటూ ఇంకా ఏదేదో అంటూ తిట్టితిట్టి అలసిపోయి కూర్చుంది. ఇక ఆ తర్వాత మా ఇద్దరిమధ్య చాలాసేపటివరకు పలుకే బంగారమైపోయింది.

బరువెక్కిన నా హృదయానికి గుర్తుగా రైలు భారంగా కదులుతోంది. ఈ ఆంధ్రప్రదేశ్ అనేది ఎంత పెద్ద రాష్ట్రం! రాత్రి అంతా ప్రయాణించినా ఇంకా ముగియనే లేదు. ఇప్పుడు బయట పచ్చదనంలేదు. నా ప్రేమ మనసులా బీడుగా వుంది. నల్లటి కొండలు, తెల్లటి స్వచ్ఛమైన నీళ్ళు లేవు. చైతన్యం లేదు. ప్రేమలేదు. మనసులు లేవు. అన్నీ ఎండిన పొలాలే! బాధగా నిట్టూర్చాను.

దేశంలోని దారిద్ర్యాన్ని వెక్కిరిస్తున్నట్టు రైలుబండి మురికి వాడల తీరాల్లోంచి, స్లమ్ ఏరియాల్లోంచి ప్రయాణిస్తూ కంపరమెత్తిస్తోంది. ఓ ఫ్యాక్టరీ వెనక భాగం నుండి సాగుతుండగా ఫ్యాక్టరీ పొగ గొట్టంలోంచి వచ్చిన పొగ మా రైలును చుట్టుముట్టేసింది. చెడ్డీ విప్పుకుని చెంబు పట్టుకుని కూర్చున్న ఈ దేశంలో కనీస అవసరాలు తీర్చుకోవటానికి ఇబ్బంది పడుతున్న ఎందరో పేదలు మనమధ్య వున్నారనిపించింది.

'ముగ్గుల కర్ర' ఇంకా నా చేతిలోనే వుంది. ఆ ముసలివాడు నాకళ్ళముందు మెదిలాడు. ప్రేమ ముఖం ముడుచుకుని కిటికీ దగ్గర కూర్చునుంది. నేను రైలు తలుపు దగ్గర కూర్చుని విషాద గీతాల్ని




పాడుకోవటం మొదలెట్టాను.

సుమారు తొమ్మిదిన్నరకు కాజీపేట చేరుకుంది రైలు. అక్కడ లైన్ క్లియర్ లేకపోవటంతో కాస్సేపు ఆగింది. నేను కిందికి దిగాను.

నిండు గర్భంతో వున్న ఓ మేక ప్లాట్‌ఫారంపై తచ్చాడుతోంది. 'పాపం, ఇది ఇక్కడేం చేస్తోంది?' అనుకుంటూ దాన్ని సమీపించాను.

అది నావైపు కళ్ళెత్తి ఆశగా చూసింది. దాని మెడలో తాడు లేదు. నిండుగా వాలిన పొట్ట, చన్నులు అది నిండు గర్భిణీ అని చాటిచెప్తున్నాయి. ఆప్యాయంగా దాని శరీరాన్ని చేత్తో నిమిరాను. దాని నోట్లో వేలు పెట్టాను. కాని అది కొరకలేదు. నావేపే తదేకంగా చూసింది. గర్భం దాల్చినప్పట్నించి తినటానికి ఏమీ చిక్కినట్టులేదు. నేను ఏమైనా పెడతానని ఆశగా నా చెయ్యంతా వాసన చూసింది. నా చేతుల్లో ఏమీ లేదని గ్రహించాక పాపం నిరాశపడింది.

నేను తలెత్తి చుట్టూ చూశాను. స్టేషన్ అంతా మేకలు నిండివున్నాయి. ప్లాట్‌ఫారంపై పట్టాలమధ్య హాయిగా తిరుగుతూ అంతటా మేకలే. ఆహారాన్వేషణలో స్వేచ్ఛగా విహరిస్తున్నాయి. రైళ్ళ ఆర్భాటపు పిచ్చి పరుగులవల్ల ఏ ఇంజనో వీటిపైకి ఎక్కేస్తే ఏమిటి గతి? అనుకున్నాను.

"ఓ మేకల్లారా...
పచ్చటి పొదల్లోకి వెళ్ళి
ముంగాళ్లపై నిలిచి
లేచిగుళ్ళు, పూలతీగలు
తినటానికి బదులు
పాడు మనుషులనడుమ
నల్లటి పట్టాలపైన
రాక్షస పొగబండ్లు తిరిగే
ప్రాణాపాయ స్థలానికి
ఎందుకు వచ్చారు? మీరెందుకు వచ్చారు"

... అంటూ నా హృదయం ఓ కవితను ప్రసవించింది.

అంతలో కూఁ అంటూ కూతపెడుతూ రైలు కదిలింది. ఆ మేకల్నే చూస్తూ నేను రైలెక్కాను. ప్రేమ వున్నచోటనుండి కదిలినట్టు లేదు. నాకు గిల్టీగా అనిపించింది. హనీమూన్ యాత్రలో భార్య అలగటం కాని, ముఖం ముడుచుకుని వుండటంగానీ భావ్యంగా వుంటుందా? ఆమె అలక ఇలాగే సీరియల్‌గా ముందుకు సాగితే కాస్సేపటి తరువాత ఆమె 'వూరికి తిరిగి వెళ్ళిపోదాం పద' అంటూ పట్టుబట్టవచ్చు. తిరుగు ప్రయాణమయ్యామంటే ఈ యాత్ర ఉద్దేశ్యం పూర్తిగా విఫలమైనట్టే. అత్యంత సుఖోన్మాదంతో తేలిపోవాలని ఎన్నెన్నో తియ్యటి కోరికలతో బయల్దేరి అర్ధాంతరంగా తిరిగి వెళ్ళటమా...? లేదు... లేదు... ఆమెకు ఎలాగైనా నచ్చచెప్పాలి.

కారణం తెలిసిందే!

మన మురికి దుస్తుల్ని నడివీధిలో వుతుక్కుంటామా? దాంపత్యమనేది కూడా అప్పుడప్పుడు మురికిపట్టే వస్త్రంలాంటిదే. దాన్ని ఇంట్లో స్నానాల గదిలో నాలుగు గోడల మధ్య భర్తో, భార్యో వుతికి శుభ్రం చేయాలి. అందరి ఎదుట మన మలినవస్త్రాల్ని ప్రదర్శించకూడదు. దానివల్ల అల్లరిపాలయ్యేది మనమే. బయటివారి ముందు మనం నగ్నంకాకూడదు. మన అంతరంగిక జీవితాల్లోకి తొంగిచూసే అవకాశం ఎవరికీ ఇవ్వకూడదు.

దడదడలాడుతూ గోదావరి నదిని దాటుతోంది రైలు. నేను ప్రేమ దగ్గరికెళ్ళి కూర్చున్నాను. ఆమె భుజంపై చెయ్యేసి మృదువుగా అన్నాను.

"ఆహా, ఎంత విశాలమైన నది! చూశావా, ప్రేమా, రాష్ట్రాలు మారుతున్న కొద్దీ జనాలు, భాష, మన్ను, వాసన, పువ్వులు, ప్రాణులు ఎలా వేరువేరుగా కనిపిస్తున్నాయో! దీని పట్ల నీకు కుతూహలం కలగడంలేదా!"

"పో, నీకు నామీద ప్రేమలేదు. నాముందు ప్రేమ నాటకాలు వేస్తున్నావు. నీకు నాకంటే ఆ ముగ్గుల కర్రలు అమ్మే ముసలివాడే ఎక్కువ" అంటూ విసురుగా ముఖం తిప్పుకుంది.

అంటే ఆమె తనకుతనే అబద్ధాలు చెప్పు కుంటోందన్న మాట. తన భర్తగా వున్న వ్యక్తి తన ఎదుట నించుని "లేదు... లేదు...నీవే నా ప్రాణం. నిన్ను చాలా గాఢంగా ప్రేమిస్తున్నాను... నిన్ను పూజిస్తు న్నాను" అని పదేపదే చెప్పాలని ఆమె కోరు కుంటోంది. అది ప్రతి స్త్రీ కోరుకునేదే. ప్రేమ కూడా అలా కోరుకుంటోంది. నాకు ఆమెను బుజ్జగించక తప్పలేదు.

"అదంతా మర్చిపో ప్రేమా. నేను నిన్ను ఎంతగానో ప్రేమిస్తున్నాను. ఇకమీదట మనం పోట్లాడుకోకూడదు. ఒక తమాషా సంఘటన చెబుతా విను" అంటూ బుజ్జగిం చటం మొదలెట్టాను.

దేవిగారి ముఖంలో రవ్వంత ప్రసన్నత చోటుచేసుకుంది. అయితే నా వద్ద చెప్పటా నికి ఎలాంటి తమాషా సంఘటన లేదని గుర్తొచ్చి తెల్లముఖం వేశాను. అయితే అప్ప టికప్పుడు ఏదో ఒకటి చెప్పక తప్పదని గ్రహించి నా జ్ఞాపకాల పుట్టను కదల్చాను. క్యాంపస్‌లో ఫిలాసఫీ స్టూడెంట్ లక్ష్మీనారా యణసాగర గుర్తొచ్చి పెదవులపై నవ్వు ప్రత్యక్షమైంది. అదే సంఘటన ఆమెకి చెప్పాను.

"ప్రేమా, నాతోపాటు కాలేజీలో లక్ష్మీనా రాయణసాగర అనే ప్లేబోయ్ కుర్రాడు చదు వుకునేవాడు. అతనికి విద్యార్థి నాయకుడిగా గుర్తింపబడాలనే కోరిక బలంగా వుండేది. దానికోసం అతను ఏవేవో జిమ్మిక్స్ చేసే వాడు. చూడ్డానికి చక్కగానే వుంటాడు. కాని అతనిది మట్టి బుర్ర. కుర్రాళ్ళను ఆక ట్టుకోవటానికి వారానికి రెండు స్లైకులు చేయించేవాడు. ఏవేవో తొండల్ని తీసుకొచ్చి వూరేగింపు చేసేవాడు. ఎన్నో ఏళ్ళుగా ఇత నికి ఇదే వరస. ఏదైనా వారంలో వూరే గింపు జరగలేదంటే 'ఈ సాగర ఏ సాగరం పాలైనాడో' అని కుర్రాళ్ళంతా కంగారుపడే వారు"

నా మాటలు పూర్తికాకుండానే ప్రేమ అంది "ఆ కుర్రాడ్ని నేను చూశానులే. ఒక రోజు హండ్రెడ్ ఫీట్ రోడ్డులో 'కుక్క గుర్తుకే మీఓటు' అని నినాదాలు చేస్తూ వెళ్ళటం చూశాను" అంది.

లక్ష్మీనారాయణ ప్రసక్తితో ఆమె కోపం తగ్గటం చూసి నా మనసు శాంతించింది.

"అలాగైతే నువ్వు వాడ్ని చూసి వుండటం వల్ల ఈ సంఘటన ఇంకా బాగా ఎంజాయ్ చెయ్యొచ్చు" అంటూ మిగతా కథ కొనసా గించాను. వింటున్నకొద్దీ ప్రేమ కోపం మంచులా కరగసాగింది.

"ఒకరోజు ఈ కోతివెధవ దగ్గరికి కొందరు తుంటరి విద్యార్థులు చేరి అతన్ని రెచ్చగొట్టారు. 'చూడు సాగర్, నువ్వు లీడర్ లీడర్‌నని గొప్పలు చెప్పుకోగానే సరిపోదు. సాహసకృత్యాలు చేసేవాడే లీడర్ అవు తాడు. నీకు దమ్ముంటే నీకు నువ్వే గొప్ప లీడర్‌నని భావిస్తూ వుంటే ఓసారి లేడీస్ హాస్టల్‌లోకి చొరబడాలి. నువ్వు లోపలికి వెళ్ళి క్షేమంగా తిరిగొస్తే, నువ్వే మా లీడర్ వని అంగీకరిస్తాం" అని సవాల్ విసిరారు. అతడు ఆ సవాలును ఛాలెంజిగా తీసుకు న్నాడు.

రెండుమూడు సార్లు వీరావేశంతో హాస్టల్ వరకు వెళ్ళాడు. విజిటర్స్ రూంలో తిష్ఠ వేసుక్కూర్చున్న భారీకాయపు వార్డెన్




యొక్క రౌద్రావతారాన్ని చూశాడు. అక్కడే కూర్చుని పేపర్ చదువుతున్న జీన్స్, మాక్సీలను కూడా చూశాడు. అతని కాళ్ళల్లో వణుకు పుట్టింది. వెంటనే తిరిగి పరుగు లంకించుకున్నాడు. మూడుసార్లూ ఇలాగే జరిగింది. క్యాంటీన్‌లోని కుర్రాళ్ళంతా వాడ్ని గేలి చేస్తూ 'పిరికి సన్నాసీ, నువ్వు ఓడిపోయావ్. నువ్వు మా లీడర్‌గా వుండటానికి తగినవాడివి కావు' అన్నారు. దాంతో సాగర్‌కి తిక్కరేగింది. 'ఇవాళ సాయంకాలం చూడండ్రా నా తడాఖా' అని హుంకరించాడు.

ప్రేమ కుతూహలంగా వింటోంది "సాయంత్రం హాస్టల్‌లోకి దూరాడా? " ఆసక్తిగా అడిగింది.

"కాస్త ఆగు, చెబుతాను. హాస్టల్‌లోకి దూరాలంటే ధైర్యం కావద్దూ? దానికోసం అతను మూడు బాటిల్స్ బీరు కొట్టి వచ్చాడు. కిక్కు ఎక్కటంతో ధైర్యం పొంగుకొచ్చింది. అతన్ని రెచ్చకొట్టిన బుద్ధిమంతులు ఏ.ఓ. ఆఫీసు చాటున నక్కి తమాషా చూడసాగారు. సాగర్ తూలుతూ హాస్టల్‌లోపలికి దూరాడు. లోపలికి చొచ్చుకుపోయాడు. తన ధైర్యానికి ఆడపిల్లలు హడలిపోతారనుకున్నాడు. కాని అతని వాలకం చూసి ఆడపిల్లలు కిసుక్కున నవ్వారు. వాళ్ళల్లో వస్తాదులా వున్న ఓ అమ్మాయి వెయిట్ లిఫ్టింగ్ స్టయిల్‌లో అతన్ని ఎత్తుకుని బయటికొచ్చింది. ఆమె వెనక మిగతా అమ్మాయిలు నినాదాలు చేస్తూ బయటికొచ్చారు. వస్తాదు అమ్మాయి అతన్ని నేరుగా బయటవున్న నీటితొట్టి దగ్గరికి తెచ్చి అందులోని నీటిలో పడేసింది. అంతలోనే బయటికి తీసి మళ్ళీ ముంచింది. ఇలా ముంచటం, తీయటం కొంతసేపు సాగింది. దెబ్బకు సాగర్ నిషా అంతా దిగిపోయింది. దాంతోపాటు లీడర్‌ని కావాలనే కోరిక కూడా.. ఇక మర్నాటి నుంచి అతను క్యాంపస్‌లో కనపడితే ఒట్టు'

ప్రేమ ఆ సంఘటన విని పకపకా నవ్వు సాగింది. ఆ నవ్వుచూసి నా ముఖం వికసించింది. ఓహ్! ఎంతటి అందమైన నవ్వు! ఇలాంటి నవ్వుకోసమే కదా మగవాడు తపస్సు చేసేది; యుద్ధాలు చేసేది; వేలాది మందిని హతమార్చేది- అనుకున్నాను.

"ప్రేమా! ఇంట్లో మన యోగక్షేమాల సమాచారం కోసం ఎదురు చూస్తుంటారేమో, మన ప్రయాణం సుఖంగా సాగుతోందని ఓ ఉత్తరం ముక్క రాసి పడేద్దామా? " అన్నాను.

"ఇంకా ఒకరోజు కూడా గడవలేదు. ఢిల్లీ చేరుకున్నాక రాద్దాంలే" అంది.

"వద్దు, అంతవరకు వాళ్ళని బాధపెట్టడం ఎందుకు? వాళ్ళంతా మన ఉత్తరం కోసం వేయి కళ్ళతో ఎదురు చూస్తుంటారు. వారందరికీ మన గురించే బెంగ. ఇద్దరం కలిసి ఒకే ఉత్తరం రాసేద్దాం" అంటూ బ్యాగులోంచి ఇన్‌ల్యాండ్ లెటర్ తీసి ఇచ్చాను.

నాగపూర్‌లో రైలు చాలాసేపు ఆగింది. నేనే డిక్టేషన్ చెబుతూ ప్రేమచేత ఉత్తరం రాయించాను.

"నీకు ఉత్తరమెలా రాయాలో తెలీదు సుమా. నేను చెబుతా రాయి. ప్రియమైన అత్తమామలకు మీ ప్రియమైన కోడలు ప్రేమ చేయు నమస్కారములు... మా ప్రయాణం చాలా చక్కగా సాగింది. మేమిద్దరం జాలీగా హనీమూన్ ఎంజాయ్ చేస్తున్నాం..." ఇలా ఉత్తరం సాగింది. ఆమె నేను చెప్పినట్టు రాసింది. చివర్లో నేనూ రెండు మూడు వాక్యాలు రాసి ఉత్తరం ముగించాను.

ఉత్తరం పోస్ట్ చెయ్యటానికి నాగపూర్ స్టేషన్లో పోస్ట్ బాక్స్ వెదుకుతూ బయల్దేరాను. పాములా పొడువాటి రైలు. పోస్టు బాక్స్ చాలా దూరంలో వుంది. పోస్ట్ చేసి

వచ్చేటప్పుడు బత్తాయి పళ్ళు అమ్మేవాడి దగ్గర కొన్ని పళ్ళు తీసుకున్నాను. ప్రేమ కోసం బ్రెడ్, ఆమ్లెట్ తీసుకున్నాను.

నేను మళ్ళీ బోగీలోకి వచ్చేసరికి నా సీటు మీధ ఇద్దరు అపరిచితులు కూర్చుని వున్నారు. నాకు ఆశ్చర్యమేసింది.

"వివేక్, నేనెంత చెప్పినా వినకుండా వీళ్ళిక్కడే కూర్చున్నారు. ఇక నువ్వే చెప్పు వాళ్ళకు" ప్రేమ ఫిర్యాదు చేస్తున్నట్టు చెప్పింది.

"నువ్వూరుకో ప్రేమా, ఈ ఉత్తర భారతీయులు పైకి అలా మొరటుగా కనిపించినా లోపల మెతకనే. నేను వాళ్ళకు నచ్చజెబుతాగా" అంటూ వాళ్ళకు అర్థమయ్యేలా వివరించాను. "మేము కొత్త దంపతులం, ఢిల్లీ వరకు రిజర్వేషన్ చేయించుకున్నాం. దయ చేసి లేవండి" నమ్రతగా అన్నాను.

ఒకతను గుడ్లు మిటకరిస్తూ నావైపు చూశాడు. ఇద్దరిలో ఒకడు మరీ సన్నగా వున్నాడు. చిన్న గడ్డం, టైట్ ఫ్యాంట్ ధరించాడు. రెండో వ్యక్తి దృఢంగా లావుగా ఉన్నాడు. వాడి భుజం తట్టి హిందీలో విషయం చెప్పి మా టికెట్ చూపించాను.

అప్పుడు వాళ్ళిద్దరూ గొణుక్కుంటూ లేచారు. కాని అక్కడ్నించి వెళ్ళిపోకుండా మా సీటు చివర్లో మళ్ళీ కూలబడ్డారు. మా ట్రైను కర్ణాటక ఎక్స్‌ప్రెస్ కావటం వల్ల అక్కడక్కడ కన్నడ వాళ్ళున్నారు.

"బ్లడీ నార్త్ ఇండియన్స్" అంటూ ఓ కన్నడ యువకుడు అసహనంగా గొణిగాడు. 'సాలే మదరాసీ' అంటూ వాళ్ళిద్దరూ కూడా గొణుక్కున్నారు. అంతలో అక్కడికొచ్చిన రైల్వే మనిషి సంగతి తెలుసుకుని వాళ్ళకు నచ్చచెప్పి చూశాడు. అయినా వాళ్ళు కదల్లేదు.

ప్రేమ ఎందుకైనా మంచిదని తన మెడలోని మాంగల్యాన్నీ, వేలి వుంగరాల్ని తీసి బ్యాగులో పెట్టుకుంది. తర్వాత ఆ బ్యాగును తలకింద పెట్టుకుని పడుకోవటానికి సిద్ధమైంది. బెర్త్ పైకి లేపాల్సి వచ్చి వాళ్ళిద్దర్నీ లేవమన్నాను. వాళ్ళు నన్ను నమిలి మింగేసేలా చూసి లేచి నించున్నారు.

నేను బెర్త్‌పైకి తీసి చైను తగిలించాక ప్రేమను పైకి ఎక్కించాను ఆమె పడుకోబోతూ గుసగుసగా నా చెవిలో "ఆ లావు మనిషి నన్నే చూస్తున్నాడు" అని ఫిర్యాదు చేసింది.

"నువ్వు ఎవరైనా చూడదగినంత అందంగానే వున్నావ్ సుమా" నేను కొంటెగా అన్న మాటలకు సిగ్గుతో ప్రేమ ముఖం ఎర్రబారింది.

"నువ్వు నిశ్చింతగా పడుకో. ఎవ్వరూ ఏమీ చెయ్యరు" ఆమెకొక అందమైన జవాబిచ్చాను.

ఆమె పడుకున్నాక నేను కింది బెర్త్ పైన కూర్చుని ఏదైనా చదవాలనుకున్నాను. ఆ పొగరుబోతులిద్దరు అప్పటికే నా బెర్త్‌పై నడుం వాల్చారు. నేను దానిమీదే సర్దుకున్నా చీటికీ మాటికీ వాళ్ళ కాళ్ళు తగులుతుండటంతో నాకు ఒళ్ళు మండిపోయింది. నిద్రలో యాధృచ్ఛికంగా కాలు తగులుతోందా లేక వాళ్ళు ఉద్దేశ పూర్వకంగా తగిలిస్తున్నారా అని అనుమానం వచ్చి పరిశీలనగా చూశాను. నిజానికి ఆ లావు మనిషి నిద్రపోలేదు. వూరికే పడుకుని ప్రేమ తిని పారేసిన బత్తాయి తొక్కలతో ఆడుకుంటున్నాడు. అతనికి ఆకలేస్తోంది కాబోలు అనుకుని ఓ పండు తీసిచ్చాను. అతను ఏమాత్రం సిగ్గుపడకుండా దాన్ని తీసుకున్నాడు. తోలు వలిచి తింటూ పక్కన పడుకున్న రెండో వ్యక్తిని లేపి అతనికీ ఇచ్చాడు.

"కాస్త కాలు వెనక్కి తీసుకోండి"




అన్నాను. అతను చప్పున కాలు వెనక్కి తీసుకున్నాడు.

"ఈ నాగపూర్ బత్తాయిల కన్నా మా 'కొడగు' బత్తాయిలే మంచి రుచి" అన్నాను.

"అచ్ఛా!" అన్నారు బత్తాయితొనలు తింటూ.

బత్తాయి పండు తిన్నాక ఏమనుకున్నారో ఏమో ఇద్దరూ బెర్త్ దిగి కింద పడుకు న్నారు.

నాకు కాస్సేపు చదవాలనిపించి సోమర్ సెట్ మామ్ రాసిన పుస్తకం బయటికి తీశాను. అది చదువుతున్నంతసేపు మామ్ నా ఎదుట నిల్చుని సాధువులా అనేక విష యాలు చెబుతున్నట్లు అనిపించింది. చాలా సేపు చదువుతూ వుండిపోయాను.

హఠాత్తుగా నా పొట్టలో విపరీతమైన నొప్పి కలగసాగింది. పొట్టను రెండుచేతు లతో అదుముకుంటూ గిలగిల్లాడాను. కాస్సే పటికి నొప్పి కాస్త తగ్గి ఉపశమనం కలి గింది.

ఆ ఇద్దరు వ్యక్తులు కింద పడుకుని వున్నారు. చలికి ఒణుకుతూ అటూ ఇటూ పొర్లుతున్నారు. కింద ఏమీ పరుచుకోలేదు. పైనా కప్పుకోలేదు. పైగా టాయ్‌లెట్ పక్కనే కావటంతో నేల తేమగా వుంది. అంత చలిలోనూ ఒకడు మునపటిలాగే బత్తాయి తొక్కతో ఆడుకుంటున్నాడు.

నావద్ద అదనంగా ఓ కార్పెట్ వుండటం గుర్తొచ్చింది. దాన్ని తీసి వాళ్ళకు అందిం చాను. నా దగ్గరున్న నవభారత్ టైమ్స్ పత్రికను కూడా ఇచ్చాను. కార్పెట్ పరచు కుని తలకింద పేపర్ మడిచిపెట్టుకుని వాళ్ళు పడుకున్నారు.

అయితే నా పొట్టనొప్పి తగ్గలేదు. ఇది ఏ రోగచిహ్నమో నాకు అర్థంకాలేదు. భేది అవుతున్నట్టు అనిపించి టాయ్‌లెట్ వేపు కదిలాను. కార్పెట్ ఇచ్చినా నిదరపోకుండా ఒకతను మునుపటిలాగే బత్తాయి తొక్కతో ఆడుకుంటున్నారు. నేను పొట్ట పట్టుకుని టాయ్‌లెట్‌లోకి దూరాను.

నిజమైన సౌఖ్యపు క్షణాలు టాయ్‌లెట్ లోనే ఉన్నాయనిపించింది. అక్కడ చాలా సేపు కూర్చుని పొట్టను శుద్ధి చేసుకున్నాను.

నాలో మళ్ళీ ఆలోచనలు ముసురుకు న్నాయి. మా రిజర్వేషన్ బోగీలోకి నిర్భ యంగా ప్రవేశించి నేలపై పడుకున్న ఆ వ్యక్తుల గురించి ఆలోచించాను. ఇతరుల హక్కులను దోచుకోవటం ఇలాంటి వాళ్ళకు ఎంత సాధారణమైపోయింది. దీనివల్ల ఎంత సంఘర్షణ. ఎంత బాధ కలుగు తుంది? అనుకుంటూ పని ముగించి మళ్ళీ నా చోటికి తిరిగొచ్చాను.

నాకు నిద్ర పట్టలేదు. మళ్ళీ సోమర్‌సెట్ మామ్ పుస్తకాన్ని తీసి చదవటం మొదలె ట్టాను.

రాత్రి రెండున్నర అనుకుంటాను. ఝాన్సీ స్టేషన్ వచ్చింది. పొట్టలో మళ్ళీ అదేరక మైన బాధ మొదలయ్యింది. అయితే ఈ సంగతి ప్రేమకు తెలపకూడదని నిశ్చయిం చుకున్నాను. పేగులు తెగిపోతున్నట్టు, ముళ్ళు గుచ్చుకుంటున్నట్లు బాధ కలుగసా గింది.

సరిగ్గా అప్పుడే పై బెర్త్‌పై పడుకున్న ప్రేమ కెవ్వుమంటూ కేకేసింది. నేను ఏం జరిగిందా అని గాభరాగా చూశాను. కింద పడుకున్న లావు మనిషి బత్తాయి తొక్కను ప్రేమ మీదికి విసరటంతో ఆమె భయంతో కేకవేసిందని అర్థమైంది.

ఇక నాలో సహనం నశించింది. "యూ బాస్టర్డ్" అంటూ అతనిపై విరుచుకుప డ్డాను. ఊహించని నా దాడికి అతను ఖంగు తిన్నాడు. ముఖ్యంగా 'నీకోసం ఇలాంటి ఓ ఫైటు చెయ్యగలను సుమా' అని నా ప్రేమకు చూపించాలనిపించింది.



ఈ గలాభాకు నిద్రలేచిన చాలామంది ప్రయాణికులు నాకు సహాయంగా వచ్చారు.

"ఏ అచానక్ సే హువా" అంటూ అతను సంజాయిషీ ఇచ్చుకున్నా అక్కడున్న వారంతా అతన్ని చెడామడా తిట్టారు. అయినా అతను తన తప్పు ఒప్పుకోలేదు. పైగా నా కార్పెట్‌ను వుండచుట్టి ఓ పక్క విసిరేసి తన సహచరునితో కలిసి వెళ్లిపోయాడు. వాళ్ళ కృతఘ్నత చూసి నాకు అసహ్యం వేసింది. అక్కడున్న వారంతా బంగారంలాంటి నిద్ర పాడయినందుకు తిట్టుకుంటూ తమతమ స్థానాల్లోకి తిరిగి వెళ్లిపోయారు.

ఆ తర్వాత నాకు ఆ రాత్రంతా నిద్ర పట్టనేలేదు. ప్రేమ కూడా నిద్రపోలేదేమో.

నా ఆలోచనలు స్త్రీ పురుషుల సంబంధాల వైపు మళ్ళాయి. వాటిని త్రాసులో పెట్టి కొలవటం మొదలెట్టాను.

"శీలం అంటే ఏమిటి? " ప్రతి పురుషుడూ తన భార్య శీలం పట్ల ఎందుకు జాగ్రత్త వహిస్తాడు? చూడండయ్యా... మీ భార్య, అక్కాచెల్లెళ్ళను మేం తాకం; మీరూ మా భార్య, అక్కా చెల్లెళ్ళను చెడు దృష్టితో చూడవద్దు. అంటూ మనంతట మనమే ఏర్పాటు చేసుకున్న సామాన్య ఒప్పందం అయి ఉండొచ్చా?

శీలాన్ని సరళంగా వ్యాఖ్యానిస్తే ఇంతే అవుతుందనిపించింది. అయితే కొందరు తుంటరివాళ్ళు ఈ ఒప్పందాన్ని అప్పుడప్పుడు అతిక్రమిస్తూ ఒప్పందపు కంచెను దాటుతూ వుంటారు. మరొకరి అధికారపు పరిధి లోపలికి చేతులు చాస్తూ వుంటారు. ఇతరుల సుందర వస్తువుల్ని అపహరిస్తూ వుంటారు. అప్పుడే గొడవలు జరుగుతాయి.

ఎవరి వస్తువులను వారే ఉపయోగించటాన్ని 'శీలం' అంటారు. ఆ వస్తువుల్నే ఇతరులు వాడితే అది 'శీలాపహరణ' అవుతుంది. ఈ వ్యవస్థను రూపొందించిన వాళ్ళు ఎంత తెలివైన వాళ్ళు.

ప్రేమ అందం ఆ లావు మనిషిని పిచ్చెక్కించి వుండాలి. మగవాళ్ళకు మరొకరి భార్య అందంగా కనిపించటం సహజమే కదా. అలా ఎందుకు కనిపిస్తుందో నాకు తెలియదు. అయితే నా భార్యపట్ల మరొకడికి కలిగిన మోహంపట్ల నాకు కోపంతో పాటు గర్వం కూడా కలిగింది. చాలామందికి లేని 'సౌందర్య సంపద' కలిగిన స్త్రీకి నేనే యజమానిని కదా అని మురిసిపోయాను.

రైలు ఢిల్లీ వైపుగా పరుగులు తీస్తోంది.

తెల్లవారింది.

ఎంతటి వెలుగు! రైలు అనబడే ఆ 'చలించే ఇంటి' లోపలికి సూర్యుడు తన తెల్లటి కిరణాలతో ముగ్గులు వేయసాగాడు. కిటికీల గుండా దూసుకొచ్చిన ఆ లేత కిరణాలు నాకు చక్కిలిగిలి పెడుతూ "లేమ్మా, ఇంకేం ఢిల్లీ వచ్చేసింది. ఉదయపు కాలకృత్యాలు త్వరగా ముగించు" అంటూ చెవిలో గుసగుసలాడినట్లు అనిపించి గబుక్కున లేచాను.

బాత్‌రూంలు ఖాళీగా లేవు. ప్రేమను మేల్కొలిపాను.

"రాత్రంతా నిద్రపోలేదా? కళ్ళు ఉబ్బినట్టున్నాయి. డల్‌గా కనిపిస్తున్నావు? " అందామె.

"నీ గురించే ఆలోచిస్తూ గడిపాను సుమా" అన్నాను. ఆ క్షణంలో పొట్ట నొప్పి నా పేగుల్ని మెలికలు తిప్పుతున్నా ఆ విషయం ప్రేమకు చెప్పలేదు.

"ఇదిగో, ఢిల్లీ వచ్చేసింది" అనగానే ప్రేమ చప్పున లేచి కిటికీ దగ్గరికి వచ్చేసింది.

బయట గుట్టలుగా పడివున్న చెత్తాచెదారం, అందులోంచి పేపర్, ప్లాస్టిక్‌లాంటి వస్తువుల్ని ఏరుతున్న జనాన్ని చూసి




"అబ్బబ్బా, దుర్వాసన" అంటూ ముక్కు మూసుకుంది.

"చూడు, ఇక్కడ్నించే ఢిల్లీ ప్రారంభం. ఇదే దేశ రాజధాని" అన్నాను.

రైలు దిగి స్టేషన్ బయటికి రాగానే రిక్షా వాలాలు, లాడ్జింగ్ బ్రోకర్లు చుట్టుముట్టారు. 'మాకేం అవసరం లేదు' అంటూ వాళ్ళని తప్పించుకుని దగ్గిర్లో కనపడ్డ మదరాసీ రెస్టారెంట్‌లోకి దూరిపోయాను. ప్రేమ కోసం ఓ దోసె ఆర్డరిచ్చి నేను పక్కనే వున్న పోస్టాఫీసుకు వెళ్ళి కొన్ని ఇన్‌ల్యాండ్ లెటర్లు పట్టుకొచ్చాను.

"ఢిల్లీకి క్షేమంగా చేరామంటూ ఇప్పుడే ఓ లెటర్ రాసి పడేద్దాం ప్రేమా, పాపం, మన ఉత్తరం గురించి మనవాళ్ళు బెంగగా ఎదురు చూస్తుంటారు" అన్నాను.

తర్వాత హోటల్‌లోనే ఆమె చేత ఉత్తరం రాయించి చివర్లో నేనూ రెండు లైన్లుగీకి పక్కనే వున్న పోస్టుబాక్స్‌లో పడేశాను.

ఆ తర్వాత స్టేషన్‌కి దగ్గర్లో కనిపించిన 'హోటల్ కబీర్'లో డబుల్ రూం తీసుకున్నాను.

"ఓ రెండ్రోజులు ఢిల్లీలోనే గడుపుదాం" అంది ప్రేమ.

"ఇప్పుడు వద్దు ప్రేమా, అంతగా కావాలంటే 'కులూ' నుంచి తిరిగొచ్చాక ఓ వారం ఢిల్లీలో గడుపుదాం. నేను తిరుగు ప్రయాణానికీ రిజర్వేషన్ చేయించాను. ఇప్పుడు కులూకి వెళదాం. ఎందుకంటే మనం బయల్దేరిందే ఆలస్యం. ఇంకా ఆలస్యం చేస్తే అక్కడ స్నోఫాల్ మొదలవుతుంది" అన్నాను.

"ఏమిటో అది, 'కులూ కులూ' అంటూ కలవరిస్తున్నావు? " అంది మూతి తిప్పుతూ.

"చూస్తావుగా, కులూకెళ్ళాక అక్కడి ప్రకృతి సౌందర్యానికి ముగ్ధురాలవై నీకు నువ్వే ప్రాణాలు వొదలాలంటావు. అది పరమశివుని వెండికొండ! కైలాస పర్వతం! సుందర ప్రకృతి! భూలోక స్వర్గం..." అంటూ కులూ సౌందర్యాన్ని వర్ణించసాగాను.

"చాల్చాలు బాబు..." అంటూ చెవులు మూసుకుంది ప్రేమ.

## నాయిక



ఈ వివేక్ ఎంత తీవ్రంగా ప్రేమించగలడో చూస్తుంటే నాకు ఆశ్చర్యం కలుగుతోంది. రూం బాయ్ గది తాళం తీసి రూం చూపించి అటు వెళ్ళాడో లేదో వివేక్ తలుపు మూసి చెంగున ఎగిరి నన్ను పక్క మీదికి తోసేసి మీద పడ్డాడు. "అరెరె... తలుపుకి బోల్ట్ కూడా వెయ్యలేదు. ఎవరైనా చూస్తారు..." అని నేను వారిస్తున్నా వినిపించుకోకుండా "చూస్తే చూడనీలేవే" అన్నాడు నిర్లక్ష్యంగా.

ఈమధ్య అప్పుడప్పుడు 'రావే, పోవే' లాంటి పదాల్ని పదేపదే వాడుతున్నాడు. పక్కమీద అతని కోరికలు మరింత తీవ్రమయ్యాయి. తనలోని ప్రేమ భావాలను హఠాత్తుగా క్రియల్లోకి రూపాంతరం చేసుకు

న్నట్టు ఆకలిగొన్న వాడిలా పండుని గబ గబా తింటున్నట్టు ఆబగా నన్ను అనుభవి స్తాడు. అంతటి మగతనం అతనికి హఠా త్తుగా ఎక్కడ్నించి వచ్చిందా అని నాకు విస్మయం కలుగుతుంది. అన్నేళ్ళ సుదీర్ఘ పరిచయంలో ఒక చిన్న ముద్దు పెట్టుకోవ టానికి కూడా ఎక్కడ నా బుగ్గ కందిపో తుందో అన్నట్టు అంటీ అంటనట్టు ముద్దా డేవాడు. అప్పుడతని ప్రేమ తుషారంలా శుభ్రంగా, తేలిగ్గా అనిపించేది. ఇప్పుడదే మొరటుగా, బరువుగా మారిపోయింది. ఇప్పుడతని ప్రణయం యుద్ధోన్మాది అయిన సైనికుడు చేసే ఆక్రమణలాంటిదే!

"వివేక్, నెహ్రూ ప్లానిటోరియంకు వెళ దామా, ఎర్రకోటలో సౌండ్ అండ్ లైట్ వుందట అక్కడికెళదామా" అని బతిమిలా డాను. విన్పించుకుంటేనా!

"సాయంత్రం ఆరూ నలభైకి 'కులూ' బస్సుకి రిజర్వేషన్ చేయించాను. అప్పటి దాకా హోటల్ గదిలోనే వుండి మజా చేద్దాం" అన్నాడు.

'మజా చేద్దాం' అనే మాటలు ఎంత మొరటుగా, ఎబ్బెట్టుగా వున్నాయంటే అవి ఓ భర్త నోటినుంచి, అందులోనూ వివేక్ వంటి భావుకుడైన ప్రేమికుడి నోటివెంబడి రావాల్సినవి కావు. అతని విచ్చలవిడితనం చూసి తెల్లబోయాను.

గదిలోంచి బయటికెళితే ఈ మధుర క్షణాలన్నీ చేజారిపోతాయోమోనని భయప డుతున్నట్టు నన్ను వదలకుండా గట్టిగా పెనవేసుకుని వుండిపోయాడు.

మధ్యాహ్నానికి నేనతన్ని ఎలాగోలా పక్కకి తోసి లేచాను "పద, బయటికెళ్ళి భోంచేసి వద్దాం" అన్నాను.

"వద్దు ప్రేమా, భోజనాలు ఇక్కడికే తెప్పి స్తాను" నా గుండెలమధ్య ముఖాన్ని రుద్దుతూ తమకంగా అన్నాడు.

"అబ్బబ్బా, నీకేమైంది వివేక్? ఉదయం నుండీ గదిలోనే... హనీమూన్ అంటే కేవలం సెక్స్ ఎంజాయ్ చేయటమేనా? పద, ఓసారి చాణక్యపురి వేపు వెళ్ళివద్దాం" అంటూ అతన్ని బలవంతంగా పైకి లేపాను.

అతను అయిష్టంగానే లేచి నుంచుని "అంతదూరం వద్దు... పాలికాబజార్ వరకు వెళ్ళి తిరిగొద్దాం" అన్నాడు.

కొద్దిసేపట్లోనే ఇద్దరం బయటికి వెళ్ళటా నికి రెడీ అయ్యాం.

రూం లాక్ చేస్తున్నప్పుడు ఎదురుగా ఇద్దరు వ్యక్తులు రావటం కనిపించింది. వాళ్ళు రైల్లో మాకు తారసపడిన వ్యక్తులే. అదే బక్కపలచటి వ్యక్తి. అతని పక్కనే ధృఢంగా వున్న లావుపాటి వ్యక్తి. నాకెం దుకో భయం వేసింది. వివేక్ చేతిని గట్టిగా పట్టుకున్నాను.

"దేఖ్ రే, ఉన్‌కా రోమాన్స్ కైసా చల్ రహాహై" లావు వ్యక్తి వెకిలిగా నవ్వుతూ తన స్నేహితుడితో అన్నాడు. తర్వాత మమ్మల్ని దాటేటప్పుడు నడుంపై వుంచు కున్న చేతిని నాకు తగిలించాడు.

వివేక్ అది గమనించి కోపంతో వాళ్ళిద్ద రిపై మేనేజర్‌కి కంప్లయింటు చేశాడు. మేనే జరు వాళ్ళిద్దర్ని పిలిపించి బుద్ధి చెప్పే ఒక సీను నడిచింది.

"వీళ్ళు నాగపూర్ నుంచి మమ్మల్నిలా ఇబ్బంది పెడుతున్నారండి" అన్నాను. నా మాటలకు ఆ వ్యక్తులు పొగరుగా నవ్వారు. మేనేజర్ వాళ్ళను కోప్పడి మాకు నచ్చచెప్పి బయటికి సాగనంపాడు.

ఇక ఆరోజు నాకు ఆ హోటల్‌లోగానీ, ఢిల్లీలోగాని వుండాలనిపించలేదు. సాయంత్రం హోటల్ రూం ఖాళీ చేసి ఇంటర్ స్టేట్ బస్‌స్టేషన్‌కి చేరుకున్నాం. సుమారు అయిదున్నర గంటలకు నల




భయ్యో నంబరు ప్లాట్ ఫారం వద్దగల ఎంక్వైరీ దగ్గరికెళ్ళి మా రిజర్వేషన్ టికెట్లని ధృవపర్చుకున్నాం.

'హిమాచల్ ప్రదేశ్ పరివాహన నిగమ్ కి చెందిన బస్సొకటి ఏడవ ప్లాట్ ఫారం మీదకి వచ్చి నిలుచుంది. మా లగేజీని 'స్టేషన్ కూలీ' లా కనపడిన ఓ మనిషి బస్సుపైకి చేర్చి 'పదిరూపాయలివ్వండ'ని అడిగాడు. వివేక్ అతనితో ఏమాత్రం బేర మాడకుండా అడిగింది ఇచ్చేశాడు.

బస్సు ఆరూనలభైకి ఢిల్లీ విడిచి చండీగఢ్ దారిపట్టింది.

"ఢిల్లీ నుంచి కులూకి ఎంత చార్జి? " వివేక్ ని అడిగాను.

"ఎనభై రూపాయలు" అన్నాడు.

మేము కిటికీ పక్కన సీట్లలో కూర్చున్నాం. వివేక్ చలేస్తోందన్న నెపంతో కాబోలు నన్ను హత్తుకుని అదిమేస్తూ కూర్చున్నాడు.

బస్సులో దీపాలు ఆర్పేశాక వివేక్ ప్రణయ చేష్టలు మొదలయ్యాయి. ముందు, వెనుక కూర్చున్న వారు ఎక్కడ గమనిస్తారో అని నాకు సంకోచంగా అనిపించింది. వివేక్ ఎంత నిర్లజ్జగా తయారయ్యాడంటే హఠాత్తుగా నా బ్లౌజులోకి చెయ్యి దూర్చేశాడు. చూస్తూ చూస్తుండగానే ముద్దులు పెట్టేసుకునేవాడు. మా వెనక కూర్చున్న ఇద్దరు హిమాచల్ ప్రదేశ్ యువకులు మమ్మల్నే గమనిస్తున్నారని నాకనిపించింది. ఒకసారి వాళ్ళు కిసుక్కున నవ్వేశారు కూడా. నాకు తల తీసేసినట్టనిపించింది. వివేక్ చేతిని విసురుగా తోసేసి పక్కకి జరిగి కూర్చున్నాను.

రాత్రి పది గంటలకు అంబాలా చేరాం. అక్కడి 'బచన్ వైష్ణో ధాబా'లో ఇద్దరం రెండు రొట్టెలు తిని మళ్ళీ బస్సెక్కాం.

నాకు నిద్ర ముంచుకొస్తోంది. కాని వివేక్ అల్లరి వల్ల నిద్రపట్టలేదు. నా చేతి వేళ్లలో తన వేళ్ళు జొనిపి పట్ పట్ మని విరవసాగాడు. నా నాభి చుట్టూ వేళ్ళతో సున్నాలు చుట్టసాగాడు. ఒకసారైతే నా చీర కుచ్చిళ్ళు తొలగించే ప్రయత్నం కూడా చేశాడు.

నేను గట్టిగా ప్రతిఘటిస్తే వెనక కూర్చున్న వాళ్లకు తెలిసిపోతుంది. వాళ్ళకు మరింత చోద్యం చూసే అవకాశం దొరుకుతుంది. ప్రతిఘటించకపోతే వివేక్ చేష్టలు మితిమీరిపోతాయి. ఇప్పటికే అతను బాగా టెంప్ట్ అయివున్నాడు. మధ్యమధ్య బాధతో తన పొట్టను అదుముకుంటున్నాడు.

బస్సు చండీగడ్ చేరుకునేసరికి రాత్రి పద కొండున్నర అయివుంటుంది. అయితే అర్ధ రాత్రి కావస్తున్నా ఒక్క క్షణం కనురెప్ప మూయటానికి కూడా వివేక్ నన్ను వదల్లేదు. నిజంగానే నాకతని ప్రవర్తనపై జుగుప్స కలిగింది. వివేక్ ప్రదర్శిస్తున్న తొందరపాటులో ఏదైనా అర్థమున్నట్టు నాకు అనిపించలేదు. చివరికి విసుగుపుట్టి 'నీకిష్టమొచ్చింది చేసుకో' అన్నట్టు పైటను కూడా గుండెలపై వేసుకోకుండా తల వాల్చి నిద్రపోతున్నట్టు నటించసాగాను.

నేనలా నిర్లక్ష్యం ప్రదర్శించటంవల్ల అతన్లో విరక్తి పుట్టి తన వెకిలిచేష్టలు మానుతాడేమోనని భావించాను. అయితే నేనలా శరీరాన్ని వదులుగా వదిలేసి తల వెనక్కివాల్చి పడుకోవటం అతనికి మరింత సహకారాన్ని ఇచ్చినట్టయింది. దాంతో అతను సూటిగా నాపై దాడికి పూనుకున్నాడు.

నాకు ఎక్కడలేని బాధ కలగసాగింది. ఈ దరిద్రపు బస్సులో హెడ్ రెస్ట్ కూడా లేదు. నా స్తనాలతో అతని ఆటలు పెరుగుతున్నట్టు నా తల సీటు కడ్డీకి తగిలి నొప్పి కలగసాగింది. నేను నొప్పివల్ల



మూలుగుతున్నా అతను వదల్లేదు. నా మూలుగుల్ని వేడి నిట్టూర్పులుగా భావించాడో ఏమోగాని నా శరీరంలోని సున్నిత భాగాలతో అతని చేతులు మరింత మొరటుగా ఆడుకున్నాయి.

తెల్లవారుజాము నాలుగ్గంటలకు బిలాస్‌పూర్ వచ్చింది. అంతవరకు నరకయాతన అనుభవించిన నేను ఇక వివేక్ ప్రతాపానికి అడ్డుకట్ట వేసే ఉద్దేశంతో "పద, బస్సు దిగి టీ తాగుదాం" అన్నాను.

టీ తాగాక నిద్రపట్టనే లేదు. ఉదయం ఆరుగంటలకల్లా బస్సు 'మండి'లోకి ప్రవేశించింది. అక్కడి నదిని చూస్తూ "అది ఏ నది? " అని వివేక్‌ని అడిగాను.

"బియాస్..." అన్నాడతను.

ఆ దారి తనకెంతో పరిచయమైనదన్నట్టు మాట్లాడాడు.

చలి మరింత పెరగటంతో ఇద్దరం ఒకే ఉలెన్ బెడ్‌షీట్‌ని కప్పుకున్నాం. దాంతో అతనికి నానా లీలావినోదాలను నిరాటంకంగా సాగించటానికి మరో చక్కటి అవకాశం చిక్కింది. అయితే నాకు నిద్ర మరింత ముంచుకొస్తోంది. నా ప్రమేయం లేకుండానే కళ్ళు మూతలు పడుతున్నాయి.

వివేక్ నన్ను మేల్కొలుపుతూ అన్నాడు, "భలే దానివే నువ్వు... కులూ లోయల అందాలు కళ్ళముందుకు వస్తున్నప్పుడు నిద్రపోతావేం? అదిగో- అక్కడ సూర్యుడు తెల్లటి దుప్పటి పరుస్తున్నాడు. బియాస్ నదిలో రాళ్లు ఎంత తెల్లగా మెరుస్తున్నాయో చూడు. అదిగో అక్కడ బియాస్ నదిపైన కట్టిన డ్యాం ఎంత అందంగా కనపడుతోందో చూడు, అశోకాహోటల్ వారు ఇక్కడ కూడా ఒక బ్రాంచి తెరిచారు" అంటూ అనుభవమున్న గైడ్‌లా కులూ లోయల్ని, అక్కడి ప్రదేశాల్ని వివరించసాగాడు.

నాకైతే నిద్ర తన్నుకొస్తోంది. వరి పైర్లనీ మొక్కజొన్న కంకుల్నీ అతను ఉత్సాహంగా వర్ణిస్తున్నాడు. నాకు అలాంటి దృశ్యాల్ని చూడాలనే కోరిక లేదు, చూసే ఓపికా లేదు.

కులూ వచ్చింది. అయితే అది కేవలం ఒక జిల్లా కేంద్రమని తెలిసి నిర్ఘాంతపోయాను. ఈ వివేక్ ఇలాంటి చిన్న ఊరిని ఏదో మహా నగరమన్నట్టు వర్ణించాడు. దాని ఆకారాన్ని చూసి నాకు ఎక్కడ లేని నిరాశ కలిగింది. అది పర్వత లోయల్లో వెలసిన ఒక ఊరు. పర్వతశిఖరాల్ని శిఖరాగ్రాలని చూడటం అద్భుతమే అయినా నేనీ దృశ్యాల్ని మహా అయితే అరగంటలో చూసెయ్యగలను. ఆ తర్వాత ఇక్కడ చూడ్డానికేముంది?

"ఇక్కడేం వుంది వివేక్? కులూ కులూ అంటూ మహాగొప్పగా చెప్పావు. ఇన్ని అవస్థలుపడి ఇక్కడికి రావటంకంటే మనవేపున వున్న ఏ దేవాలయానికో వెళ్ళి వుంటే బాగుండేది" అన్నాను నిరాశగా.

వివేక్ నవ్వాడు. "ఈ మాత్రానికే నిరాశపడితే ఎలా? మనం ఇంకా పధ్నాలుగువేల అడుగుల హిమవత్పర్వతాన్ని ఎక్కబోతున్నాం. అంత ఎత్తుకి చేరుకున్నాక అక్కడి మనోహర దృశ్యాల్ని చూసి జన్మ సార్థకమైందని నీవే చెబుతావు. దేవుడి వద్ద ఏమి అడగాలనుకుంటున్నావో ప్రకృతి దగ్గర కూడా అది అడగవచ్చు ఇంతకీ దేవుడ్ని ఏం కోరుకోవాలనుకుంటున్నావ్? " అని అడిగాడు..

"చక్కటి సంతానాన్ని, గొప్ప ఐశ్వర్యాన్ని" అన్నాను.

వివేక్ చాలా సేపటివరకు నాతో మాట్లాడలేదు.

తర్వాత "వీటిలో వేటినీ దేవుడు ఇవ్వలేదు. ఇవన్నీ మనుషులు తమంతట తామే




సంపాదించుకోగలిగేవి" అంటూ వేదాంత ధోరణిలో చెప్పాడు.

నేను మిన్నకుండిపోయాను.

వివేక్ అప్పుడప్పుడూ తన ఛాతీని నిము రుకుంటూ పొట్టను అదిమిపట్టుకుంటూ వుండటం చూసి నాకు అనుమానమేసింది. అతన్ని ఏదో అనారోగ్యం పీడిస్తోందనిపిం చింది.

"ఏమిటి? " అని నిలదీసి అడిగినా "తల నొప్పి" అంటూ తేలిగ్గా జవాబిచ్చేశాడు. అయితే అతను ఏ నొప్పితో బాధపడు తున్నా విశ్రాంతి తీసుకోవటంలేదు. ఇలాంటి స్థితిలోనూ అతనికి నా శరీరం కావాలి. నన్ను తాకాలి. నాతో సుఖం పొందాలి. ఈ విషయంలో విశ్రాంతి తీసు కునే సోమరి కాదు. అనుక్షణం నా శరీ రంలో ఆనందాన్ని అన్వేషించే ఉన్మాదపు ప్రేమికుడు.

## నాయకుడు

కాను! నేను ప్రేమ పిచ్చోడ్ని కాను!!

నాకెందుకో పదేపదే డేవిడ్ గుర్తొస్తు న్నాడు. అతని మాటలు గుర్తొస్తున్నాయి. అతడొక భయంకరమైన యదార్థవాది. ఇప్పుడు నేను నా భ్రమల్ని ఒక్కటొక్కటిగా వదిలించుకుంటున్నాను.

"'కామం' కాకుండా స్త్రీ పురుషుల్ని కట్టిప డేసే బంధం మరొకటి ఏముంది? " అంటూ సూటిగా ప్రశ్నిస్తాడతను. అదే నిజ మైతే ఇన్ని ఏళ్లుగా నేను ప్రేమను ఆరా ధిస్తూ రావటం ఒట్టి భ్రమేనా? అది వ్యర్థ మేనా?

ఈ ప్రశ్న నా మదిలో మెదలగానే నా కంటి వెంట ఓ కన్నీటి చుక్క జాలువా రింది. సమాధానానికి ఏవేవో కారణాలు వెదికి శక్తిలేక నిస్సహాయంగా కన్నీరు కార్చాను.

"అరే, నీకెంతో ఇష్టమైన కులూకి వచ్చే శాంకదా. ఎందుకా కన్నీళ్లు? " ఆత్రంగా అడి గింది ప్రేమ.

"కన్నీళ్లు కావవి. మనసులో ఘనీభవిం చిన బాధల పుట్ట. ఇప్పుడు ద్రవరూపంలో బయటపడుతోంది" అన్నాను గంభీరంగా.

"నీ మాటలు నాకు అర్థం కావటంలేదు వివేక్? "

"అర్థం కాకుండా వుండటమే మనిషి యొక్క 'ఉత్తమ అవస్థ'" అన్నాను.

"కాని నాకు అర్థం చేసుకోవాలనే కుతూ హలం వుంది"

నాకు దుఃఖం ఆగలేదు. "ఎవరికీ ఎవరూ అర్థం కారు. అర్థమైన వాళ్ళలా నటిస్తారు. కుతూహలంవల్ల కీడే సంభవిస్తుంది. అదే మిటి, ఇదేమిటి అని ప్రదర్శించే కుతూ హలం కేవలం కుతూహలంగానే మిగిలిపో వటం మంచిది. కుతూహలం తగ్గిననాడు మనిషి 'సినిక్' అవుతాడు. నిరాశావాది అవుతాడు. చంద్రుడి మీదికెక్కిపోరాడు. సూర్యుడిలో ఏముందని వెదకబోకు. వెన్నె లకానీ, వెలుతురుకానీ ఆనందంగా అనుభ వించటానికే గానీ సూక్ష్మదర్శిని కింద పెట్టి పరిక్షించటానికి కాదు"

నా మాటలకు ప్రేమ నిర్ఘాంతపోయింది.

"వివేక్! జీవితంలో నీకేమైనా చేదు అను భవాలు ఎదురయ్యాయా? " అనడిగింది దిగులుగా.

"పిచ్చిదానా, నా జీవితానికేం లోటు? ప్రేమించే తల్లిదండ్రులు, అత్తమామలు పేరులోనే 'ప్రేమ'ను నింపుకున్న రూపవతి అయిన భార్య వీటన్నిటితోపాటు కావల్సి నంత డబ్బు, ఆస్తి, స్నేహితులు... నాకేం తక్కువని! నాకన్నా అదృష్టవంతులెవరున్నా రని? " అంటూ ఎదురుప్రశ్న వేశాను.



"మరి, నువ్వు అప్పుడప్పుడు ఏదేదో మాట్లాడతావు. నాకు భయమేస్తుంది" అంది.

"నా దగ్గర భయమెందుకు? కవితలు రాసేవారి మనస్సు సున్నితంగా వుంటుంది. తాము సున్నితమని పదేపదే భావించటమే వారి బాధలకు మూలకారణం" అన్నాను.

నాకెందుకో అలసటగా అనిపించింది. అది తీరాలంటే ప్రకృతి ఒడిలోనే సేదదీరాలనిపించింది.

ప్రేమను వెంటబెట్టుకుని 'మణికరణ్'కు బయల్దేరాను. అక్కడ వేడినీటి బుగ్గలున్నాయి. ప్రకృతి ప్రసాదించిన సహజవేడి నీటిబుగ్గల్లో స్నానం ఎంతో ఆహ్లాదకరంగా వుంటుందని ఆశ చూపాక ఆమె నాతో రావటానికి ఒప్పుకుంది.

కులూనుంచి మణికరణ్‌కి వెళ్ళే దారిలో ఎడమవేపున 'పార్వతి నది' మెల్లగా ప్రవహిస్తూ కనిపించింది. కుడివేపున దెయ్యపు గోడలాంటి పెద్ద కొండ నిల్చొని వుంది. ఆ రెండిటి నడుమ ఇరుకుదారిలో బస్సు ఎలా వెళుతుందా అని అనుమానం కలిగింది.

బస్సు ఎడమవేపుకు జారితే పార్వతి నది... కుడిపక్కకు జరిగితే పొడుచుకొచ్చిన కొండ అంచుకు ఢీకొట్టడమే... ఇలాంటి ప్రమాదకర దారుల్లో నడవటం హిమాచల్ ప్రదేశ్ టూరిజమ్ బస్సులకు అలవాటే!

"ఈ బస్సు అవతారం ఎలా వుందో చూశావా, బాడీ డొక్కు డొక్కయిపోయింది. దడదడమని శబ్దం చేస్తూ ఏ భాగం ఎక్కడ వూడిపడుతుందో అన్నట్టుంది. అయినా ఇక్కడి డ్రైవర్లు బస్సుని ఎంత వేగంగా నడుపుతున్నారో చూడు. మనవేపు డ్రైవర్లు ఇక్కడ బస్సును ఒక్క అడుగు కూడా ముందుకి కదపలేరు సుమా" అన్నాను

ప్రేమతో.

"అదేం లేదులే, మన సిటీబస్ డ్రైవర్లు వీళ్ళ బాబుల్లా డ్రైవ్ చేస్తారు. మా ఇంటి ముందున్న సర్కిల్‌లో ఇరవైనాలుగో నెంబరు బస్సు ఎలా మలుపు తిరుగుతుందో తెలుసా? " కాస్త గొప్పగా అంది ప్రేమ.

నేను వెంటనే అన్నాను- "ఆ బస్సును రాజు అనే డ్రైవర్ నడుపుతాడు కదూ. ఆ మహానుభావుడు డ్రైవ్ చేస్తూ సిగరెట్టు వెలిగించే స్టైయిలు చూశావా? నిలబడి గమ్మత్తుగా స్టీరింగ్ తిప్పటం గమనించావా? ముందు డోర్‌గుండా అమ్మాయిలు ఎక్కుతుంటే హఠాత్తుగా బస్సును కదిలించటం, వేగంగా నడుపుతూ సడన్‌బ్రేక్ వేసి ఆడపిల్లల్ని కిందికి పడేలా చేయటం, ఆ తర్వాత వెక్కిరించటం ఇవన్నీ అతని ఘనకార్యాలే"

"నాకతని పేరు తెలియదుగానీ అలాంటి డ్రైవింగ్ మాత్రం నాకెంతో ఇష్టం" హుషారుగా అంది ప్రేమ.

"ఓహో... అందుకే కాబోలు... బైక్ తెచ్చి కాలేజీనుంచి ఇంటికి డ్రాప్ చేస్తానన్నా నాతో రాకుండా ఆ సిటీ బస్సులో వెళ్ళేదానివి? " దెప్పి పొడుస్తూ అన్నాను.

ఆమెకు కోపం వచ్చింది. "అదేం కాదులే... నాతోపాటు ఫ్రెండ్స్ వుండేవారు. పైగా నాకు బస్‌పాస్ తీసుకున్నాను. దానికి తోడు నీతో బైక్‌మీద వెళ్ళటం చూసి అందరూ ఎగతాళి చేసేవారు. ఎవరైనా నా గురించి కామెంట్ చేస్తే నేను భరించలేను. అందుకే నిన్ను అవాయిడ్ చేసేదాన్ని" గబగబా చెప్పింది.

"పోనీలే, గతించిన దాన్ని మరిచిపోవాలి. లేక అది ఇప్పటికీ సమస్యగా వుంటే పరిష్కారం కనుక్కోవాలి. ఇప్పుడు అలాంటిదేం

లేదు గనక దాన్ని వదిలేద్దాం" బస్సు డ్రైవర్ టాపిక్‌ని అక్కడితో ముగించి బయటికి తొంగిచూశాను.

సుందరలోకాలకు తెరతీస్తూ ముందుకు సాగుతోంది బస్సు. ఎదురుగా మరో బస్సు వస్తే ఏమిటి గతి అనిపించేంత ఇరుకైన దారి అది. పర్వతశిఖరాల పదునైన అంచులు విభ్రాంతి గొల్పుతున్నాయి. అక్కడికి పరుగెత్తికెళ్ళి ఆ ఎత్తయిన శిఖరాల అందాల్ని తిలకిస్తూ కూర్చోవాలనిపించింది.

దారి పక్కనే కనిపించే ఒకటీ అరా ఇళ్లు విచిత్రంగా వున్నాయి. ఇళ్ళ పైకప్పులకు నునుపైన రాతిబండల్ని అమర్చారు. ప్లైవుడ్ కోసి ప్రత్యేకంగా చేయించినట్టున్న డిజైను. ఆ ఇళ్ల మిద్దెలపై ముగ్గిన జొన్నల్ని ఎండవేశారు. హిమ ప్రభావంతో చల్లగా వున్న లేత ఎండలో అవి మెరుస్తున్నాయి.

దారి పొడుగునా చెక్క పెట్టెల్లో ఆపిల్ పండ్లను నింపి అలా జోడించిన పెట్టెలతో లారీల కోసం ఎదురుచూస్తూ రైతులు నిల్చునివున్నారు.

మరోపక్క పశువుల్ని కాసే అందగత్తెలు ఊలు తీస్తూ కూర్చుని వుండగా వీళ్ళ చెంతనే మెరిసే కనులచిన్నారులు ఆడుకుంటున్నారు. పశుకాపరులు మధురంగా వేణువు వాయిస్తూవున్నారు.

ఓ లోతైన లోయను దాటడానికి ప్రజలే నిర్మించిన ఓ పాత చెక్కల వంతెనపై మామూలు వేగంతోనే బస్సు దూకినప్పుడు ప్రేమ భయంతో నన్ను గట్టిగా పట్టుకుంది.

ఓ స్త్రీ! ఎంత భయం నీకు! రవ్వంత చప్పుడైనా భరించలేని కోమలత్వం నీది! అందుకే నిన్ను కుసుమ కోమల హృదయం కలదానివని అంటారు కాబోలు. కొందరు నిన్ను 'అబల' అంటారు. మరి కొందరైతే 'పరాశక్తి' అని అంటూ నీ చేతికి ఈటె, బాణం, పారలాంటి ఆయుధాలు ఇచ్చి నీ చిత్రాన్ని గీస్తారు.

అయితే వీటిలో ఏదీ నీ అసలు రూపం కాదు. ఇవన్నీ స్త్రీ గురించి మగవాడి ఊహల్లో రూపుదిద్దుకున్న అతిశయోక్తితో కూడిన చిత్రాలే! అభూతకల్పనలే.

నీవే పరాశక్తివి అయివుంటే చిన్నపాటి శబ్దానికే భయపడిపోయి నన్నిలా పట్టుకునే దానివా? నిన్ను 'కోమలం' అన్నవారు కూడా మూర్ఖులే. నీ కడగంటి చూపుకోసం ఎన్నిసార్లు నా హృదయం వేదనతో అలమటించలేదు? నీ కారణంగా కలిగిన హింసా భారంతో ఎన్ని రాత్రిళ్లు నిద్రలేక బాధపడుతూ గడపలేదు?

స్త్రీని సుకుమారమని, కోమల హృదయిని అని భావించేవారికి నేనొక దృశ్యాన్ని చూపించాలనుకుంటున్నాను. అదేమిటంటే ఆ సుకుమారి మటన్, చికెన్‌ని ఆబగా తినే దృశ్యం! చనిపోయిన ఓ మూగజీవి మృత దేహాన్ని నిర్లజ్జగా, పళ్లమధ్య పెట్టుకుని కర కర నములుతూ లొట్టలేస్తూ తినే స్త్రీకి కోమల హృదయం వుంటుందని ఎలా అనుకోగలం? ఇది కుసుమ కోమల హృదయం గల స్త్రీ చేయదగిన పనేనా?

నాగపూర్‌లో తనకు నాన్-వెజ్ భోజనమే కావాలని ప్రేమ ఎంతగా మారాం చేసింది? ఎంతగా పట్టుబట్టింది. స్త్రీని కోమలం అనటం భావ్యం కాదు. ఆమె కూడా పురుషుడి మాదిరి ఒక ప్రాణియే. అంతే! ఆమెలో కోమలత్వమూ లేదు, గీమలత్వమూ లేదు. మగవాడికి కలిగిన భ్రమలే ఆమెపట్ల అలాంటి వర్ణనలకి అవకాశమిస్తున్నాయి. ఇలాంటి వేనవేల వర్ణనల్ని చేసిన పిచ్చివాళ్లల్లో నేనూ ఒకణ్ని!

మణికరణ్ చేరుకునేసరికి బస్సు కుదుపులవల్ల విపరీతమైన ఒళ్లు నొప్పులు మొదలయ్యాయి. ఇక్కడ భూగర్భంలోంచి వేడి నీళ్లు భుగభుగమని పొంగుకొస్తాయి. భూగర్భంలో దాగివున్న అగ్ని ఇక్కడ బయటప




డుతోంది. మనుషుల కోపమంతా నాలుక పైనుంచి మాటలుగా ఎగిసిపడేలా.

అలాంటి వందలాది వేడినీటి బుగ్గలు ఆ ఊర్లో వున్నాయి. అదొక చిన్న ఊరు. ఉన్నత ప్రదేశంనుంచి చూస్తే సిప్పీనో, రాజ్ కపూరో తమ కొత్త సినిమా షూటింగ్ కోసం వేసిన అగ్గిపెట్టెల సెట్ లా కనిపిస్తుంది. అక్కడక్కడ పైకి లేస్తున్న పొగను చూసి నా ప్రేయసి ఆశ్చర్యపోయింది.

"ఇక్కడ వేడినీటిలో ఎంచక్కా స్నానం చేయొచ్చు సుమా. నీ అలసటంతా క్షణాల్లో ఎగిరిపోతుంది. ఇలాంటి మహత్తర అవకాశం నీకు జీవితంలో మళ్ళీ ఎప్పుడూ దొరకదు" అన్నాను. ఆమె కూడా నాలాగే అలసిపోయింది మరి.

మణికరణ్ ఒక చిన్న ఊరు. భారీ లోయల మధ్య వేడి నీటి బుగ్గల్ని మోసుకుని తీరిగ్గా పడుకున్నట్టుంది. ఇది పార్వతీ నదీతీరంలో వుంది. ఇక్కడ ఆకాశంలోకి నిటారుగా నిల్చున్నట్టు పెరిగిన దేవదారు వృక్షాలున్నాయి. మంచును కప్పుకున్న పర్వత శిఖరాగ్రాలున్నాయి. రెండు రూపాయలకు కేజీ ఆపిల్ పళ్లు లభించే ప్రదేశమిది.

నది ఒడ్డున గల ప్రావిజన్ స్టోర్‌లో కూర్చున్న ముసలి వ్యక్తిని పరిచయం చేసుకుని అతని షాపులో మా లగేజిని వుంచాను. తర్వాత నేనూ, ప్రేమా కలిసి స్నానగృహాలవేపు నడిచాము.

గతంలో నేనక్కడికి వచ్చి వుండటంవల్ల ప్రేమ అడగకముందే అక్కడి విశేషాల్ని నేను వివరించి చెప్పసాగాను.

భూమినుంచి సహజంగా వచ్చే వేడినీటి గురించి అక్కడి ప్రజలు ఓ పౌరాణిక గాథను చెప్పుకుంటారు.

ఆ కథలో శివపార్వతులను ఇరికించి రసవత్తరమైన సంఘటనలు అల్లారు. హిందూ దేవాలయాలతోపాటు సిక్కుల గురుద్వారాలు కూడా అక్కడున్నాయి.

భుగభుగమని పొంగే వేడినీటిలోకి బియ్యం కట్టిన చిన్న మూటల్ని వేలాడదీస్తే కొద్ది నిమిషాల్లోనే మల్లెపూల మాదిరి తెల్లటి అన్నం ఉడికి నోరూరిస్తుంది. భక్తాదులకు దీనినే ప్రసాదంగా వడ్డిస్తారు. అలా వండబడిన అన్నపు కుండల్ని, గుడ్డ మూటల్ని ప్రేమకు చూపిస్తూ వివరించాను.

ఆమెకు చాలా ఆశ్చర్యమేసింది. "ఇలా అయితే కట్టెల ఖర్చు అంతా మిగిలిపోతుందికదా!" అనేసింది తన సహజ ధోరణిలో.

ఇద్దరం స్త్రీ పురుషుల కోసం వేరువేరుగా కట్టిన స్నానశాలల్లోకి వెళ్లి వేడినీటి స్నానాన్ని ముగించాం. రాత్రంతా ప్రయాణం చేయటంవల్ల కలిగిన అలసట అంతా ఎగిరిపోయి హాయిగా అనిపించింది.

ప్రేమ స్నానమందిరం నుంచి బయటికొచ్చాక చాలా అందంగా కనిపించింది. ఆ అందాన్ని చూడగానే నాలో ఎంతటి బలీయమైన కోరిక కలిగిందంటే- ఉన్నఫళాన ఆమెను మనాలికి లాక్కుపోయి రూము తీసుకుని రెండ్రోజులదాక ఆమెతో పడకసుఖాన్ని అనుభవించాలనిపించింది. ఎంతటి రమ్యమైన రూపం ఆమెది. స్నానం చేయటంవల్ల కేశాలకు గాఢమైన నల్లటి మెరుపు వచ్చింది. గుండెల్లోకి దూసుకుపోయి నిలువునా చీల్చి చంపేసే చూపుల్ని విసిరే అవే కళ్లు... ఆ కనుచూపుల తూపుల్లో వాడి, వేడి, నునుపు, పదును ఏమాత్రం తగ్గలేదు.

"ఏమిటి? " నా చూపుల్ని పసిగట్టి కనురెప్పలు టపటపలాడిస్తూ అడిగింది.

"నువ్వు చాలా అందంగా కనిపిస్తున్నావు సుమా!" అన్నాను పరవశంగా చూస్తూ.

నా మాటలకు ఆమె అటూ ఇటూ చూస్తూ "ప్రస్తుతం ఇక్కడెవరికీ కన్నడ భాష తెలిసినట్టు లేదు. తెలిసివుంటే

వాళ్ళంతా నీ కవిత్వం వినటానికి పోగై వుండేవారు.... వివేక్, అక్కడ చూడు, ఆపిల్ పళ్లు గుట్టగా పడివున్నాయి" అంది ఓ ఆపిల్ చెట్టును చూపిస్తూ.

ఆ చెట్టుకింద పళ్లు రాలిపడివున్నాయి. తినేవారు లేక సగం పళ్లు కుళ్ళిపోయాయి కూడా.

"ఇవే మన మైసూరు పళ్ళ వ్యాపారులకు దొరికివుంటే కిలో పది రూపాయల చొప్పున హాట్ హాట్ గా అమ్మేసేవారు సుమా" అంది.

నేను నవ్వేశాను.

మేం అదేరోజున 'మనాలి'కి చేరుకున్నాం. చేరిన మరుక్షణం నేను మా ఊరికి మరో ఉత్తరం రాశాను. నేను రాశాను అనటం కంటే మేము ఇద్దరం కలిసి రాశాం అనటం సబబేమో!

## నాయిక

'అంత తొందరెందుకు? తర్వాత తీరిగ్గా వ్రాయొచ్చు' అన్నా ఈ వివేక్ విన్పించుకోడు. ప్రతి రోజూ ఊరికి ఓ ఉత్తరం రాయిస్తున్నాడు.

"వారి భయం, దిగులు నీకేం తెలుస్తాయి! మన క్షేమసమాచారంకోసం వాళ్ళు ప్రతిరోజూ వేయికళ్ళతో ఎదురుచూస్తుంటారు" అంటూ తొందరపెడతాడు. మేమేదో విదేశాలకు వెళ్ళినట్టు హైరానా పడతాడు. మా ప్రయాణం మహా అయితే మూడువేల కిలోమీటర్లు అయివుండొచ్చు

ఈ ఊరి పేరు 'మనాలి' అట! నా దృష్టిలో ఇది ఆ కులూకన్నా అందంగానే వుందనిపించింది. ఊరి పక్కనే బియాస్ నది ప్రవహిస్తోంది. మేము దిగిన హోటల్ పేరు కూడా 'బియాస్' అనే పెట్టారు.

అబ్బబ్బా, ఈ వివేక్ రవ్వంత కూడా అలసిపోయే రకంకాదు. ఇతన్లో రోజురోజుకీ ఉత్సాహం పెరుగుతూనే వుంది. కొంత అనారోగ్యం వున్నప్పటికీ అతనిలో పడకసుఖంపట్ల కోరిక ఏమాత్రం తగ్గలేదు. అతని దాడినుండి తప్పించుకోవాలని 'కాస్సేపు బయట తిరిగొద్దాం రా' అన్నా నా మాటలు విన్పించుకోడు.

గది తలుపులు బిడాయించి రోజంతా వెచ్చగా నన్ను కౌగిలించుకుని పడుకున్నాడు.

ఇక్కడి హోటళ్లలో కప్పుకోవటానికి 'రజాయి'లు ఇస్తారు. అంత చలిగా వుంటుంది మరి. ఈ వివేక్ రాత్రంతా నా నగ్నశరీరాన్నే పెనవేసుకుని 'ప్రేమా, ప్రేమా' అంటూ పలవరించసాగాడు. నాకైతే ఇతని ఉద్రేకం రానురాను హింసగా మారుతూ వచ్చింది. ఒక్కోసారి భరించలేక కేకలు వేసేదాన్ని. అతను ఒక్కొక్కసారి చిన్నపిల్లాడిలా నా భుజంపై వాలి కన్నీరు కార్చేవాడు.

నాకు ఇదే... ఇదే అతనిలో నచ్చని అంశం. మగవాడై పిరికివాడిలా ఎందుకు ఏడ్వాలి? అతని ప్రేమకు నేనేమైనా అడ్డు చెబుతున్నానా? అయినా రోజంతా గది నాలుగుగోడలమధ్య బందీచేసి నన్ను నిర్విరామంగా సంభోగించటానికి నేనేమైనా ప్రాణంలేని యంత్రాన్నా?

ఈ హనీమూన్‌తో నాకు విసుగుపుట్టింది. ఇక ఊరికి తిరుగు ప్రయాణం కావాలి. అక్కడ నాన్నగారు ఫ్యాక్టరీలో ఏమేం నష్టాలు తెచ్చుకున్నారో? ఇప్పటికే అవసరానికి మించి పనివాళ్ళున్నారు. వారి వీరి మాటలకు, రికమెండేషన్‌లకు లొంగిపోయి ఇంకా కొత్త వాళ్ళని పనిలోకి తీసుకున్నారేమో... వాళ్ళంతా ఒట్టి సోమరిపోతులు. ఉన్నవాళ్ళతోనే పనంతా చేయించుకోవాలి. లేబర్ పెరిగినకొద్దీ ప్రాబ్లెమ్స్ కూడా పెరుగుతాయనే సంగతి నాకు




తెలుసు. నేను మైసూరులో లేకపోతే 'సుశీలా మహల్'కు గానీ మా ఫ్యాక్టరీకిగాని కళాకాంతులే వుండవు. ఇప్పుడు 'వివేక్ ట్రేడర్స్'కి కూడా నావల్లనే కళ వచ్చింది. నేనక్కడ లేకపోతే మా ఇంటిముందు సిటీ బస్సు కూడా సరిగ్గా తిరగదు. నా ఒక్క చిరునవ్వుకీ, నా ఆజ్ఞకు అక్కడ ఎంత విలువ వుందో?

ఇక్కడ ఈ హిమావృత శీతల ప్రదేశానికి నన్ను తీసుకొచ్చి హనీమూన్ అంటూ, ప్రేమా గీమా అంటూ డబ్బుని మంచినీళ్ళలా ఖర్చుపెట్టే ఈ వివేక్‌కి అస్సలు బుద్ధి లేదు. ఇక్కడ ప్రతిదానికీ ఎంత ఖర్చుపెట్టాలి? ఆపిల్ పళ్ళొక్కటే ఇక్కడ చవక! మణికరణ్ దారిలో ఒక్కో మొక్కజొన్న రొట్టెకు నాలుగు రూపాయలు వసూలుచేసిందా హోటల్ ముసలావిడ. వివేక్‌కి ఇలాంటి ఖర్చులపట్ల రవ్వంత కూడా బాధ వున్నట్టు లేదు. "కొండలు చూడు... మంచును చూడు... నదులు చూడు... చెట్లను చూడు" అంటూ ఊహాలోకాల్లో తేలిపోతాడు. తండ్రి ఎంతో కష్టపడి ఆస్తిని సంపాయించడంవల్ల ఇతను తీరిగ్గా కూర్చుని కవితలు రాయగల్గుతున్నాడు. డబ్బులేకపోయి వుంటే అతనికి కవిత్వం కంటే డబ్బు ఎంత ముఖ్యమో అర్థమైవుండేది. కవిత్వం రాసినా నాకేం అభ్యంతరం లేదు. కాని దానివల్ల డబ్బు రాదని తెలిసినా ఎందుకు తలకాయ పగలగొట్టుకోవాలి? ఒక కవిత ప్రింటయితే ఆరు నెలల తర్వాత ఇరవై రూపాయలు ఇస్తారట. ఇంతకన్నా నష్టదాయకమైన వ్యాపారం మరొకటి వుందా? మా ఎక్స్‌పోర్టు బిజినెస్ పట్ల శ్రద్ధ తీసుకుంటే ఏడాది తిరిగేసరికి కోట్ల రూపాయలు కేవలం అగరొత్తులు అమ్మి సంపాయించవచ్చు ఇదంతా ఈ వివేక్‌కి అర్థమై చావదు! ఇలాంటి ఆలోచనలతోటే నిద్రలోకి జారుకున్నాను.

తెల్లవారుతుండగా హఠాత్తుగా మెలకువ వచ్చింది. పక్కనే వుండాల్సిన వివేక్ కనపడలేదు. అరె, రాత్రంతా నన్నే హత్తుకుని పడుకున్న వివేక్ ఇంతవేకువజామునే ఎక్కడికెళ్ళాడు? నేను కంగారుగా లేచి బయటికొచ్చాను.

టెరెస్‌పైన కనిపించాడు వివేక్. తూరుపువైపు ముఖం పెట్టి నిల్చుని ఏదో చూస్తున్నాడు.

"వివేక్, ఇంత చలిలో ఏమీ కప్పుకోకుండా ఎందుకలా నిల్చున్నావ్? నీకు చలేయటంలేదా? " అన్నాను చలికి వణుకుతూ

"సూర్యుడ్నీ, సూర్యుడు ఉదయించే మనోహర దృశ్యాన్ని రెప్పవాల్చకుండా చూడగలగటం ఇప్పుడే సాధ్యపడుతుంది" నావైపు చూడకుండా అలాగే నిల్చుని అన్నాడు.

తూర్పున సూర్యోదయం అయింది.

వివేక్ నా దగ్గరికొచ్చి అడిగాడు "కొంత దూరం అలా షికారుకెళ్ళొద్దాం వస్తావా? "

నిజానికి అంత చలిలో బయటికి వెళ్ళటం సాధ్యంగా అనిపించలేదు. అయినా వివేక్ కోసం అంగీకరించాను.

ఇద్దరం తూర్పువేపుగా బయల్దేరాం. 'ప్రిని' అనే పల్లె ఆ వేపునే వుంది. రైతులు తమ పొలాలకు చిన్న కాలవలగుండా నీరు వదులుతున్నారు. ఆ నీటిని తాకితే మంచును ముట్టుకున్న అనుభూతి! అంత చల్లటి నీటిలో కూడా చిన్నచిన్న అమ్మాయిలు వంట పాత్రలు కడుగుతున్నారు. స్త్రీలు, పిల్లలందరూ ఉలెన్ స్వెట్టర్లు ధరించి తిరుగాడుతున్నారు.

వివేక్ దారిలో ఎదురైన ఓ రైతుని పరిచయం చేసుకున్నాడు. మాటామంతీ అయ్యాక ఆ రైతు అన్నాడు. "దేవుడి ఆదేశం రానంతవరకు మేం పంటను కోయము"

స్నోఫాల్ ప్రారంభం కావటానికి ముందురోజున 'ఘోర్' అనే దేవుడి ప్రతినిధి ప్రజలందర్నీ పిలిచి 'రేపు పంట కొయ్యండి' అని ఆదేశిస్తాడట. దేవుడి అనుమతికి మునుపే పంటలు కోసినవారిని శిక్షించటం జరుగుతుందట. మరీ మూఢనమ్మకాలున్న మనుషులు! బయటవారిని గౌరవిస్తారుగాని దగ్గరికి తీయరు. దేవాలయాలను స్పర్శిం చటం మహాపాపం అనే మరో నమ్మకం కూడా వారిలో వుంది.

వివేక్ విషయాలన్నీ క్లుప్తంగా చెప్పాడు., ఎందుకో ఇప్పుడతను నాతో ఎక్కువగా మాట్లాడటంలేదు. మళ్ళీ ప్రకృతి ప్రేమికుడై పోయాడు.

బియాస్ నది ఒడ్డున ఓక్ చెట్టు మొదట్లో ఒక వ్యక్తి మాంసం కోస్తున్నాడు. చెట్టు కొమ్మకు ఒక మేక శరీరం వేలాడు తోంది. ఆ దృశ్యాన్ని చాలాసేపు చూశాను. మేము వెళ్ళిన మార్గంలోనే ఓ పర్వతారోహ కుల క్యాంపు కూడా కనపడింది.

"మన తర్వాతి ప్రోగ్రాం ఏమిటి వివేక్? " అడిగాను. నాకు నిజంగానే ఈ చలి, మంచుపర్వతాలంటే మొహం మొత్తింది.

'ఇక మనూరికి వెళ్ళిపోదాం డియర్' అంటాడని ఆశతో వివేక్ వంక చూశాను. అతను నింపాదిగా అన్నాడు.

"నాకు తెలుసు, నీ మనసు అప్పుడే మైసూరువైపు మళ్ళిందని. చూడు ప్రేమా, జీవితంలో మళ్ళీమళ్ళీ మనమిక్కడికి రావటం సాధ్యంకాదు. ఇప్పుడు ఎలాగూ వచ్చాం కదా, ఈ అవకాశాన్ని సద్వినియోగ పరచుకుందాం. ఇక్కడ 'నగర్' అనే ఒక ఊరుంది. అక్కడ 'రోరిచ్ ఆర్ట్ గ్యాలరీ' వుంది. రష్యాకు చెందిన రోరిచ్ అనే చిత్ర కారుడు ఇక్కడి ప్రకృతి సంపదకు ఆకర్షి తుడై చిత్రాలు వేస్తూ ఇక్కడే తన శేషజీవి తాన్ని గడిపాడు. అతడి నివాసమే ఇప్పుడు మ్యూజియంగా రూపుదాల్చింది. అది చూశాక 'రోథాంగ్‌పాస్'కు వెళదాం. అది పధ్నాలుగు వేల అడుగుల ఎత్తయిన పర్వ తశ్రేణి. అక్కడికి బస్సులు కూడా వెళ తాయి. ఇంతదాకా వచ్చి 'రోథాంగ్ పాస్'కి వెళ్ళకపోవటమనేది మూర్ఖత్వమే!"

నేను కరాఖండీగా చెప్పేశాను "అన్ని స్థలాల్ని చూడటం కుదరదు. రోథాంగ్‌పా స్‌కి వెళ్ళి ఒకటి రెండు గంటలు గడిపి తిరి గొచ్చేద్దాం. నాకు స్నో చూడాలని కోరికగా వుంది. కాని రోరిచ్ గ్యాలరీ అంటే నాకిష్టం లేదు"

నా ప్రతిపాదనకు వివేక్ అంగీకరిం చాడు. ఇక రోథాంగ్‌పాస్ గురించి కాస్సేపు ఉత్సాహంగా వర్ణించాడు. అయితే నాకతని మాటలపట్ల పెద్ద కుతూహలం ఏమీ కలగ లేదు. కవితలు, పద్యాలు రాసే ఈ మహా నుభావుడికి ఇక్కడి మొక్కజొన్న కంకులు కూడా బంగారు ముక్కలే!

ఇక్కడికి ఇంత ప్రయాసపడి రావటం కంటే ఏ ఊటీకో, నందికొండలకో వెళ్ళి వుంటే తక్కువ ఖర్చులో హనీమూన్ హాయిగా గడిపి వుండేవాళ్ళం. రేపు 'రోథాం గ్‌పాస్' చూశాక ఒకక్షణంకూడా వుండ కుండా తిరుగుప్రయాణం పెట్టుకోవాలి అని గట్టిగా నిర్ణయించుకున్నాను.

ఆరాత్రి కూడా వివేక్ నా శరీరంతో పిచ్చి వాడిలా ఆడుకున్నాడు. అది ప్రేమో కామమో, కోపమో, కసో నాకు అంతుబట్ట లేదు. ఒక్కోసారి నా సుకుమార సున్నిత భాగాలని గట్టిగా కొరికేసేవాడు. నేను 'అబ్బా'అంటూ బాధగా మూలిగితే అది సుఖపారవశ్యంతో నా నోట్లోంచి వచ్చిన నిట్టూర్పుగా పొరబడి మరింత రెచ్చిపో యాడు.

"ప్రేమా, ఓసారి నిన్ను పూర్తి నగ్నంగా చూడాలని వుంది" అంటూ హఠాత్తుగా కోరాడు.

"ఇప్పుడెలాగూ అర్ధనగ్నంగా వున్నాను కదా. ఊరుకో, నాకు సిగ్గేస్తుంది" అని ప్రాధేయపడినా అతను పట్టువదల్లేదు. పక్కవదిలి ఎదురుగా వున్న కుర్చీలో నేను అయిదు నిమిషాలసేపు పూర్తి నగ్నంగా కూర్చోవాలని కోరాడు. నాకు సిగ్గనిపించింది.

భర్తతో కలిసి నగ్నంగా పక్కను పంచుకోవటం వేరు. నగ్నంగా కుర్చీలో కూర్చోవటం వేరు. అలా నేను కూర్చుంటే అతడా మనోహర దృశ్యాన్ని దూరంనుండి తిలకించి ఆనందిస్తాడట.

"నావల్ల కాదు బాబూ" అని మొండికేశాను. అయినా అతను విన్పించుకోలేదు.

"భర్తకు ఇలా అడిగే హక్కువుంది, చూసే అధికారమూ వుంది. నువ్విలా కూర్చోక తప్పదు. లేకపోతే మనం మైసూరువెళ్ళటం మరోవారం ఆలస్యమవుతుంది" అంటూ బెదిరించాడు.

అతడి కంఠంలో పసిపిల్లవాడి హఠం వుంది.

చివరికి నేను ఓడిపోయినట్టు అన్నాను. "సరే, కాని అడ్డుగా ఒకటి రెండు గుడ్డ ముక్కల్నయినా పెట్టుకుంటాను"

అతను అడ్డంగా తలూపాడు.

"అలా వీల్లేదు. నువ్వు పూర్తి నగ్నంగా నా కళ్ళముందు నిలవాల్సిందే" అన్నాడు.

"ఎందుకు? నా నగ్నదేహంమీద కవితలు రాయటానికా? " అన్నాను కోపంగా.

వివేక్ స్థిరంగా అన్నాడు.

"ఇప్పటికే ప్రారంభమైన నా కవితని ఇక్కడ ముగించాల్సి వుంది. చివరి పాదాన్ని రాయాల్సివుంది. నీవు ఒక్కసారి నగ్నంగా నుంచుంటే కవిత పూర్తవుతుంది. కట్టుకున్న మగవాడి ముందు నగ్నంగా నిలబడటానికి సంకోచమెందుకు? నీ శరీరంలోని అణువణువూ నాకు తెలుసు. దాన్ని మరింత సమగ్రంగా తిలకించాలని నా అభిలాష"

"అరరే! నన్ను తాకటానికి సైతం భయపడే పిరికి ప్రేమికుడివి, నన్ను బలవంత పెట్టి నగ్నంగా మార్చేటంత పరమ కాముకుడివి ఎలా అయ్యావు? " అనుకుంటూ ఆశ్చర్యపోయాను.

ఇక చేసేది లేక నా ఒంటిపై మిగిలి వున్న దుస్తుల్ని తీసేసి నగ్నంగా, నిర్లిప్తంగా అతని ముందు నించున్నాను. నిజంగానే ఇప్పుడు నేనతని దయాదాక్షిణ్యాలపై ఆధారపడి వున్నట్లనిపించింది. మనిషికి దుస్తుల విలువ ఏమిటో ఆ క్షణంలోనే నాకు అర్థమైంది. నేను అందరి ఎదుట నగ్నంగా నుంచున్నట్టు అనిపించి సిగ్గుతో కుంచించుకుపోతూ రెండు చేతుల్తో రహస్యాంగాల్ని దాచటానికి ప్రయత్నించాను.

"ఊహు! అలా చెయ్యకు. సరిగ్గా కూర్చో" కళ్ళార్పకుండా నా శరీరాన్ని చూస్తూ వివేక్ అన్నాడు.

నేను అయిష్టంగానే కుర్చీలో కూర్చున్నాను..

"అలాగే లేచి రెండు నిమిషాలు నించో" వివేక్ మళ్ళీ ఆదేశించాడు.

నిలబడ్డాను.

రాముడిముందు హనుమంతుడు మోకరిల్లినట్టు మోకాళ్ళపై నా ముందు కూర్చున్నాడు. విపరీతమైన సిగ్గుతో సంకోచంతో బిత్తిరిపోయాను. అయినా ఏమీ చెయ్యలేని నిస్సహాయస్థితిలో వున్నాను. ఎముకలు కొరికే చలిలో నగ్నంగా నుంచోవటం ఎంత భయంకరమైన శిక్ష!

వివేక్ నా చుట్టూ గుండ్రంగా తిరుగుతూ నా నగ్న శరీరాన్ని కళ్ళార్పకుండా చూస్తున్నాడు. నాకు ఇన్నాళ్ళ అతని ప్రేమ అంతా

అబద్ధం అనిపించింది. 'ఇలాంటి రోజే' అతని ప్రేమకు లక్ష్యమై వుంటుంది. ఈ ఫలితం పొందటంకోసమే అతనిన్నాళ్ళు ప్రేమ నాటకం ఆడినట్టున్నాడు. చివరికి ప్రేమారాధన నెపంతో తనకు కావలసిన దాన్ని సాధించుకున్నాడు. ఆనాటి అతని ఆరాధన అంతా... ఇలా ఏకమొత్తంగా నన్ను కబళించటానికే అయి వుండాలి. నన్ను ఇలా నగ్నంగా మార్చి కళ్ళార్పకుండా చూడటంలో ఏ సుఖముందో, ఎలాంటి ఆనందం వుందో నాకు అర్థంకాలేదు.

నేను నిజంగానే ఓడిపోయాననిపించింది. "ఇక చాలు వివేక్, నాకు చలేస్తోంది" అన్నాను గజగజ వణుకుతూ.

నా మాటలు వినటం ఆలస్యం, జింక పిల్లపై దూకే పులిలా నాపైబడి నన్ను గాఢంగా పెనవేసుకున్నాడు. నన్ను పడకమీదికి పడదోసి నన్ను అల్లుకుపోయాడు. నా ఒంట్లోని చలిని పారదోయటానికన్నట్టు నా శరీరాన్ని కసిగా నలిపేయసాగాడు.

ఆ అద్భుత ప్రవాహంలో పడి నేను కొట్టుకుపోయాను.

ఉదయం ఎనిమిది గంటలయ్యేసరికి అతని తీవ్ర ఆక్రమణకు నేను నలిగిన ఫలాన్నయ్యాను. జీవితంలో ఇంకెన్నడూ ఇలాంటి సుఖాన్ని పొందలేననిపించింది. అతని వికృతమైన కామక్రీడలన్నీ ఇప్పుడు నాకెంతో ప్రియంగా అనిపించసాగాయి.

ఉదయం ఎనిమిది దాటినా ఇద్దరికీ లేవటానికి మనసొప్పలేదు. రూంబాయ్ వచ్చి తలుపు తట్టినప్పుడు నా పరిస్థితి గుర్తొచ్చి సిగ్గుతో చితికిపోయాను. వివేక్ నన్ను బాత్‌రూంలోకి తోసేసి ఆనక తలుపు తెరిచాడు. "'రోథాంగ్ పాస్'కు బస్సెప్పుడు వుందో కనుక్కుని ఉదయమే వచ్చి చెప్పు" అంటూ నిన్న వివేక్ రూంబాయ్‌ని ఆదేశించిన సంగతి నాకు గుర్తొచ్చింది. ఆ కుర్రవాడు అదే సంగతి చెప్పటానికి వచ్చినట్టున్నాడు. 'పదిగంటలకు' 'కైలాస్' వెళ్ళే బస్సులో బయల్దేరి రోథాంగ్‌పాస్‌లో దిగాలి సార్' అని చెబుతున్నాడతను.

తర్వాత రెండు చాయ్ తెమ్మని చెప్పి వివేక్ తలుపు మూసి బోల్ట్ బిగించాడు. ఆ తర్వాత నన్ను బాత్‌రూంలోంచి బయటికి లాక్కుని నున్నటి నా ఒంటిపై ముద్దుల వర్షం కురిపించాడు.

"ఈవాళ నేనే నీకు బట్టలు తొడుగుతాను" అన్నాడు.

నాకతని ప్రవర్తన విచిత్రమనిపించింది.

## నాయకుడు



అయితే ఇదంతా నాకు విచిత్రంగా తోచలేదు. నేను ఆరాధిస్తూ వచ్చిన ప్రేమను ఈరోజు సంపూర్ణంగా నగ్నంగా చేసి నుంచోబెట్టాను. కూర్చోబెట్టాను. ఇది కేవలం కామం కాదు. అంతరంగంలో దాగి కూర్చున్న కుతూహలం! సమాధానాలు కోరుతూ కేకలు పెడుతున్న వేలాది ప్రశ్నలు నాలో అలాగే వున్నాయి. వాటన్నిటికీ సమాధానం 'స్త్రీ నగ్నత్వం'లో లభిస్తుందని భ్రమపడ్డాను.





డిమ్‌లైట్ వెలుతుర్లో ఆమెను నగ్నంగా నించోబెట్టి హఠాత్తుగా లైటు వేశాను. ఆమెను ఇబ్బంది పెట్టాను.

బయట బియాస్ నది హోరు...

లోపల లైటు కాంతిలో ప్రేమ నగ్నసౌందర్యపు జోరు...

చాలా సేపటివరకు తదేకంగా ఆ మనోహర దృశ్యాన్నే చూస్తుండిపోయాను.

ఇప్పుడింకా మరో రెండు గంటల వ్యవధి మాత్రమే వుంది. ఆ తర్వాత మేము రోథాంగ్‌పాస్‌కు బయల్దేరాలి. అక్కడ విపరీతంగా చలి వుంటుంది గనక దానికి తగినట్టు మేము సిద్ధం కావాల్సివుంది.

ప్రేమ ఇంకా నా ముందు వివస్త్రగానే నుంచుని వుంది.

"ప్రేమా, ఈవాళ నీకు బట్టలన్నీ నేను స్వయంగా తొడిగిస్తాను. మొదట స్నానం చేయిస్తాను. నిన్ను చక్కగా అలంకరిస్తాను. నుదుట కుంకుమ పెడతాను. ఇవాళ నీ పనులన్నీ నేనే చేయాలి" అన్నాను.

ఆమెకు ఆశ్చర్యంతో నోట మాటరాలేదు. ఆమె అనుమతికోసం వేచి చూడకుండా ఆమెను బాత్‌రూంకి తీసుకెళ్ళి ఆమె ఒంటిపై నీళ్ళవర్షం కురిపించాను. ఓ తల్లి తన బిడ్డకు స్నానం చేయించినట్టు నిర్వికారంగా ఆమె శరీరాన్ని శుభ్రంచేశాను. తర్వాత టవల్‌తో ఆమె దేహాన్నంతా తుడిచి పౌడర్‌రాశాను. నాచేత బ్రా, పెటికోట్ తొడిగించుకోవటానికి ఆమె చాలా సిగ్గుపడింది.

"పిచ్చిదానా, ఒక విషయం గుర్తుంచుకో, ఇలాంటి మధుర క్షణాలు మళ్ళీ మళ్ళీరావు. ఇలా సేవలు చేసే భర్త నీకు ఎక్కడ దొరుకుతాడు? " అన్నాను.

బట్టలు తొడిగించాక ఆమె తల దువ్వి నేనే హెయిర్‌పిన్ తగిలించాను. నుదుట బొట్టు పెడుతున్నప్పుడు మాత్రం నా చెయ్యి వొణికింది.

పాడు చలి!

ఆమె నన్ను పిచ్చివానిలా తదేకంగా చూసింది.

నేనే స్వయంగా అలంకరించిన ఆ సుకుమార సౌందర్యమూర్తిని కన్నులారా చూశాను. ఆమె తీసివేసిన నగలన్నీ మళ్ళీ తొడిగించాను. చెవికి రింగులు, మెడలో ముత్యాలహారం!

ఈ అలంకరణలన్నీ ముగిసేవేళకి భావాతిరేకంతో నలిగిపోయిన నా మనసును సేదతీర్చటానికన్నట్టు ఆమె కుచ్చిళ్ళలో ముఖం దాచుకున్నాను. మనసు కరిగి నీరై కనులగుండా ప్రవహించింది. రెండు నీటి చుక్కలు ఆమె కుచ్చిళ్ళలో మాయమయ్యాయి.

సమయం కావటంతో బయలుదేరటానికి సిద్ధమయ్యాం.

మేము బయల్దేరాం. నేను మనస్ఫూర్తిగా నగ్నంచేసి ఆ తర్వాత ఇష్టపూర్వకంగా అలంకరించిన అపురూప సౌందర్యరాశిని వెంటబెట్టుకుని 'మనాలి'నుంచి ఏటవాలు దారిలో పయనమయ్యాను.

మనాలి చుట్టూ మంచు పర్వతాలు! హిమపర్వతాల నడుమ వున్న కైలాసమది.

ఆ హిమ వాతావరణాన్ని చూసి ప్రేమ బెంబేలుపడింది. అక్కడ విపరీతమైన చలి వుంటుందని భయపడింది. నేను ధైర్యం చెప్పాను. 'నీకు మంచి స్వెటర్ తొడిగించాను మరేం ఫరవాలేదు' అని ధైర్యం చెప్పాను.

ఎట్టకేలకు మనాలి నుంచి బస్సు బయల్దేరింది.

ఇప్పుడు మేము బయల్దేరింది రోథాంగ్ పాస్‌కే! అది ఎత్తయిన పర్వతశ్రేణి! పర్వతారోహకులు కనిపిస్తున్నా ఎక్కడ చూసినా



మంచే మంచు!

ఈపాటికే నిద్రలేచిన సూర్యభగవానుడు చల్లటి పర్వతాలమీద తెల్లటి బెడ్‌షీట్లను కప్పి వెచ్చబరచటానికి విఫలయత్నం చేస్తు న్నాడు. ఈ బెడ్‌షీట్లను అందుకోవాలని మెడలు చాస్తూ ఓక్ చెట్లు తాపత్రయపడు తున్నాయి.

బస్సు కొండను చుట్టి పైకి సాగే సుందర దృశ్యాల్ని ప్రేమకు వర్ణించసాగాను. "మిలి టరీ వాళ్ళు ఈ రోడ్డు వేశారు. దీనిపై ఒక బస్సు నిరాటంకంగా నడపటం కష్టమే. ఎదుటినుండి మరో బస్సు వస్తే ఇక దేవుడే గతి. వచ్చినంత వేగంగా రివర్స్ చేస్తారు" అన్నాను.

"ఇలాంటి సుందర వాతావరణంలో ప్రతి ఒక్కరి హృదయం కవితామయమవుతుం దట. ఏదీ ప్రేమా, నువ్వూ ఒక కవిత చెప్పు చూద్దాం" ఆమెను ప్రోత్సహిస్తూ అన్నాను.

"అయ్యబాబోయ్, నాకు కవితలు, గివి తలు రావు" అంది.

"లేదు... లేదు... నువ్వింకా ప్రకృతిలో పూర్తిగా లీనంకాలేదు. నీ హృదయం ప్రకృతి సౌందర్యానికి పూర్తిగా స్పందించటం నేర్చుకుంటే నీలో నీకు తెలీకుండానే కవిత జనిస్తుంది" అన్నాను. ఆమెకు హిమవైభ వాన్ని వివరిస్తూ దానిపై అభిమానాన్ని కలి గించటానికి ప్రయత్నించాను.

దూరాన్న ఓ ఎర్రటి 'స్నో కటర్' దారికి అడ్డుగా వున్న మంచుగడ్డల్ని తొలగిస్తూ వాహనాలకు దారిని సుగమం చేస్తోంది. మేము క్రమంగా హిమావృత ప్రపంచం దిశగా సాగిపోతున్నాం. నాకు ఎప్పుడెప్పుడు హిమప్రపంచపు ఆ చివరి కొనకు చేరి అక్కడి హిమాన్ని చేతితో స్పర్శిస్తానా అని ఎంతో ఉబలాటంగా వుంది.

ప్రేమ నిర్లిప్తంగా కూర్చుని వుంది. నేను పదేపదే ఉత్సాహంగా వర్ణిస్తూండటంవల్ల ఆమె అప్పుడప్పుడు "ఓహో, అలాగా! అవును కదా, ఎంత బావుంది!" అనేది. అంతలోనే యథావిధిగా మారిపోయేది.

ఆసరికి బస్సులోని ప్రయాణీకులంతా నాకు పరిచయమైపోయారు. అందులో చాలామంది టూరిస్టులే! ఒకరిద్దరు విదేశీ యులు కూడా వున్నారు. తమిళనాడునుంచి వచ్చిన ఓ కుటుంబమూ వుంది. కొందరు స్థానికులు కూడా ఉన్నారు.

అందరిలోకి హనీమూన్‌కి వచ్చిన జంట మా ఒక్కరిదే. ఈ సంగతి అక్కడున్నవా రంతా గుర్తించారు. విదేశీజంటలు మమ్మల్ని చూసి గుట్టుగా నవ్వుకోవటం నేను గమనించాను.

'మడి' అనేచోట బస్సుని ఆపేశారు.

"ముందు దారి క్లియర్ కావటానికి ఒకటి రెండు గంటలుపడుతుంది. అంతవరకు మీరంతా కిందికి దిగవచ్చు. చాయ్ తాగాల నుకున్నవాళ్ళు తాగొచ్చు" అంటూ బస్ డ్రైవర్ మొరటు హిందీలో అనౌన్స్ చేశాడు.

నేను బయటికి తొంగిచూశాను. 'చెంబ్లా రెస్టారెంట్' అనే ఒక చిన్న హోటల్ కని పించింది.

"టీ తాగుదాం రా" అన్నాను. ప్రేమ కిందికి దిగింది. యథాలాపంగా వెనుదిరిగి చూసి ఉలిక్కిపడుతూ గాభరాగా చెప్పింది.

"అటు చూడు వివేక్, ఆ వ్యక్తులు ఇంకా మనల్నే ఫాలో అవుతున్నారు. నాగపూర్‌లో, ఢిల్లీలో నన్ను అల్లరిపెట్టిన వాళ్ళు వీళ్ళే కదూ? " అంది.

నేను చప్పున వెనుదిరిగి చూశాను.

అవును, ఆ యువకులే! ఇద్దరిలో లావు పాటి వ్యక్తి మావైపు చూపుతూ రెండో వ్యక్తికి ఏదో చెబుతున్నాడు.

"వాళ్ళూ మనలాగే టూరిస్టులై వుండొ చ్చులే. యాదృచ్ఛికంగా మన బస్సులోనే వచ్చినట్టున్నారు. మనం గమనించలేదు




అంతే!" అంటూ ఆమెను సమాధానపర్చాను.

ఆపాటికే కొందరి టూరిస్టులతో నాకు స్నేహం కలిగింది. 'మడి'లోనే ఒక స్నేహితుడు మాకు టీ తాపించి, తనే డబ్బు చెల్లించాడు. "విష్ యు ఏ హ్యాపీ హనీమూన్" అన్నాడు చిరునవ్వుతో.

తమిళనాడుకు చెందిన దంపతులు ప్రేమకు చాలా దగ్గరయ్యారు. నాగపూర్ నుంచి మా వెనకే వస్తున్న యువకులు దరిదాపుల్లోనే తిరగాడుతుండటం కనిపించింది.

'చెంబ్లా రెస్టారెంట్' యజమానురాలి పేరు విమలా థాకర్. చిన్న కళ్ళ సుందరాంగి! హోటల్‌లో ఆమెతోపాటు వయస్సు మళ్ళిన ఆమె తల్లి కూడా వుంటోంది. అనేక హిమవత్పర్వతాల నడుమ, మంచు ఒడిలో వున్నా ఆ హోటల్ సురక్షితంగానే వుంది. హోటల్‌పై కప్పుమీద పేరుకునే మంచును ఆ ముసలిది అప్పుడప్పుడూ పక్కకు తీసేస్తూ మంచు బరువుకి హోటల్ కప్పు కుంగిపోకుండా చూసుకుంటోంది.

నేను ప్రేమతో అన్నాను "చూడు, ఇక్కడి జీవితం ఎంతటి కష్టనష్టాలతో కూడుకున్నదో! కాస్సేపు ఇలాగే వదిలేస్తే హిమభారానికి హోటల్ మొత్తం కూలిపోతుంది"

ప్రేమ హోటల్ పొయ్యి దగ్గరికిచేరి చేతులు వెచ్చచేసుకోసాగింది. ఆమెకు, విమలాకు మధ్య స్నేహం ఏర్పడింది. అయితే అది కేవలం చేతిసైగలు, నోటి సంజ్ఞల ద్వారా ఏర్పడిందేనని నాకు తెల్సు.

నేను ప్రేమను ఆమె దగ్గరే వదిలి 'కాస్సేపు అలా బయట తిరిగొస్తానని' చెప్పి బయటికి వచ్చాను.

హోటల్ బయట ఒక పెద్ద మట్టి గుట్ట కనపడింది. నాకు ఆ గుట్ట పైకెక్కి కూర్చోవాలనిపించింది. నెమ్మదిగా ఎక్కుతూ గుట్టపైకి చేరుకున్నాను. అక్కడ ఎవరో ఒక జెండా పాతి వుంచారు. దానికి ఆనుకుని కూర్చున్నాను.

గుట్టపైనుండి ప్రకృతి ముగ్ధమనోహరంగా కనిపించింది. నాకు అనువైన వాతావరణం! ఇప్పుడొక మంచి కవిత రాయాలనిపించింది. అయితే జేబులో కాగితం ముక్క లేకపోవటంతో గుట్ట దిగి హోటల్‌కొచ్చాను.

విమలా థాకర్‌ని కాగితం అడిగితే ఆమె తన అకౌంట్‌బుక్‌లోంచి ఒక పేజీ చింపి ఇచ్చింది.

కవితని ఎక్కడ్నించి, ఎలా మొదలెట్టాలనే సంకోచం కలిగింది. దూరాన దెయ్యంలా పడుకునున్న పర్వతశ్రేణి, దానిపై భాగమంతా మంచుదుప్పటి! అక్కడక్కడా మేత మేస్తున్న అడవి గుర్రాలు, మేకలు. వాటిని కాస్తున్న చిన్నారి బాలలు! పర్వతాల అంచు నుండి 'తెల్లటిటేపు'లా జలధార కిందికి ప్రవహిస్తోంది.

మంచు కరిగి నీరై, నీరు ధారై, ధార కాలువై, కాలువ జలపాతమై పరవళ్ళు తొక్కుతూ, ఎగజిమ్ముతూ, నృత్యంచేస్తూ, వినోదం కలిగిస్తూ, వింతవింత మలుపులు గుండా ఆర్భాటంగా పరుగులు పెడుతూ కిందికి దూకుతున్న ఆ చిత్ర విచిత్రాన్ని మనస్ఫూర్తిగా కనుల పండువగా తిలకించాను. ఎటుచూసినా నీరేనీరు!

ఇదే 'బియాస్' నది ముఖద్వారమై వుంటుందనిపించింది. మంచు, వర్షం సమయానుకూల తోడ్పాటునివ్వగా సంవత్సరంలోని అన్ని రుతువుల్లోను నిండుగా ప్రవహించటానికి ఆ జీవనదికి జన్మనిస్తున్న స్త్రీత్వంలాంటి ఆ ముఖద్వారాన్ని చూసి పరవశించిపోయాను.

మరోవైపు ఆ దొంగ సూర్యుడు ఏ శిఖరం చాటునో దాక్కుని దాగుడుమూతలు ఆడుతున్నాడు.

ఇక నా హృదయాంతరాల్లోంచి ఓ కవిత



తీవ్రవేగంతో వెలుపలికి రాబోతోందని గ్రహించి నేను కాగితం విప్పి పెన్ను చేత బట్టి సిద్ధంగా కూర్చున్నాను.

ఊహు, నా పెన్ను కదల్లేదు. చలికి వేళ్ళు కొంకర్లు పోవటంతో అవి నిటారుగా వుండి పోయాయి. ఒక్క అక్షరం ముక్క కూడా రాయలేకపోయాను. ప్రకృతి మొత్తం నన్ను మౌనంగా వెక్కిరించింది.

'ఇంతటి బృహత్తరమైన, అనంతమైన, అపూర్వమైన ప్రకృతి సంపదను నీ రెండక్షరాల్లో పట్టి ఇమడ్చాలని చూస్తున్నావా మూర్ఖుడా!' అని ఎగతాళి చేసినట్టనిపించింది.

నాకు సిగ్గేసింది.

ప్రకృతి ముందు ఓడిపోయినట్టు తలవంచాను.

ఓ ప్రకృతీ!

నువ్వు అనంతానివి!

నువ్వు అపూర్వానివి!

నువ్వు అద్భుతానివి!

నేను అల్పుణ్ణి!

నీ గురించి ఒక్క అక్షరాన్నీ రాయలేని అశక్తుణ్ణి!

నీ అగాధత ముందు నేను నేర్చుకున్న అక్షరాలన్నీ క్షుద్రాలు! నీ గురించి నేనెలా రాయగలను? గంటల తరబడి నీ ముందు కూర్చుని నీ సౌందర్యాన్ని అనుభవించగలను, ఆనందించగలను, కాని నిన్ను వ్యాఖ్యానించలేను.

నిస్పృహతో పర్‌మని కాగితం చింపి ముక్కలు ముక్కలు చేశాను. కాగితపు ముక్కలు చల్లటి గాలిలో తేలుతున్నప్పుడు అవి ప్రకృతి యొక్క చిరునవ్వుల తునకలుగా అనిపించింది.

ఆ తర్వాత గుట్ట దిగి దగ్గర్లో వున్న లోయవేపు పరుగెత్తసాగాను. గుట్టకింద లోయ మధ్యన నించుని దాన్ని మాట్లాడించి దాని ప్రతిధ్వని విని ఆనందించాలనిపించింది. లోయ అడుగు గుట్టకు దగ్గర్లోనే వుంది. పరిగెడుతూ అక్కడికి చేరుకుని రొప్పుతూ లోయ అడుగున నుంచున్నాను.

"ఓ..." అంటూ గట్టిగా అరిచాను. కాని సమాధానం లేదు, ప్రతిధ్వని విన్పించలేదు. ఇంకోసారి మరోసారి అరిచాను. ప్రతిధ్వని జాడే లేదు.

మావేపు వుండే 'కొండలు' గుర్తొచ్చాయి. ఒకసారి పిలిస్తే మూడుసార్లు జవాబిచ్చే ఆ కొండలెక్కడ? హిమాలయపు ఈ నిర్దయ పర్వత శ్రేణులెక్కడ? ఎక్కడలేని నిరాశ ఆవహించింది. మా ఊరి కొండలు, గుట్టలు కరుణామయమైనవి. అయితే హిమాలయాలకు ప్రతి స్పందించే సహృదయత లేదనిపించింది. నిరాశగా తిరిగొచ్చాను.

నేను హోటల్‌కి వచ్చేసరికి విమలా థాకర్, ప్రేమ ఎంతో చనువుగా కబుర్లు చెప్పుకోవటం కనిపించింది. వారి మధ్య మెరిసే కళ్ళ పిల్లవాడొకడు సమోసా తింటూ కూర్చున్నాడు. ప్రేమ చేతిలో ఓ ఇన్‌ల్యాండ్ లెటర్ వుంది. ఆశ్చర్యపోయాను.

"వివేక్, ఇక్కడ నాకో హిమాచల్ స్నేహితురాలు దొరికింది కదా. ఈమె చాలా బుద్ధిమంతురాలు. రోజుకు వెయ్యి రూపాయల వ్యాపారం చేస్తుందట. రాత్రిళ్ళు నిద్రపోవటానికి ఒక్కో మంచానికి పాతిక రూపాయలు వసూలు చేస్తుందిట. ఈ విషయాలన్నీ వివరిస్తూ అత్తకు ఓ ఉత్తరం రాయాలనిపించింది. రాసేశాను" అంది ప్రేమ.

నాకు సంతోషం వేసింది. "రాత్రి జరిగింది కూడా రాశావా?" కవ్వింపుగా అడిగాను.

"ఛీ... పో... నీకు సిగ్గులేదు" అంది.




సిగ్గుతో ఆమె బుగ్గలు ఎరుపెక్కాయి.

ఆమె అలా సిగ్గుపడుతుంటే నేను ఆమెను నగ్నంగా మార్చటం, నా చేతులతో స్నానం చేయించటం, బట్టలు తొడిగించటం, నగలు అలంకరించి కుంకుమ దిద్దటం అంతా సినిమా రీలులా కళ్లముందు తిరిగింది. మళ్ళీ నా హృదయం భావుకతతో కొట్టుకోసాగింది.

అంతలో మా బస్ హారన్ మోగింది. పైకి వెళ్లటానికి దారి క్లియరైనట్టుంది.

"త్వరగా బయలుదేరు" అన్నాను ప్రేమతో. విమలాథాకర్‌కి నమస్కరించి లేచి నించుంది ప్రేమ. మేం బయల్దేరుతుంటే విమల గబగబా మాట్లాడే తన సహజ ధోరణిలో హితబోధ చేసింది.

"అక్కడ చాలా జాగ్రత్తగా వుండాలి సుమా! జనసమూహం నుంచి దూరంగా పోవద్దు. సాయంత్రం మూడు దాటాక ఎట్టి పరిస్థితుల్లో అక్కడ వుండకూడదు. స్నోఫాల్ మొదలైతే మంచులో చిక్కుకుపోయి ప్రాణాలమీదికి తెచ్చుకుంటారు... మొన్న ఏడుగురు టూరిస్టులు అలాగే మంచులో చిక్కుకుని మరణించారు... తిరిగి వెళ్ళేటప్పుడు తప్పనిసరిగా నా హోటల్‌లో ఒక కప్ చాయ్ తాగి వెళ్ళాలి సుమా..."

బస్సు కదిలింది. అది ఎంతటి చీలికలతో కూడిన ఎత్తయిన ప్రదేశమంటే బస్సు ముందరిభాగం ఎల్లప్పుడూ ఊర్ధ్వ ముఖంగానే వుండిపోయింది. మా వీపులు సీట్లకు అతుక్కుపోయాయి. ఎంతో ఆహ్లాదకరమైన స్థితి అది!

నాలో భావసంచలనం చెలరేగింది. అది పాటరూపంలో నానోటి నుంచి బయటికి దూసుకొచ్చింది.

'ఎద నిండి పాడానపుడు నేను... అంటూ పారవశ్యంతో పాడసాగాను. విదేశీ యాత్రికులు నావేపు ఉత్సాహంగా, చూస్తూ చప్పట్లు చరుస్తూ నన్ను ప్రోత్సహించారు.

తమిళ దంపతులు "నువ్వూ ఓ పాట పాడు అమ్మాయీ!" అంటూ ప్రేమను ఒత్తిడి చేశారు. అయితే ఆమె "నాకు పాటలు రావు" అంటూ వినయంగా చెప్పింది.

చుట్టూ రమ్యదృశ్యాల కవాటాలు తెరుచుకుంటూ వుండటంతో అందరి గుండెలూ మౌనంగా గానం చెయ్యసాగాయి. ఎంతటి మధుర గానమది!

మంచును దాటి వచ్చిన చల్లగాలి గిలిగింతలు పెడుతోంది. నేను తన్మయంతో అప్పుడప్పుడు ప్రేమను గిల్లుతున్నాను.

బస్సు వెళ్ళేదారిలో టైర్ల దాడికి మంచు చిక్కని, నల్లటి బురదగా మారుతోంది. ఆ నల్లటి బురదచుట్టూ తెల్లటిమంచు!

ఇంకాస్త పైకి వెళ్ళాక ఎటుచూసినా తెల్లటి తెలుపులో మెరుస్తున్న మంచుపర్వతమే భూమండలమంతా పరుచుకున్న అనుభూతి. పైకి సాగుతున్నకొద్దీ నాలో గర్వం పొంగుతోంది. నేను అన్నిటినీ అధిగమించి పైకి వెళుతున్నాను. నేను 'గెలవబోతున్నాను' అనే ధీమా నా మనసును ఆక్రమించింది.

అయితే ఈ ధీమాతో పాటు విపరీతమైన గుండెనొప్పి, కడుపునొప్పి కూడా నా శరీరాన్ని ఆక్రమించసాగాయి. ఇంతవరకు ఆ సంగతి ప్రేమకు తెలియకుండా దాచాను. నా చెంతవున్న ఆ సౌందర్యరాశిని ఆస్వాదించటానికి ఎన్ని గుండెపోట్లయినా భరించే శక్తి నాలో వుంది. నా అవయవాలన్నీ శక్తి కోల్పోయినా సరే, నేను ధైర్యం కోల్పోకుండా రోథాంగ్‌పాస్ శిఖరాన్ని సందర్శించే వెనుదిరుగుతాను.

మలుపులు తిరుగుతున్న బస్సు అనేక కోణాల్లో ఆ హిమాచ్ఛాదిత పర్వత సోయగాలను చూపిస్తోంది. ఒక్కొక్క మలుపులో

నేను ఒక్కోలా పులకించిపోతూ క్రొంగొత్త సన్నివేశాలకోసం సిద్ధమవుతున్నాను.

## రోథాంగ్ పాస్

నేనొక మంచు పర్వతాన్ని! నాకు మనుషులు పెట్టిన పేరు 'రోథాంగ్ పాస్'. నేను సముద్రమట్టంనుంచి పదునాలుగు వేల అడుగుల ఎత్తులో ఉన్నానట! అది గొప్ప విషయమేం కాదు. ఈ శ్రేణిలో నా బాబు లాంటి పర్వత శ్రేణులు ఎన్నో వున్నాయనుకోండి.

నాపైకి ఎక్కటానికి ఈ క్షుద్ర మానవులు ఏవేవో మార్గాలు కనుక్కున్నారు. మిలిటరీ వాళ్ళయితే నా చివరి అంచును చేరటానికి ఒక రాస్తా కూడా వేశారు.

నాకు ఇవన్నీ నవ్వు తెప్పిస్తాయి. నేను ఒక్కసారి ఒళ్ళు విరుచుకున్నానంటే కీటకాల్లాంటి ఈ మానవులంతా నా హిమగర్భంలో సమాధి అయిపోతారు. అయితే నాకే అల్పుల మీద ఎలాంటి కోపంలేదు. వీరి ఆటల్ని, లీలల్ని చూసి మనసారా నవ్వుకుంటాను.

ఈరోజు వివేక్, ప్రేమ అనే ఇద్దరు అందమైన నవదంపతులు నాపైకి ఎక్కి వచ్చారు. వివేక్ నన్ను పలురకాలుగా వర్ణిస్తూ భార్యకు నా గురించి చెబుతున్నాడు. వీళ్లతోపాటు కొందరు యాత్రికులూ వచ్చారు.

వివిధ ప్రాంతాలనుండి వచ్చిన జనం! రకరకాల భాషలు మాట్లాడేజనం! ఇలాంటి వేలాదిమందిని రోజూ నేను చూస్తూనే వుంటాను!

**వీళ్ళందరికీ** నేను చెప్పదలచుకున్నది **ఒక్కటే!**

నా మీదికి ఎక్కి వచ్చాక మీరు ఆనందంతో మైమరచిపోతారనే సంగతి నాకు తెలుసు.

అందుకే కాబోలు నాపైకి ఎక్కుతున్న సమయంలో నిర్లిప్తంగా, ఉదాసీనంగా వున్న ప్రేమ నాపై పేరుకున్న మంచును చూడగానే ఆనందంతో చిన్నపిల్లలా తన చేతులతో మంచును తాకి పరవశించిపోతోంది.

మీ ఆనందం నాకూ ఆనందమే. అయితే ఈ ఆనందాన్ని 'అతి'గా అనుభవించాలనే దురాశకు మాత్రం లోనుకావద్దు. ఎందుకంటే మీరు మానవులు. 'ఆశ' మీకున్న దుర్గుణం. దొరికిన కొద్దీ కావాలంటారు. నా దగ్గరికొచ్చారు కదా, కాస్సేపు ఆనందించండి. కాస్సేపంటే కాస్సేపే సుమా... కేవలం కాస్సేపు! చాలా సేపు ఇక్కడే వుంటే నామీది అతి శీతల పవనాలు మీ రక్తాన్ని గడ్డ కట్టిస్తాయి. మనుషుల సంతోషాన్ని ఎంతోసేపు ఆనందంగా చూస్తూ కూర్చునేంతటి ఉదారస్వభావిని కాను నేను. నాలో ఓపిక నశించగానే నా ఉగ్రరూపం బహిర్గతమవుతుంది. నా ప్రచండ స్వరూపం బయటపడుతుంది. హిమపాతం మొదలవుతుంది. చూస్తుండగానే మంచు కురుస్తూ ఏడెనిమిది అడుగుల ఎత్తుకు గుట్టగా పేరుకుంటుంది. ఆ హిమగర్భంలో మీరు చిక్కుకుని ఊపిరాడక, రక్తం గడ్డకట్టి దారుణంగా చచ్చి ఊరుకుంటారు. మీరు ఇక్కడ చచ్చిపోతే మీ మరణవార్త గానీ, మీరు మరణించిన చోటు వివరాలుగానీ మీ మృతదేహం గానీ మీ ఊరుచేరే అవకాశాలు తక్కువే!

అదిగో, అక్కడ చూడండి- ఓ అడవి గుర్రం మంచు రాశిలో చిక్కుకుని ఎలా సజీవ సమాధి అయ్యిందో! అది తన కనుగుడ్లు అటూ ఇటూ తిప్పుతూ సహాయం కోసం అర్థిస్తోంది. ఉహు... నేనేమీ చెయ్యలేను. పచ్చగడ్డి మీది ఆశతో ఆ గుర్రం ఇంతదూరం ఎందుకు రావాలి?

ఈ **జీపు ఎవరిదో తెలుసా?** రాజీవ్ సక్సేనా **అనే పోలీసు ఇన్‌స్పెక్టరుది.** అతను




మనాలి సబ్-ఇన్‌స్పెక్టర్. ఇక్కడి పర్వతాలపై తరచూ యాత్రికుల మరణాలు సంభవిస్తున్నాయని హిమాచల్ ప్రదేశ్ ప్రభుత్వం ప్రత్యేకంగా అతన్ని నియమించింది. ఉదయంనుండి సాయంత్రం దాకా జీపు వేసుకుని ఈ ప్రాంతాలన్నీ తెగ తిరుగుతూ వుంటాడు. దర్యాప్తు పేరిట యాత్రికుల్ని వేధించుకు తింటాడు. మొన్నటికి మొన్న ఏడుగురు విదేశీ యాత్రికులు ఇక్కడ మరణించలేదా? అప్పుడు ఈ పెద్ద మనిషి సక్సేనా ఏం అఘోరించాడనీ...

నాకతన్ని చూస్తే నవ్వొస్తుంది. నేను వేలాది ఏళ్లనుంచి ఇక్కడే వున్నాను. నిన్నా మొన్నటి ఈ కుర్రాడు సక్సేనా ఇక్కడ మరణించినవారి గురించి దర్యాప్తు చేస్తాడట. నా దగ్గరున్న మృతుల పట్టిక గురించి అతనికేం తెలుసు? ఇక్కడికి ఎవరెవరొచ్చారు? ఎలా వచ్చారు? ఎలా చచ్చారు? ఎలా కాలు జారింది? ఎలా మంచులో కూరుకుపోయారు? ఈ రహస్యాలన్నీ నా గుండె గుప్పిట్లో భద్రంగా వున్నాయి. అయినా అవన్నీ నన్నడిగే దమ్ము ఆ సక్సేనాకు ఎక్కడిది. ఆ ఇనస్పెక్టర్ మితిమీరిన ఉత్సాహంతో విచారణలు జరుపుతున్నాడు... నిజానికి అతను ఇక్కడి యాత్రికుల్ని అకారణంగా వేధిస్తున్నాడు. చిన్నచిన్న దుర్ఘటనకి కూడా ఏడెనిమిది పేజీల రిపోర్టు రాసుకుంటున్నాడు. నిర్దోషుల్ని పట్టుకుని నేరస్థులంటూ సతాయిస్తున్నాడు.

ఒరే సక్సేనా... నా దగ్గరికి వచ్చి అడుగు. చెబుతాను. నా గర్భంలో మరణించిన అభాగ్యుల బాధాకర నిట్టూర్పులు నీకిక్కడ వినిపిస్తాయి. వారి హృదయవిదారక రోదనలు నాలో నిక్షిప్తమై వున్నాయి. నాలో సజీవ సమాధి అయిన ఆ సాక్షుల కథలు వింటే దిగ్భ్రాంతితో తల్లడిల్లిపోతావ్. నన్ను తక్కువగా అంచనా వేయకు సుమా!

అక్కడ చూడు. ఆ పోకిరీ కుర్రాళ్ళిద్దరు ఎక్కడ్నించి వచ్చారో? వచ్చినప్పట్నించి ఆ సుందరాంగి ప్రేమనే వెంటాడుతున్నారు. ఆమె అద్భుత సౌందర్యం వాళ్ళని పిచ్చెక్కించి వుండాలి. అరెరె... వాళ్ళామెను ఏదేదో కామెంట్ చేస్తున్నట్టున్నారు. అదిగో వాళ్ళ మీదికి వివేక్ పోట్లాటకు సిద్ధమవుతున్నాడు. మిగతా యాత్రికులు ఆ పోకిరీ వెధవల్ని చెడామడా తిట్టిపోస్తున్నారు. ఆ తమిళుడు తమిళంలోనే తిడుతున్నాడు. సహ యాత్రికులపై ఎంతటి అభిమానం! ఎంతటి సహకార భావం? ఇలాంటి కోతి మూకల బారినుండి అబలలకు రక్షణ ఇవ్వకుండా నువ్వు ఏం దర్యాప్తు చేయటానికి ఇక్కడికొచ్చావ్ మిస్టర్ కుర్ర సక్సేనా...?

ఇవాళ యాత్రికుల సంఖ్య తక్కువే. నా గుండెలపై కదులుతున్న యాత్రికులు మహా అయితే నలభైమంది వుంటారేమో...

ఓ నిజం చెప్పనా...? ఇక్కడున్న వాళ్ళల్లో... ఆమాటకొస్తే ఇంతవరకు ఇక్కడికొచ్చిన వారిలో ప్రేమవంటి అందాలరాశిని నేను ఎప్పుడూ చూడలేదు. నాకే ఆమె పట్ల ఆకర్షణ జనిస్తుంటే వయసు పొంగులోనున్న ఆ కుర్రాళ్ళు ఆమె వెంటబడ్డంలో విశేషమేముంది? ఈ అందాలరాశిని నాలోనే దాచుకుని వివేక్‌ని ఒట్టి చేతులతో ఇంటికి పంపనా...? ఛీ... ఛీ... వద్దు... నేను మనిషిలా స్వార్థిని కాలేను. పాపం, ఆ వివేక్‌ని చూస్తే జాలేస్తోంది. అతనేదో దాస్తున్నట్టున్నాడు. అతనిలో ఏదో బాధ వుంది. ఓసారి పొట్టనూ, మరోసారి గుండెను చేత్తో అదుముకుంటున్నాడు. ఇలాంటి బాధలు, భయాల మధ్యకూడా అతనికి రోథాంగ్‌పాస్ చూడాలనే తపన...! నా సౌందర్యాన్ని, గొప్పతనాన్ని వర్ణించి చెప్పాలనే ఉత్సాహం!

అరే! అందరినీ వదిలి వాళ్ళిద్దరూ దక్షి





ణంగా నడుస్తున్నారు... దక్షిణపు చివరి అంచున నా సౌందర్య సీమ సరిహద్దును చేరుతుందని ఈ వివేక్‌కి తెలుసు. గతంలో అతను నా చెంతకి వచ్చిన వారి 'పట్టిక'లో వున్నాడు మరి.

వాళ్ళిద్దరూ లోయ అంచున నుంచు న్నారు. బహుశా సూర్యుడ్ని వెతుకుతున్న ట్టున్నారు. అయితే ఆ చిలిపి సూర్యుడు నా తెల్లటి పైట చాటున దాగిన రసికుడని వీరి కెలా తెలుస్తుంది? వివేక్ తూరుపు దిశగా చేయి చాపి ఏదో చెబుతున్నాడు. అతని ముందు ప్రేమ నుంచుని వుంది. ప్రేమ కూడా తన్మయంగా దూరాన చూస్తోంది. చాలాదూరంలో ఆమె దృష్టి కేంద్రీకృత మైంది. అరెరె... ప్రేమ కొంచెం వెనక నుంచోకూడదా... నాలో ఆందోళన కలి గింది. ఆమె వెనకే నించున్న ఈ వివేక్‌క





యినా బుద్ధి వుండాలి. అందులోనూ అక్కడ వాళ్ళిద్దరు తప్ప మరెవ్వరూ లేదు.

కోరికలు తీవ్రమై ఎల్లలు దాటినప్పుడు ప్రాణాలకు విలువ లేదేమో!

ఎంతసేపు నా సొగసును చూడటం? ప్రేమ నా సొగసును చూస్తుంటే, నేను ఆమె అందాన్ని తిలకిస్తున్నాను ఈ వివేక్‌కి తెలియకుండా.

దేవుడు తీరిగ్గా కూర్చుని తీర్చిదిద్దిన ఆ కుందనపు బొమ్మని నేను రెప్పవాల్చకుండా తదేకంగా చూస్తున్నాను.

ఆహా... ఏమి రూపం! దేశవిదేశాలనుండి ఎందరో అందగత్తెలు నన్ను దర్శించారు. లేదు... వాళ్ళలో ఎవరూ ఈ అప్సరసకి సరితూగరు. నా మంచువస్త్రంలా ఆమె ముఖంలో నిర్మలమైన చిరునవ్వు. పాల వంటి చర్మం. ఒంటినిండా ధగధగమెరిసే నగలు! ఇంతటి సౌందర్యరాశిని పెళ్ళాడిన వివేక్ ఎంతటి అదృష్టవంతుడు. ఇద్దరిదీ

బహుచక్కటి జంట! అపురూపమైన జోడీ...

అయ్యో... ఘోరం... దారుణం...

జరగరానిది జరిగిపోయింది...

ప్రేమ కాలు జారింది...

నా అగాధమైన మంచు లోయలోకి చేరిపోయింది...

వివేక్ హాహాకారాలు మిన్నుముట్టాయి.

జనం కంగారుగా అక్కడ గుమిగూడసాగారు.

'ప్రేమా... ప్రేమా...' అనే కేకలు తప్ప వివేక్ నోటివెంబడి మరోమాట రావటం లేదు.

నేను ప్రేమను కబళించాలని నిజంగా ఆశించలేదు. ఆమెను ఆరాధించే భర్తనుండి దూరం చేయాలనే క్రూరబుద్ధి నాకులేదు. అయితే తనంతట తనేవచ్చి నా లోయల్లో పడి ప్రాణాలు పోగొట్టుకున్న అమాయకుల్ని నేనెలా రక్షించగలను?

రా... ప్రేమా... నాలో ఐక్యమైపో... పిలవకుండానే వచ్చావు. నీకు స్వాగతం!

హనీమూన్ తియ్యటి అనుభవాల్ని మోసుకుని నీ మెట్టినింటికి వెళ్ళి అత్తమామలకు ఇష్టమైన కోడలివై, భర్తకు ప్రియమైన భార్యవై ముత్యాల్లాంటి పిల్లల్ని కని సుఖశాంతులతో వర్ధిల్లాల్సిన దానివి.

ఇంతదూరం వచ్చి ఈ మంచులోయలో పడి క్షణాల్లో శవంగా మారిపోయావే తల్లీ...

లోయల్ని చూసేటప్పుడు లోయ అంచుల్లో నిలవకూడదని నీకు తెలియదు పాపం. గట్టిగా గాలి వీచినా కాలు జారిపడిపోయే ప్రమాదకర స్థలానికి నిన్నెందుకు తీసుకెళ్ళాడు ఈ పిచ్చి వివేక్? కాలు

జారినా లోయలోకి పడుతున్నప్పుడేనా చప్పున నీ వివేక్‌ని పట్టుకుని కౌగలించుకో లేక పోయావా?... అలా ఇద్దరూ అమర ప్రేమికులై నా ఒడిలో సేద తీరేవారు. ఇప్పుడు చూడు, నువ్వు ఒక్కదానివే నా లోయలో శాశ్వతంగా నిద్రపోతున్నావు. ఇక్కడ నీ వివేక్ హృదయవిదారక రోదన నావంటి మంచు పర్వతాన్ని సైతం కరిగి స్తోంది. అతని రోదనను ఆవేదననూ నేనెలా భరించగలను?

నాకు తెలుసు!

ఈ రాజీవ్‌సక్సేనా ఇలాంటి దుర్ఘటనల కోసమే కాచుక్కూర్చున్నాడని నాకు బాగా తెలుసు. ప్రమాద సమాచారం అందిన వెంటనే అతను హుటాహుటీన జీపులో వచ్చేశాడు.

యాత్రికులంతా హాహాకారాలు చేస్తు న్నారు. పాపం! కొద్ది గంటలక్రితం వరకు తమతో ఆత్మీయంగా మాట్లాడిన వ్యక్తి ఇక శాశ్వతంగా మాట్లాడదని తెలుసుకుని బాధతో విలవిల్లాడుతున్నారు. తమిళ స్త్రీ వెక్కి వెక్కి ఏడుస్తోంది. అప్పటిదాకా ప్రేమ వెంటబడి అల్లరిచేసిన కుర్రాళ్ళిద్దరూ తెల్ల బోయి భయంతో వణుకుతున్నారు. వివేక్ ఆకాశంకేసి ముఖం పెట్టి భోరున విలపిస్తు న్నాడు.

సక్సేనా అందరినీ పక్కకి తోసేసి గబ గబా వివేక్‌ని సమీపించాడు తమిళవ్యక్తి ముందుకు వచ్చి అంతా వివరంగా చెప్పాడు.

"మేమంతా ఒకే బస్‌లో ఇక్కడికి వచ్చాం సార్, పాపం వాళ్ళిద్దరూ హనీమూన్‌కొ చ్చారు. కాస్సేపటిముందు వరకు మేమంతా కలిసే వున్నాం. ఈ వివేక్ ప్రకృతి సౌంద ర్యారాధకుడు. భార్యను దగ్గర్నుంచి లోయ అందచందాలు చూపాలనే ఉద్దేశంతో లోయ అంచుకు తీసుకెళ్లాడు. మేమంతా ఈపక్క చూస్తున్నాం. అంతలో వివేక్ కేకలు మాకు విన్పించాయి..."

రాజీవ్ సక్సేనా చాలా మొరటుమనిషి. హనీమూన్‌లో భార్యను పోగొట్టుకుని పిచ్చి వాడిలా మారి దఃఖిస్తున్న వివేక్‌ని రకర కాల ప్రశ్నలతో వేధించసాగాడు. సక్సేనా ధోరణి నచ్చక యాత్రికులంతా మూకుమ్మ డిగా అతని ప్రవర్తనని విమర్శించారు. ఓ విదేశీ యాత్రికురాలు సక్సేనాని దులిపే సింది.

"మీ ఇండియన్ పోలీసులే ఇంత! హృద యమే లేని మనుషులు మీరు. లోయ లోంచి డెడ్‌బాడీని బయటికి తీయించే ప్రయత్నం చేయక బాధతో కుమిలిపోతున్న ఆ వ్యక్తిని సూటిపోటి ప్రశ్నలతో చంపేస్తు న్నారు. ఛీ...ఛీ.. మీరూ మనుషులేనా?"

అయితే రాజీవ్ సక్సేనా చాలా మంద పాటి చర్మం కలిగిన పోలీస్ అధికారి. ఆ ఫారినర్ మాటలకు ఆయన చలించలేదు.

"మీకేం తెలుసు మేడమ్? ఇక్కడ ఇలాంటి హత్యలు నేను వందలు చూశాను. వరకట్నం కోసం పెళ్ళి చేసుకుంటారు. డబ్బు చేతికి వచ్చాక భార్యను హనీమూన్ నెపంతో ఇక్కడికి తెచ్చి లోయలోకి నెట్టేసి చంపేస్తారు. మళ్లీ తమ ఊరికి వెళ్ళి మరో పెళ్ళి చేసుకుంటారు. నా దర్యాప్తు పూర్తయ్యే వరకు ఈ వ్యక్తిని అంత సుల భంగా వదిలిపెట్టను" అన్నాడు కటువుగా.

ఛీ! ఒరే సక్సేనా... మంచుకొండ అయిన నాకే దుఃఖం కలుగుతుంటే మనిషివైన నువ్వు దర్యాప్తు, చట్టమూ అంటూ ఎంత నిర్దయగా మాట్లాడుతున్నావ్. పాపం! వివేక్ స్పృహ కోల్పోయే స్థితిలో వున్నాడు. బాధతో వణికిపోతున్నాడు. ప్రేమను అల్లరి చేసిన ఆ రౌడీ కుర్రాళ్ళు సైతం అతన్ని ఓదారుస్తున్నారు. నాకేగనక సాధ్యమైవుంటే ఆ అభాగ్యుణ్ణి నా ఒడిలో పడుకోబెట్టుకుని




ఓదార్చేవాణ్ణి! ఇప్పుడు నేనేం చేయను? నేను మాటలు రాని ఓ మూగ హిమపర్వతాన్ని కదా!

దగ్గర్లో గల స్నో కట్టర్ వద్ద లోయలోకి దిగే సామర్థ్యం గల ఇద్దరు మనుషులున్నారు. సక్సేనా వాళ్ళకు కబురంపించాడు. తాడు, పారలాంటి పరికరాలు తీసుకుని వాళ్ళిద్దరు లోయ అంచు ధగ్గరికి చేరుకున్నారు. అయితే వాళ్ళు లోయలోకి దిగేటప్పుడు నేను విషాదంగా నవ్వుకున్నాను.

పాపం పిచ్చివాళ్ళు! నాలోకి జారిపడ్డవారు బతికి బట్టకట్టడం కల్ల. ప్రాణం పోయిన శరీరాన్ని తీసుకు రావటానికి ఇంత ఆర్భాటమెందుకు?

శవాన్ని పైకి తీసుకురావటానికి రెండు గంటలు పైగా పట్టింది. అప్పటివరకూ సక్సేనా ప్రశ్నలవర్షం కురిపిస్తూనే వున్నాడు. ఇరవై ముప్పై ప్రశ్నల్ని ఏకధాటిగా అడిగాడు. అక్కడ వున్న యాత్రికుల్నే పంచాయితీదారులుగా చేసి విచారణ చేస్తున్నాడు.

"నిజం చెప్పండి... లేదా మీరంతా కలిసి ఆమెను మర్డర్ చేశారనే పాయింటు మీద అందర్నీ లోపలకి తోసేస్తాను. జాగ్రత్త" అంటూ క్రూరంగా భయపెట్టాడు.

కొందరు అతనికి భయపడకుండా చూసింది చూసినట్టు చెప్పారు.

"చూడండి, ఇనస్పెక్టర్‌గారూ! నేను తమిళనాడు సెక్రటేరియట్‌లో పనిచేసే ఆఫీసర్ని. నాకు అబద్ధం చెప్పే అలవాటు లేదు. ఆ అవసరమూ లేదు. వాళ్ళిద్దరూ డబ్బున్న కుటుంబాలకు చెందినవాళ్ళు. మీరు చెప్పినట్టు అతను వరకట్నంకి ఆశపడేవాడయితే భార్య ఒంటిమీద అన్ని నగలు వుండగా లోయలోకి ఎందుకు తోసేస్తాడు? మీరు మరీ అతిగా అనుమానిస్తున్నారు. అనుమానించటానికీ ఓ హద్దు వుంటుంది"

"సక్సేనాగారూ ఈ భార్యాభర్తలిద్దరిదీ ఎంతో అన్యోన్యమైన జంట. పైగా అతను కవి. దారి పొడుగునా కవితలు రాస్తూ, పాటలు పాడుతూ ఉల్లాసంగా గడిపాడు. వాళ్ళు ఒకర్నొకరు ఒక్క క్షణం వదిలి వుండలేరు. బాధలో వున్నవారిని ఓదార్చటం మీ మొదటి కర్తవ్యం. అది మానేసి ఈ విషాద సమయంలో అమానుషంగా ప్రవర్తించటం సబబు కాదు"

"మీరు ఇలాంటి విచారణలు జరపటం మానెయ్యండి సార్. దీనివల్ల రాష్ట్రపతి పురస్కారం లభిస్తుందని సంబరపడుతున్నట్టున్నారు. ఇక్కడి అమాయక టూరిస్టుల్ని వేధించే బదులు ఇక్కడి లోయల్లో ఓక్ కట్టెల్ని, దొంగ రవాణా చేస్తున్న దొంగల్ని పట్టుకోండి, పోండి..."

కాని, సక్సేనా ఎవరి మాటల్నీ ఖాతరు చెయ్యలేదు. వారి మధ్య జరుగుతున్న చర్చలన్నీ నేను జాగ్రత్తగా గమనిస్తున్నాను.

అంతలో ప్రేమ శవాన్ని పైకి తెచ్చారు. ప్రభుత్వ డాక్టర్ కోసం వెళ్ళిన సక్సేనా జీపు ఇంకా తిరిగి రాలేదు. ప్రేమ మృతదేహాన్ని పైకి తెచ్చినవారు సక్సేనాతో అన్నారు- "శవం చాలా లోతుకు పళ్ళేదు సార్, నాలుగువందల అడుగుల లోతులోని ఓ పొదలో చిక్కుకుని వేలాడుతోంది. అందుకే శవాన్ని త్వరగా పైకి తీసుకురాగలిగాం"

ప్రేమ శరీరాన్ని చూస్తే ఆమె ప్రశాంతంగా నిద్రపోతున్న భంగిమలో వుంది. రక్తపు ముగ్గుల లేపనంతో ముఖసౌందర్యమంతా భయానకంగా మారిపోయింది. తలలో గుచ్చిన హెయిర్ పిన్ ఊడిపోయి జుత్తు చెల్లాచెదురైపోయింది. ఆమె ధరించిన ఖరీదైన నగలు ఊడిపోయి, కొన్ని ఇంకా శరీరం మీద వేలాడుతున్నాయి. చీర చిరిగిపోయింది. పూలవంటి నాజూకు పాదాలు ఏ బండకు తగిలాయోగాని ఎక్కడికక్కడ చీరుకుపోయి గాయాల్లోంచి రక్తం



బొట్లు బొట్లుగా కారుతోంది. ఎర్రటి ఎరుపు చారలు సుకుమారదేహంపై ఎక్కడ పడితే అక్కడ దర్శనమిస్తున్నాయి. ప్రాణం పోయే ముందు ఆమె నరకయాతన అనుభవించిం దనటానికి సూచనగా ఆమె ముఖంలో భయం, బాధతో మిళితమైన భావం స్టిల్ ఫొటోలా ముద్రించబడింది. ఒక కాలికి జోడు వుంది. మరో కాలిజోడు ఎక్కడో పడిపోయినట్టుంది.

డబ్బు, ఐశ్వర్యం, అగరొత్తుల ఫ్యాక్టరీ, సుశీలామహల్, వివేక్ ట్రేడర్స్ అన్నిటినీ మరచిపోయి, నా గుండె గూటిలో శాశ్వ తంగా, నిశ్చింతగా నిద్రిస్తోంది.

భార్య శవాన్ని చూడగానే వివేక్ ఆవే శంగా ఆ వైపు దూసుకు వెళ్ళబోయాడు. అయితే సక్సేనా అతన్ని వెళ్లనిస్తేకదా. తన పరిశీలన ముగిసేవరకు ఎవరూ శవాన్ని సమీపించకూడదన్నాడు.

అతని దర్యాప్తు జుగుప్సతోపాటు నవ్వు తెప్పించేలా విచిత్రంగా వుంది. మరణిం చింది ఎవరు? వయస్సెంత? ఏ ఊరు? శవాన్ని ముందుగా ఎవరు, ఎక్కడ, ఎప్పుడు ఎలా చూశారు? శవంతోపాటు దొరికిన వస్తువులు ఎవరివి? చావుకి కారణమే మిటి? మరణం ప్రభుత్వ స్థలంలోనే జరి గిందా? సాక్షులెవరు? వారి కథనమేమిటి? ఎవరు అనుమానితులు? ...

ఇలా సాగిన అతని శవపంచనామా తతంగం నాకు హాస్యాస్పదంగా అనిపిం చింది.

పోస్టుమార్టం నిమిత్తం అక్కడికి డాక్టర్‌ని పిలిపించే ఏర్పాట్లు చేశాడు. అతను ఉద్యో గంలో కొత్తగా చేరినట్టున్నాడు. అందుకే అత్యుత్సాహంతో నానా హంగామా చేస్తు న్నాడు.

గోళ్లరంగు పరీక్ష జరపాలి. విషప్ర యోగం జరిగివుండొచ్చు... ఒకేజోడు ఎందుకుంది? వివేక్‌ను పరీక్షించాలి. అతని షర్టు విప్పి ఎదమీద గోళ్ళతో రక్కిన గుర్తు లున్నాయేమోనని పరీక్షించాడు. ఏమేమో రాసుకున్నాడు. పెనుగులాట జరిగిందా? వివేక్ ఉద్దేశపూర్వకంగా తోసేశాడా? ఆమె జుత్తు పట్టుకులాగాడా? గొంతు నులిమిచం పాక తోసేశాడా?

అబ్బబ్బా! ఈ ఇనస్పెక్టర్ అడుగుతున్న ప్రశ్నలు ఎంత తమాషాగా వున్నాయో చూశారా? సుదూరప్రాంతంనుండి భార్యను హనీమూన్‌కి తీసుకొచ్చి నావంటి అద్భుత హిమపర్వతాన్ని చూపించాలని ఉబలాట బడ్డ ప్రేమపిపాసిని, సౌందర్యారాధకుణ్ణి పత్నీ హంతకుడిగా చిత్రిస్తున్నాడు. మిస్టర్ సక్సేనా, నీకిది తగదు. నువ్వు ఓడిపోతావు. నీ అంచనాలన్నీ తలకిందులవుతాయి. నీవు చేసిన పంచనామా, జరుపబోయే పోస్ట్ మార్టం రిపోర్టు అంతా కాల్చిపారేయ్. వివే క్‌కి సోదరునిలాంటి వాడివి అతన్ని ఓదార్చి ఊరికి పంపించెయ్. నిజమైన రక్షకభటు నిగా నువ్వు చెయ్యగలిగిన పని అదొక్కటే. అది వదిలేసి బాధతో కుమిలిపోతున్న ఆ అభాగ్యుణ్ణి 'షర్టు విప్పు, నోరు తెరిచి పళ్లు చూపు, గోర్లు చూపు' అంటూ వేధిస్తున్నావు. నువ్వు రక్షక భటుడివా? భక్షక భటు డివా? వివేక్ ఎంతటి ఐశ్వర్యవంతుడో నీకు తెలుసా? నీకు లంచం కావాలంటే అడుగు. తన యావదాస్తీ నీకు ధారాదత్తం చేయగల ఉదాత్తుడు అతను. అలాంటి ఉత్తమ వ్యక్తిమీద హత్యా నేరాన్ని మోపుతు న్నావు. నీకన్నా కఠిన హృదయులెవరుం టారు? నేను హిమవత్పర్వతాన్నైనా, ఆ అభాగ్యుడి దీనావస్థకి కరిగి కన్నీరవుతు న్నాను. శోకాగ్నిలో మరిగిపోతున్నాను. మనిషివైన నీకు హృదయం లేదా?

సక్సేనా అక్కడున్నవారందరి వాంగ్మూ లాలు తీసుకుని వాటిపై వారందరిచేత సంతకాలు పెట్టించుకున్నాడు.





చలి మొదలయింది.

యాత్రికులు నాతో ఎంతసేపు వుండగలరు? తమతమ గమ్యాలు వారికి గుర్తొచ్చాయి. అందరూ రకరకాలుగా వివేక్‌ని ఓదార్చి వెళ్ళిపోయారు. మనిషికి తన క్షేమంముందు మిగతా విషయాలన్నీ క్షుద్రంగానే కనిపిస్తాయి. సక్సేనా అనే పెద్ద పులి నోటికి అమాయక కుందేలు పిల్లవంటి వివేక్‌ని అప్పగించి వాళ్ళంతా నిర్దయగా తమదారి తాము చూసుకున్నారు.

ఈ సక్సేనా పట్టువదలని విక్రమార్కుని వంటివాడు. డాక్టర్‌ని అక్కడికే పిలిపించాడు. ఓ పొదచాటున తెల్లటి వస్త్రాన్ని అడ్డుగా కట్టి పోస్టుమార్టం ప్రారంభించాడు. వివేక్ మాటలు పడిపోయినవాడిలా ఓచోట ఉదాసీనంగా కూర్చుండిపోయాడు. ఎముకల్ని కొరికే చల్లటి గాలికి సైతం అతను చలించటంలేదు. గతరాత్రి తన శరీరంలో శరీరమైన తనతో కలిసి ఆడి, పాడి స్వర్గానుభూతినిచ్చిన భార్య ఇప్పుడు ఎవరో ఇనస్పెక్టర్, డాక్టర్ల వాతబడి ఖండఖండాలుగా తన అస్తిత్వాన్ని కోల్పోతోందని గ్రహించి దుఃఖించసాగాడు. ప్రేమ నాజూకు శరీరాన్ని కోస్తున్న చప్పుళ్ళు వింటుంటే అతనికి తన గుండెను కోస్తున్న భావన కలిగించివుండాలి.

డాక్టర్‌కి అసిస్టెంట్లుగా వున్నవారు "ప్రేవులు, లివర్ కూడా తియ్యమంటారా సార్?" అని ప్రశ్నించటం వివేక్ చెవినపడగానే అతని మానసిక స్థితి అతలాకుతలమై పోవటం నేను గ్రహించాను.

'ఛీ... రాక్షసులు!' అనుకుని బాధగా నిట్టూర్చాను.

'తల పగలగొడదాం', 'గుండెను కొయ్యండి', 'బ్రెయిన్ పక్కకి తీసి పెట్టండి' అంటూ డాక్టర్ల బృందం సహజ ధోరణిలో మాట్లాడుకుంటున్నారు.

"ఇంటర్నల్ బ్లీడింగ్ అయింది. స్పాంజి కావాలి" అంటున్నాడు డాక్టర్.

ఆ మాటలు విని సక్సేనా తన సహజ మొరటుమాటల్లో కానిస్టేబుల్‌ని ఆదేశించాడు- "వెళ్ళి ఆ టూరిస్టు బస్సులోని సీట్లను కోసి స్పాంజి తీసుకురా"

కానిస్టేబుల్ అతను చెప్పినట్టే చేశాడు. ప్రేమ శరీరంలోపలి నుండి రక్తం ఆగకుండా కారిపోతోంది. స్పాంజితో రక్తాన్ని పీల్చి పిండసాగాడు డాక్టర్.

అనాధగా పడివున్న శవాన్ని వాళ్ళు ఇష్టమొచ్చినట్టు కోయడం చూసి నేను కుతకుత ఉడికిపోయాను. మార్చురీకి తీసుకెళ్ళకుండా ప్రకృతిలో, అదీ నా గుండె మైదానంలోనే వీళ్లు పోస్టుమార్టం నిర్వహిస్తుండటం చూసి నాకు అసహ్యం వేసింది.

అయినా నేను ఫలితం కోసం ఎదురు చూడాలనే నిర్ణయించుకున్నాను. ఇంత హంగామా చేసి శ్రమపడి, పరిశోధించి, ఆ సక్సేనా కనుక్కోబోయే పరమసత్యం ఏమిటో తెలుసుకుంటాను.

## నాయకుడు

ఈమే నా... నా ప్రేమ!

ఒళ్ళంతా ఇష్టమొచ్చినట్టు కోసి మళ్ళీ కుట్టి నా ముందు తెచ్చివుంచారు.

ఈమెతో నా అనుబంధం ఎన్నెన్ని జన్మలది. కలిశాం, ఎదురుచూశాం, కోపగించుకున్నాం, మళ్ళీ ఒకటయ్యాం, పెళ్ళి చేసుకున్నాం. ఎన్నెన్నో చేశాం. ఇంత దూరం వచ్చి హఠాత్తుగా, శాశ్వతంగా విడిపోయాం. నా ప్రేమ ఇప్పుడు మృత్యువు వాతబడి నా ముందు అనాధశవంగా పడివుంది.

ఈ సక్సేనాకి డబ్బు పిచ్చి వున్నట్టుంది. పోస్టుమార్టం జరిపించాడు. ఫోరెన్సిక్ పరీక్షలు చేయిస్తాడట. అతనికి ఇష్టమైనన్ని దర్యాప్తులు చెయ్యనీ. అంతా చేసి ఇతను

నా భార్యను సజీవంగా మార్చి నాకు అప్ప గించగలడా?

శవంతోపాటు నన్ను తన జీపులో ఎక్కించుకుని మనాలికి తీసుకెళ్ళాడు సక్సేనా.

"ఇక్కడ్నించి శవాన్ని మీ ఊరికి తీసుకెళ్ళ వద్దు. నాలుగురోజుల ప్రయాణం. ఆలోగా శవం కుళ్ళిపోయి వాసన కొడుతుంది" అన్నాడు.

అదేరోజు అర్ధరాత్రి మా నాన్నకు అర్జెంటు ఫోన్‌కాల్ బుక్ చేశాడు. నేను వొణికే చేతులతో రిసీవర్ పట్టుకుని, వణికే స్వరంతో నాన్నగారికి జరిగిందంతా వివరించాను.

నాన్నగారు ప్రేమ మరణవార్త విని దిగ్భ్రాంతి చెందారు. కాస్సేపటివరకు ఆయన మాట్లాడలేకపోయారు.

"నువ్వెలా వున్నావు బాబు" అతికష్టం మీద గొంతు పెగుల్చుకుని అడిగారు.

చివరికి ధైర్యం, బాధ కలగలసిన స్వరంతో గంభీరంగా అన్నారు-

"శవాన్ని అక్కడే దహనం చేసి రా... ధైర్యంగా రా... నీవొక్కడివైనా క్షేమంగా తిరిగిరా..."

నాన్నగారి మాటల్ని సక్సేనాకి వివరించాను. మరుసటిరోజు మనాలి శ్మశానంలో నా ప్రేమ చితిలో కాలిపోయింది.

భగభగమంటూ మంటలు ఎగసిపడుతున్నప్పుడు నా ముఖంపై విషాదపూరితమైన నవ్వు జీవం పోసుకుంది.

అయ్యో, ఈ పాడుజీవితం ఎంత చిన్నది. ప్రేమ విషయంలో మరీ కుదించుకుపోయింది. ప్రేమ 'ప్రేమ మహల్'ని చూడాలనుకుంది. ఆమెకు షాపు, ఆస్తి, అగరొత్తుల ఫ్యాక్టరీ ఇవన్నిటినీ నిర్వహించాలనే వ్యామోహాలుండేవి. వాటన్నిటినీ, అందరినీ హఠాత్తుగా వదిలేసి చల్లగా వెళ్ళిపోయింది. ఇన్నేళ్ళు నేను ఆమె ఆరాధనలో, ఆమె నిరీక్షణలో గడిపాను. ఈ సుదీర్ఘకాలంలోని ఒక్కో ఘడియ నా జీవితంలో మరపురానివి.

ఇప్పుడామె వెళ్ళిపోయింది. నన్ను దూరానవున్న మనాలిలో ఒంటరిగా వదిలేసి ఒక్కతే వెళ్ళిపోయింది. చివరి రోజుల్లో నేనామెను బాధించానా? కామంతో పిచ్చివాడిలా ప్రవర్తించానా? ఇప్పుడు నా ఊరికి ఏ మొహం పెట్టుకుని వెళ్ళాలి? మావాళ్ళు ప్రేమ ఏదని అడిగితే ఏమని సమాధానం ఇవ్వాలి? స్టేషన్‌కు వచ్చి ఎదురుచూసే డేవిడ్‌కి ఏమని జవాబు చెప్పాలి?

నా రక్తాన్నంతా కన్నీరుగా మార్చి భోరున ఏడ్చాను. 'ప్రేమా... ప్రేమా' అంటూ పిచ్చివాడిలా వెక్కి వెక్కి ఏడ్చాను.

సక్సేనా నా దగ్గరికొచ్చాడు. నా భుజంపై చెయ్యేశాడు. అతడు నన్ను ఓదార్చుతాడనుకున్నాను. కాని అతను మరికొన్ని ప్రశ్నలు అడగటానికని నన్ను స్టేషన్‌కి పిలుచుకెళ్ళాడు. సక్సేనాని పలురకాలుగా ప్రాధేయపడ్డాను.

"మీకేమైనా డబ్బు కావాలంటే అడగండి. నా దగ్గర వున్నదంతా తీసుకోండి. దయ చేసి నన్ను వదిలేయండి. నాకు ఒంటరిగా వుండాలనిపిస్తోంది. ప్లీజ్... నా పరిస్థితిని అర్థం చేసుకోండి. నా ప్రేమ లేకపోయాక నాకు జీవితం శూన్యంగా అన్పిస్తోంది. నన్ను మా ఊరికి వెళ్ళనివ్వండి" అని వేడుకున్నాను.

అయితే ఈ సక్సేనా హృదయం లేని మనిషి. "నీ దగ్గర ఎంత డబ్బుంది? నీవు అంత శ్రీమంతుడవైతే పద నీ ఊరికే పోదాం, ఎంత ఇవ్వాలనుకుంటున్నావో అక్కడే ఇద్దువుగాని..." అన్నాడు నిర్లక్ష్యంగా.

తర్వాత దర్యాప్తు నిమిత్తం నన్ను బియాస్ హోటల్‌కి తీసుకెళ్ళాడు. నా




బట్టలు, పుస్తకాలు, ప్రేమబట్టలు అన్నిటినీ వెదుకుతూ చెల్లాచెదురు చేసేశాడు. ఆయన ముందునుంచీ కన్నడంలోనే మాట్లాడుతుం డటం నాకు ఆశ్చర్యం కలిగిస్తోంది.

"నాకు కన్నడం ఎలా తెలుసు అని ఆశ్చ ర్యపోతున్నావా? మా నాన్నగారు మీ కర్ణా టకలో డి.సి.గా వుండేవారు. శివమొగ్గలో, టుముకూరులో ఆరేళ్లు పనిచేశారు. అప్పుడు నేను వాళ్ళ వెంటే వుండేవాణ్ణి. నేను కన్నడం ఒక్కటే కాదు. మొత్తం ఆరు భార తీయ భాషలని మాట్లాడగలను" నా సందే హాన్ని తీరుస్తూ అన్నాడు ఇన్‌స్పెక్టర్ సక్సేనా.

నేను మౌనంగా కూర్చున్నాను. అతను నా డైరీ పేజీల్ని తిరగేస్తూ వాటిలోని కవి తల్ని చదవసాగాడు. తర్వాత నన్ను చూసి నవ్వుతూ,

"నీవు కవితలు కూడా రాస్తావన్నమాట" అన్నాడు వ్యంగ్యంగా.

"సెప్టెంబర్ ముప్పై తర్వాత డైరీ రాయటం ఎందుకు ఆపేశావ్?" అనుమా నంగా నన్ను చూస్తూ అడిగాడు.

"అది అడగవల్సిన ప్రశ్నేనా? పెళ్ళి సంద డిలో డైరీ రాయటానికి టైము దొరకలేదు" అన్నాను.

అతని ప్రశ్నల పరంపర అక్కడితో ఆగ లేదు.

"మీ పెళ్లి ఎప్పుడు జరిగింది?" మళ్ళీ అడిగాడు.

"అక్టోబరు రెండున"

"హనీమూన్‌కి ఎప్పుడు బయల్దేరారు?"

"అక్టోబర్ ఆరున, ఆదివారం ఉదయం పది గంటల ట్రైనుకు" అన్నాను వివరణగా.

"హనీమూన్‌కి అంత తొందరెందుకు?"

ఈ ప్రశ్న విని నాకు చిరాకేసింది. 'పెళ్లి అయిన వెంటనే బయల్దేరితే అది హనీ మూన్ అవుతుంది. ఆలస్యంగా వెళితే అది తీర్థయాత్ర అవుతుందని' చెప్పాలనిపిం చింది. అయినా నా చిరాకుని నిగ్రహించు కున్నాను.

"నువ్వు హోటల్‌లోనే వుండు. నేనూ నీతోపాటు మైసూరుకు వస్తాను" అని చెప్పి నా డైరీ, కవితల పుస్తకాన్ని తీసుకుని వెళ్ళి పోయాడు.

ఆ రాత్రి అతను హోటల్‌లోని వాళ్లం దర్నీ ప్రశ్నించాడు. ఏదేదో రాసుకున్నాడు.

నేను గదిలోని లైటు ఆర్పేశాను. అంధ కారం నా ప్రియ బంధువుగా అన్పించింది. మనస్ఫూర్తిగా వెక్కి వెక్కి ఏడ్చాను. తలు పుల దగ్గర నేలపై కూలబడి అక్కడ్నే ముడుచుకుని పడుకున్నాను. చలి విపరీ తంగా వున్నా నాకు దాని ధ్యాసే లేదు. తెల్లారేవరకు నాకు నిద్ర పట్టనేలేదు.

## రాజీవ్‌సక్సేనా

నేను రాక్షసుడినట! దుర్మార్గుడినట! కష్టాల్లో వున్న అభాగ్యులను వేధిస్తానట! రోథాంగ్‌పాస్‌మీది యాత్రికులు నా గురించి ఇలాంటి ఆరోపణలు ఎన్నో చేశారు. చెయ్యనీ, ఐ డోంట్ కేర్! నా కర్తవ్యాన్ని నిర్వహించకుండా వుండను.

నాకు వివేక్‌పైన అనుమానం వుంది. నాగపూర్‌నుండి వివేక్ జంటను వెంటా డుతూ వచ్చిన ఆ రౌడీల్ని కూడా బంధించి ప్రశ్నించాను. ఓ పట్టాన వాళ్ళు నోళ్లు విప్ప లేదు.

వాళ్ళిద్దరినీ లాఠీతో కసిదీరా వుతికి వాళ్ళ నోళ్లు విప్పించాను. ఆ తరువాత నా ప్రశ్న లకు వాళ్లు టకటక సమాధానాలు చెప్పారు.

వాళ్ల సమాధానాలు విచిత్రంగా వున్నాయి. నమ్మశక్యంగా లేవు. లాఠీతో బాగా కుళ్లబొడవడంవల్ల వాళ్లు దెబ్బలకు





తాళలేక ప్రాణభయంతో ఏదేదో బొంకారా అని నాకు అనుమానం కలిగింది. వాళ్లు చెప్పింది నిజమేనా? లేక ఈ దుర్మార్గులే ప్రేమను హతమార్చి కల్లబొల్లి కబుర్లు చెబుతున్నారా?

వాళ్లిద్దరూ చూడటానికి జంట హంతకుల్లా కనిపిస్తున్నారు. వారి వాలకం చూస్తే అలాగే అనిపిస్తుంది. వాళ్లే ప్రేమను హత్య చేసిన దుర్మార్గులనిపిస్తుంది.

వివేక్ ప్రేమలతోపాటు వీళ్ళిద్దరూ ట్రైన్‌లో ప్రయాణించారు. నాగపూర్‌లో ఓ చిరుచేదు సంఘటన జరిగింది. వీళ్లు ప్రేమను అల్లరి పెడుతూ వెంటపడ్డారు. అంతవరకు బాగానే వుంది. అయితే ఆ చిన్న సంఘటన కారణంగా వీళ్లిద్దరూ పనీపాట మానేసి ఇంతదూరం ఆ జంటను అనుసరిస్తూ వచ్చారని భావించటం సమంజసమేనా? ప్రేమ అందమైన అమ్మాయి అనటంలో సందేహంలేదు. అయితే భర్తతో కలిసి ప్రయాణిస్తున్న ఓ ఇల్లాలిని అల్లరి పెట్టడానికి ఎంత దుర్మార్గులైనా ఇంత దూరంవరకు రావడం సాధ్యమేనా? ఒక వేళ అల్లరి పెట్టే ఉద్దేశం బలంగా వున్నా ఆ అల్లరి ఆమెను హతమార్చే స్థాయివరకు వెళ్లటం సాధ్యమా?

లేక వాళ్లిద్దరి కథనం ప్రకారం- వాళ్లిద్దరూ మనాలికి బయలుదేరారు. నాగపూర్‌లో చిన్న గొడవ జరిగింది. తదనంతర ప్రయాణ కాలంలో జరిగినదంతా యాదృచ్ఛికంగా జరిగిన సంఘటనలని వాళ్లు చెబుతున్నది నిజమేనా? నాకంతా గందరగోళంగా అనిపించింది.

ఇద్దరిలో ఒకడు మరో కొత్త సంగతి బయటపెట్టాడు. అతను గత నెలలో మైసూరు వెళ్లినప్పుడు ప్రేమను మానస గంగోత్రిలో చూశాడట. ఇది మరింత





ఆశ్చర్యం కలిగించే విషయం. అతను మైసూరు వెళ్లింది ప్రేమను చూడటానికేనా? లేక మైసూరులో యాధృచ్ఛికంగా అతను ప్రేమను చూశాడా?

"నువ్వెందుకు మైసూరు వెళ్లావు? " అని అతన్ని నిలదీసి అడిగితే "అక్కడ మా ఫ్రెండిల్లు వుంది" అన్నాడు. ఆ ఫ్రెండు ఎవరు? నిజంగానే ఇతనికి మైసూరులో ఫ్రెండు వున్నాడా? లేక నా లాఠీదెబ్బల్ని భరించలేక ఏదో ఒకటి వాగుతున్నాడా? నన్ను నమ్మించటానికి కట్టుకథలల్లి చెబుతున్నాడా?

వివేక్‌తోపాటు ప్రయాణించినవారి అభిప్రాయం ప్రకారం వీరు హంతకులు కారు. ప్రేమ మరణంతో వీరికెలాంటి సంబంధం లేదనే అనిపిస్తుంది. ఒక్కోసారి 'ఇది హత్యే కాదు' అని అనిపిస్తుంది. అయినా నా మనసు దాన్ని అంగీకరించటంలేదు. నా మనసు లోలోతుల్లోంచి తలెత్తి నించున్న అనుమానపు భూతాన్ని నేనెలా తృప్తిపరచగలను?

ఈ కేసు దర్యాప్తును చేపట్టినప్పటినుంచీ నా అంతరాత్మ పదేపదే ఘోషిస్తూనే వుంది.

"ఇందులో ఏదో వుంది... వదలకు... ప్రేమది సహజ మరణం కాదు... ఇది ఒక హత్య... ముమ్మాటికీ హత్యే"

నాలోని ఈ అనుమానపు భూతానికి ఏ సమాధానమూ సంతృప్తి నివ్వటంలేదు.

ఇక మైసూరుకు వెళ్ళక తప్పదు. అక్కడ ఏదైనా క్లూ దొరకవచ్చు. ఇంతవరకు లభించిన ఆధారాలన్నీ వివేక్‌కు అనుకూలంగానే వున్నాయి.

'అతనొక గొప్ప ప్రేమికుడు' అని యాత్రికులు మొదలు 'బియాస్' హోటల్ ఉద్యోగులందరూ పదేపదే చెబుతున్నా ఆ విష

యాన్ని నేనంత సులభంగా నమ్మే వ్యక్తిని కాను. ఇరవైఏళ్ళుగా క్రమంతప్పకుండా రాసిన డైరీని సెప్టెంబర్ ముప్పై నుండి హఠాత్తుగా ఎందుకు ఆపేశాడు వివేక్. ఎంత ఆలోచించినా ఈ రహస్యం నాకు అంతు చిక్కటంలేదు. ఫోరెన్సిక్ రిపోర్ట్సు, పోస్ట్ మార్టమ్ రిపోర్టులో, కూడా ఎలాంటి క్లూ లభించలేదు.

అదొక ఆకస్మిక మరణమని దొరికిన ఆధారాలవల్ల తెలుస్తుంది. పైనుంచి తోసెయ్యటంవల్లగాని, ఏదైనా పెనుగులాట జరిగి ఆమె కిందికి పడిపోయినట్లుగాని ఎలాంటి ఆధారాలు కన్పించటంలేదు. పైగా ఆమె జారి కిందికి పడిన లోతు కూడా నాలుగు వందల అడుగులు మాత్రమే. ఎవరైనా ఉద్దేశ్యపూర్వకంగా ఆమెను చంపాలనుకుంటే బలంగా కిందికి తోసేసి వుండేవారు. అప్పుడామె ఎంత లోతుకు వెళ్ళిపోయి వుండేదంటే ఆమె శవం కూడా లభ్యమయ్యేది కాదు.

విషప్రయోగం గురించి కూడా ఎలాంటి ఖచ్చితమైన ఆధారంలేదు. పోస్టుమార్టంలోని అంశాలన్నీ నార్మల్‌గా వున్నాయి. ఏదీ ఉద్దేశ్యపూర్వకంగా జరిగినట్టు సాక్ష్యం లేదు. మొత్తానికి ప్రేమది ఆకస్మిక మరణమని ఈ రిపోర్టు ధృవపరుస్తోంది.

అయితే నేను ఒకసారి మైసూరుకు వెళ్ళి దర్యాప్తు జరిపితే ఏదైనా క్లూ దొరకవచ్చు. ఈ కవితలు, పద్యాలు రాసే వ్యక్తిని అంత తేలిగ్గా నమ్మకూడదు. మైసూరుకెళ్ళి ప్రేమ తల్లిదండ్రుల్నీ, ప్రేమ స్నేహితురాళ్లని, కలసి దర్యాప్తు జరిపితే ఏవైనా ఆధారాలు లభించవచ్చు

ఈ వివేక్ ప్రవర్తన కూడా అనుమానాస్పదంగానే వుంది. అతను మిగిలిన యాత్రికులనుండి భార్యను విడదీసి వారికి దూరంగా కొండ దక్షిణ అంచుకు ఎందుకు తీసుకెళ్ళాడు? అంతకంటే ముఖ్యమైన ప్రశ్న పెళ్ళయిన నాలుగు రోజులకే హనీమూన్ కోసం ఎందుకు తొందరపడ్డాడు. అందులోనూ 'కులూ'లోయవంటి సుదూరమైన అపరిచితమైన హిల్‌స్టేషన్‌కి ఎందుకు వచ్చాడు. దగ్గర్లోనే హనీమూన్ స్పాట్‌లు ఎన్నో ఉన్నా ఇక్కడికే ఎందుకు వచ్చాడు. హనీమూన్ గడపటానికి ఇండియాలో ఇదొక్కటే తగిన ప్రదేశమా?

ప్రేమ ధనవంతుల అమ్మాయి. వివేక్‌కి ఆమె ఆస్థిని కబళించాలనే అత్యాశ కలిగి వుండొచ్చు ఇందులో ఏదో రహస్యం వుంది.

ఆ రహస్యాన్ని కనుక్కోవాలంటే నేను మైసూరుకు వెళ్ళక తప్పదు. రేపే మైసూరుకు బయల్దేరతాను.

## మైసూరు

నా పేరు మైసూరు.

మహిషాసురుడనే రాక్షసుడు నన్ను పాలించినందువల్లనే నాకు 'మైసూరు' అని పేరుపెట్టారట.

అయితే ఒక విచిత్రం గమనించారా? మహిషాసురుడిని చాముండేశ్వరి సంహరించింది. చాముండేశ్వరి సత్‌శక్తికి సంకేతం! అందువల్ల నాకు చాముండేశ్వరి పురం, చాముండి నగరం, చాముండూరు అని ఏదో ఒక పేరుపెట్టి వుంటే బావుండేది.

కాని విచిత్రం! పైకి ఎంత డాంబికం ఒలకబోసినా ఈ ప్రజలకు లోలోపల దుష్టులమీదే ప్రేమ ఎక్కువ!

నా భౌగోళిక స్వరూపమే విచిత్రమైనది.

ఓ పక్క ఎమ్మేలు, పి. హెచ్. డిలతో నిండిన 'సరస్వతి పురం' వుంటే మరోపక్క ఒట్టి మొరటు మనుషులు నివసించే 'కన్నెగౌడ తోపులు', మురికివాడలూ నా

గర్భంలో వున్నాయి. ఓ వేపు బార్‌లు, ఫాస్ట్ ఫుడ్ సెంటర్‌లు, కంప్యూటర్ గేములు నాలో విరాజిల్లుతూ వుంటే, మరోవేపు మారెమ్మ గుడి, రథయాత్రలు వీధుల్లోనే గొర్రెల్ని, కోళ్ళను బలిచ్చే గ్రామీణ జీవితాలు కూడా నాలో ఇమిడివున్నాయి.

ఒక కోణంలోంచి పెద్ద పల్లెటూరిలా, మరో కోణంలోంచి పెద్ద పట్టణంలా కనిపించే నేను బెంగుళూరు అనే మహానగరం నుంచి కేవలం నూటేభై కిలోమీటర్ల దూరం లోనే వున్నాను. నాలోనే వుంటూ పాకిస్తానులో వున్నట్టు ప్రవర్తించే మండి మొహల్లా ముస్లింలు, అగ్రహారపు పాత ఇళ్లల్లో మగ్గిపోయి పాచిగట్టిన విప్రులు, మాఫియా ప్రపంచం, మట్కా దొరలు, అత్యాచారులు, ఇలా చెప్పుకుంటూ పోతే నాలో లేనిదేమిటి...? ఒక చివర్న చాముండి కొండ, మరో చివర కన్నంబాడి ఆనకట్ట వీటన్నిటి మధ్యలో తళుకుమనే మహారాజప్యాలెస్. అందుకనే గొప్ప చారిత్రాత్మక ప్రదేశంగా యాత్రికులు నన్ను పొగడ్తలతో ముంచెత్తుతూ ప్రతిరోజూ నన్ను చుట్టుముడుతూ వుంటారు.

అడవిలో నిశ్చింతగా తమమానాన తాము జీవించే అమాయక జీవుల్ని పట్టి తెచ్చి వాటిని జనంముందు ప్రదర్శించాలనే స్వార్థంతో 'జంతు ప్రదర్శనశాల'ను ఏర్పాటు చేశారు. నాలో దాగివున్న మహాక్రౌర్యం ఇదే! ఘీంకరించే ఏనుగు ఇక్కడికొచ్చి కంట తడిపెడుతుంది. గర్జించే సింహం కూడా నుంచోవటానికి సత్తువ లేక సొమ్మసిల్లి పడుకుంటుంది. ఇక్కడి కాళింగ సర్పాలు బుసలుకొట్టడంలేదు.

కారణం సరళమైనదే... జూ క్యూరేటర్లు, సిబ్బంది కుమ్మక్కై ఆ మూగ జీవాలకు అందవలసిన ఆహారాన్ని అన్యాయంగా తామే మేసేస్తూ వాటిని వుపవాసాలతో పీడిస్తున్నారు. ఈ అసహాయ ప్రాణుల నోరు కొట్టే అధికారులది ఒక రకమైన క్రౌర్యమైతే, ఆ మూగ ప్రాణులను చూసి ఆనందిస్తూ తమ పిల్లలకు చూపించి కాలక్షేపం చేస్తూ కర్రలతో వాటిని గుచ్చి బాధపెట్టి రెచ్చగొడుతూ తిరుగాడే సందర్శకులది మరో రకమైన క్రౌర్యం!

ఇక్కడే మానస గంగోత్రి వుంది.

వారానికి ఒక గంట మాత్రమే పాఠాలు చెబుతూ, ప్రతి సాయంత్రంపూట భార్యల చేత బజ్జీలు చేయించుకుని ఆవురావురుమంటూ తిని కాఫీలు సేవిస్తూ కప్పులోనే విప్లవాలు సృష్టించే ప్రొఫెసర్లు ఇక్కడ అసంఖ్యాకంగా వున్నారు.

డబ్బుకూ, కులాలకు, శీలానికి ఇక్కడ మార్కులిస్టులు వేలం వేయబడతాయి.

ఇక్కడే ప్రేమ చదువుకునేది.

ఆమెది ఎకనామిక్స్ గ్రూపు.

ఆమెకోసం పడిచచ్చే విద్యార్థుల సంఖ్య తక్కువేమీలేదు. ఆ సంఖ్య పెద్దదే. ఆమె దృష్టిలో పడాలని, ఆమెను ఆకర్షించాలనీ ఆమెతో మాట్లాడాలనీ, ఆమెను తాకాలనే ఆశతో వారు రకరకాల చేష్టల్ని చేసేవారు. ప్రేమకు కూడా ఆ రోమియోలకు పిచ్చెక్కించి ఆనందించాలనే ఆసక్తి వున్నట్టు కనిపిస్తుంది. అందుకే కాబోలు ఆమె బాగా డబ్బున్న కుటుంబంనుంచి వచ్చినా సాధారణ విద్యార్థినిలా సిటీ బస్సుల్లో ప్రయాణించేది. బస్సులో సీట్లు ఖాళీగా వున్నా నుంచునే ప్రయాణం చేసేది.

అయితే ప్రేమ చెడ్డపిల్లకాదు.

అందంగా వున్న ఆడపిల్లలకు తమ అందచందాలపట్ల సహజంగానే గర్వం వుంటుంది. తమ అందాన్ని నలుగురూ చూసి మెచ్చుకోవాలని కోరికగా వుంటుంది. నిజానికి అందంగా లేని వారిలోనూ ఈ బలహీనత వుంటుంది. అలాంటప్పుడు

అందులో అప్సరసలను తలదన్నే ప్రేమ వంటి జగన్మోహినికి ఇలాంటి కోరిక వుండ కుండా వుంటుందా?

గంగోత్రి హాస్టల్ అమ్మాయిలు సాయంత్రం అయ్యిందంటే చాలు తమ బాయ్‌ఫ్రెండ్స్ వెంట హాస్టల్ గార్డెన్‌లోని చెట్లకింద కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ కాలక్షేపం చేయటం నాకు బాగా తెలుసు.

ఈ ప్రేమ జంటల్లో కొందరిది పవిత్ర ప్రేమ. వీరు ఒకరినొకరు ముట్టుకోరు. ఆమడదూరంలోనే కూర్చుని ప్రేమ భజన చేస్తుంటారు. మరి కొందరు అందుకు పూర్తిగా విరుద్ధం. వీళ్ళకు చీకటి పడిం దంటే చాలు ఒకరినొకరు అతుక్కుపోతారు. ఆ దృశ్యాల్ని చూసి నేను మనసారా నవ్వేసి వూరుకుంటాను. ఇలా హత్తుకుపోయిన వారిని కొందరు రౌడీ కుర్రాళ్ళు బ్లాక్‌మె యిల్ చెయ్యాలని ఎదురు చూస్తూ వుంటారు. పోలీసుల వేషాల్లో కృషి కార్యా లయ ఉద్యోగుల వేషాల్లో పీడించే ఈ శని గాళ్ళు ప్రేమికుల పాలిట రాక్షసులు!

ఒక మాట మాత్రం నిజం. ప్రేమ అనే ఆ అందాలరాశి ఏనాడూ ఏ చెట్టుకిందా కూర్చున్న అమ్మాయి కాదు.

ఇలాంటి చవకబారు ప్రేమకలాపాలంటే ఆమెకు ఇష్టముండదు. ఒకరోజు ఎవరో కుర్రాడు ఆమె నవ్వును అపార్థంచేసుకుని ఆమె వెనకే చేతులు నలుపుకుంటూ తిరు గుతూ తన చెప్పుల్ని అరగదీసుకున్నాడు. ప్రేమ అతన్ని చెప్పులు తెగేదాకా తిరగనిచ్చి ఇదే బస్టాపులో అందరి ఎదుట బాగా చివా ట్లేసి వాడి తిక్క వదిలించింది.

ప్రేమ చాలా తెలివైన అమ్మాయి! "నన్ను చూసి ఆనందించండి. నా అందాన్ని కళ్ల తోనే ఆస్వాదించండి. అంతరంగంలో నా గురించి వందలాది కలలు కనండి. మీ హాస్టల్ బాత్రూంలో నా నగ్నశరీరాన్ని వూహించుకుని ఏమైనా చేసుకోండి. అంతే గాని మీ కలలకు కార్యరూపం ఇవ్వాలని అత్యుత్సాహం ప్రదర్శిస్తూ నా జోలికి వస్తే నేను వూరుకోను సుమా..." ఇది ఆమె తత్వం.

ఇదే ప్రేమ నీతి అయి వుండొచ్చు అందువల్లనే కాబోలు బస్సు వేళకు బస్టా పులో పురుషజాతి యావత్తూ పోగయ్యేది. ఆమె సొగసునూ, వయ్యారాన్ని చూసి ఈ జన్మ ధన్యం అయిందని వుబలాటపడి పోయే సౌందర్యారాధకులు ఎందరో!

కొందరు సుందరీమణులకు తమ అంద చందాల్ని చూసి చొంగ కార్చే వారిని సృష్టిం చటంలో గొప్ప ఆనందం లభిస్తుంది. ఎన్నడూ వారి 'ఆకలిని' చల్లార్చక, చొంగను మాత్రమే ఖాళీ చేసుకునే వారిని చూస్తూ ఓ తుంటరి నవ్వు వారి వేపు విసిరి ముందుకు సాగిపోయే 'ప్రేమలు' ఇక్కడ కోకొల్లలు!

అయితే ఇలాంటి ప్రేమకు అలాంటి దారుణమైన చావు ఎందుకొచ్చింది?

తప్పు... తప్పు... ఈ ప్రపంచంలో ఎవ రికీ, దేనికీ చావు పరిష్కారం కాజాలదు. అన్ని సమస్యలకు చావే పరిష్కారం అను కుంటే ఈ భూమ్మీద మానవ మాత్రుడనే వాడే మిగిలి వుండేవాడు కాదు. సాక్షాత్తు దేవతలకు కూడా బతికి బట్టకట్టడం అసా ధ్యంగా మారి వుండేది.

మహిషాసురుడు తప్పు చేశాడని చాముం డేశ్వరి అతన్ని చంపేసిందట. అయితే చాముండి కూడా ఓ మగదేవతతో 'అఫేర్' నడిపిందనే కథ చరిత్ర పుటల్లో దాగివుంది. నంజనగూడుకు చెందిన నంజుండేశ్వరుడు వారాంతంలో మైసూరుకి ఎందుకు వచ్చేవా డనే 'మైథలాజికల్ గాసిప్' గమనిస్తే దేవ తలు తక్కువ పాపాత్ములు కారనే నగ్న సత్యం మనకు బోధపడుతుంది. దేవతలే అలా వుంటే చిట్టిపొట్టి సెక్స్ వాంఛలకు లొంగిపోయే అల్పమానవులపట్ల కోపగించు




కోవటం అసమంజసం, అనవసరం.

నిజానికి ఆ అల్పులపట్ల జాలిచూపటం అవసరం.

మిస్టర్ సక్సేనా! నీకు స్వాగతం!! సుస్వాగతం!!!

మంచుదేశంనుండి మండుటెండలు కాసే ఉష్ణదేశానికి నిన్ను సాదరంగా ఆహ్వానిస్తున్నాను. నా రహదారుల్లో నీ బూట్లు చలించనీ...

జాగ్రత్త! ఇక్కడి లోకల్ పోలీసులను నమ్మావో కుక్కతోక పట్టుకుని కావేరిని ఈదినట్టే. స్థానికుల్నీ, స్థానిక పత్రికల్ని నమ్మి చెడ్డాను నేను. ఇక్కడ సాక్షాత్తు చాముండేశ్వరి కూడా అబద్ధం చెప్పే అవకాశం వుంది. మొక్కులు మొక్కుకుని నిలువునా మోసపోయిన చాలామంది భక్తుల గురించి నాకు తెలుసు. "దేవుడిమీద ఒట్టు" అనే మాటలు అంత చవకగా మారిపోవటానికి ఒక రకంగా ఈ దేవుళ్లే కారకులు. అదొక నిష్క్రియ, నిరపాయకారిక నిష్ప్రయోజక ప్రమాణమని ఇక్కడి భక్తాదులకంతా తెలిసిన ఓ నగ్న సత్యం.

అలాంటప్పుడు సత్యాన్ని ఎలా శోధించాలని మధనపడుతున్నావా? అందుకు సమాధానం నేను చెబుతాను.

మనుషుల్ని వదిలేసి నిర్జీవమైన వస్తువుల్ని పలకరించు.

నిర్జన, నిశ్శబ్ద రహదారులను ప్రశ్నించు.

వెలిగే దీప స్థంబాలను అడుగు.

ప్రకృతి శబ్దాలను చెవిఒగ్గి విను.

వీచే గాలి సంగీతాన్ని ఆలకించు.

సద్దుచేసే మానస గంగోత్రి చెట్ల ఆకుల కలవరాన్ని అర్థంచేసుకో.

సిటీ బస్సు బోర్డులను, గిర్రున తిరిగే స్టీరింగ్‌లనూ జాగ్రత్తగా గమనించు.

బస్సు డ్రైవర్లు పొగరుగా కాల్చి పారేసిన సిగరెట్టు ముక్కల్ని అడుగు.

రాత్రులను, ఏకాంత గదుల నీరవతను, గాలికి వూగే కిటికీ తెరలను గమనించు.

పాడైపోయి గ్యారేజీల్లో రిపేర్లకు నుంచున్న మోటర్‌బైకులను అడుగు.

ఇలా జడపదార్థాల వెంటబడితే ప్రాణం వున్న 'సత్యం' దొరుకుతుంది. ప్రాణం వున్న మనుషులను అడిగితే మరణించిన అబద్ధాన్నే నిజం అంటూ ప్రచారం చేస్తారు.

నువ్వు హిమాలయాలకు తిరిగి వెళ్లేలోగా కాకా హోటళ్ళ కాఫీని, గాంధీ సర్కిల్‌లోని లేత వ్యభిచారుల్నీ, సాకమ్మ, ముంతాజ్ బేగంలు నడిపే వేశ్యగృహాల్నీ, రమ్యా రెస్టారెంటులోని రవ్వదోసెను, వీటన్నిటినీ కొంచెం కొంచెం రుచి చూడు. ఫర్ ఏ ఛేంజ్!

నీకు అంతా మంచే జరగాలని కోరుకుంటున్నాను.

నీ ప్రయత్నం ఫలించాలని ఆశిస్తున్నాను!

నీకు 'సత్యం' దొరకాలి!!

గుడ్‌లక్ మిస్టర్ సక్సేనా!!!

## రాజీవ్‌సక్సేనా

ఇద్దరం మైసూరు చేరుకున్నాం. దారి పొడుగునా వివేక్‌ని రకరకాలుగా ప్రశ్నించాను. దానివల్ల ఎలాంటి ప్రయోజనం కలుగలేదు.

మైసూర్ స్టేషనులో మమ్మల్ని రిసీవ్ చేసుకోవటానికి ఎవరూ రాలేదు. వివేక్ వెంట నేరుగా అతని ఇంటికి వెళ్లాను.

వివేక్ తల్లిదండ్రులు అతన్ని చూడగానే కావలించుకుని బావురుమన్నారు.

"ప్రేమను ఎక్కడ వదిలేసి వచ్చావ్‌రా? " అంటూ వివేక్ తల్లి కొడుకుని పట్టుకుని అడుగుతూ భోరున విలపించింది. వివేక్

తల్లిదండ్రులకు కోడలిపట్ల ఎంతో మమ కారం వున్నట్టు నాకు అనిపించింది. అయితే ఇదంతా పచ్చి నటన అయ్యే అవ కాశం కూడా లేకపోలేదు.

త్వరలోనే ప్రేమ మరణవార్త బయటికి పొక్కింది. నేను స్థానిక పోలీసులకు రిపోర్టు చేసి దర్యాప్తులో వారి సహకారం కోరాను.

వివేక్ ఇంటినుంచే దర్యాప్తు మొదలె ట్టాను. నా అనుమానం వెల్లడించగానే వివేక్ తండ్రి ఇంతెత్తు ఎగిరిపడ్డాడు.

"ఇన్‌స్పెక్టర్, ఆ జంటను చూస్తే వాళ్ళు ఒకరికోసం మరొకరు పుట్టారేమో అనిపిం చింది. వాళ్లని భగవంతుడే ముడివేసిన దంపతులు అంటే అతిశయోక్తి లేదు. వివేక్ ప్రేమను ప్రాణంకంటే మిన్నగా ప్రేమించేవాడు. అలాంటి వ్యక్తిపట్ల అను మానపడటం మీకు మంచిది కాదు. మీరు విచారణ జరపాలంటున్నారు, జరపండి. ఇక్కడి మనుషుల్నే కాదు, చెట్టు, పుట్ట, కాలేజీ, సిటీబస్సు, దేన్నయినా అడగండి అవన్నీ వివేక్, ప్రేమల అనురాగాన్నే చాటి చెబుతాయి. మీరు ఎంతో దూరంనుంచి వచ్చారు. మావల్ల కాగల సాయం చేస్తాం. వాళ్ళిద్దరూ చదువుకున్న కాలేజీలో వాకబు చెయ్యండి. ప్రేమ ఇంట్లో అడగండి. ఆమె ఫ్రెండ్స్ వద్ద ఎంక్వైరీ చెయ్యండి. మీకు ఇష్టమొచ్చిన వాళ్లందరినీ విచారించండి. ఇక్కడి పోలీసు సాయం కూడా తీసుకోండి. నేను షాపుకు వెళుతున్నాను. నేను అక్కడ్నే వుంటాను. మీకు ఎప్పుడు ఏమి తెలుసుకో వాలనిపించినా అక్కడికొచ్చి నన్ను కలుసు కోవచ్చు" అంటూ వివేక్ తండ్రి భారమైన మనసుతో బయటికి వెళ్ళిపోయాడు.

నాకు కొంచెం నిరాశ కలిగింది. 'కులూ' నుంచి బయలుదేరినప్పుడు వున్న ఉత్సాహం సగానికి తగ్గిపోయింది.

ఇక అక్కడ్నించి ప్రేమ తల్లిదండ్రులు వుండే 'సుశీలా మహల్'కి వెళ్లాను.

కూతురి అకాల మరణంతో కుంగిపో యిన ప్రేమ తల్లిని ఓదార్చుతూ అన్నాను. "ప్రేమ డెడ్‌బాడీని ఇక్కడికి తీసుకురావటం కుదర్లేదు. నేనే ఎదురుగా వుండి ఆమె అంత్యక్రియలు జరిపించాను"

ప్రేమ తల్లి మూగదానిలా నా మాటలు వింటూండిపోయింది.

"మీనుంచి కొన్ని విషయాలు తెలుసుకో వాలనుకుంటున్నానమ్మా" అంటూ మెల్లగా ప్రశ్నలు అడగటం మొదలెట్టాను.

"పెళ్లిలో మీరు ఎంత వరకట్నం ఇచ్చారు? "

"వరకట్నమా? అసలేమీ ఇవ్వలేదు. వివేక్ ఒక్కపైసా అడగలేదు. అతనికి ఆస్తి, భూమి, నగలు ఇలాంటివన్నీ ఇష్టంలేదు. 'డబ్బు అడక్కపోయినా కనీసం మా నాన్న వద్ద కారైనా అడుగు' అంటూ మా అమ్మాయే వివేక్‌ని బలవంత పెట్టేది" కళ్ళ నీళ్లు వత్తుకుంటూ అందామె.

"వాళ్ళిద్దరి మధ్య ఏదైనా గొడవ జరి గిందా? "

"అలాంటిదేం లేదు. వాళ్ళిద్దరిదీ చిన్న నాటి స్నేహం. కలిసిమెలిసి పెరిగినవాళ్ళు ఎన్నో ఏళ్లుగా ఒకర్నొకరు ఇష్టపడ్డారు. పైగా మాది పాత బంధుత్వం. వివేక్ దేవు డిలాంటివాడు. వాడికి ప్రేమ అంటే ప్రాణం. మా కూతురు చనిపోయిందనే బాధలో అతనిపై లేనిపోని అభాండాలు వేస్తే మేము పురుగులు పడిచస్తాం"

తర్వాత నేను సుశీలామహల్ అంతా కలియతిరిగాను. చాలా గొప్ప ఇల్లు అది.

అంతలో టెలిఫోన్ మోగింది. లోకల్ పోలీస్‌స్టేషన్‌నుంచి నా కోసం ఇన్‌స్పెక్టర్ ఫోన్ చేశాడు. వెంటనే స్టేషన్‌కి రమ్మని పిలిచాడు.




నేను ఎంతో ఆసక్తిగా అక్కడికి చేరుకు న్నాను.

"మీ దర్యాప్తు ఎంతవరకొచ్చింది? " ఇన్ స్పెక్టర్ ప్రశ్నించాడు.

"ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్నట్టు వున్నచోటనే ఉంది సార్. ఇంకా కొన్ని విష యాలు సేకరించాల్సి వుంది" అన్నాను.

"ఇంతవరకు సేకరించిన వాటివల్ల ఏదైనా సాక్ష్యాధారం లభించిందా? "

"లేదు. డాక్టర్ రిపోర్టు ప్రకారం ప్రేమది ఆకస్మిక మరణం. బలవంతంగా చంపబ డిన ఆధారాలు లేవు. ప్రేమ, వివేక్ తల్లిదం డ్రులు వాళ్ళిద్దరిని అమర ప్రేమికులు అన్నట్టు వర్ణిస్తున్నారు"

"అదేమాట నేనూ చెప్పదలచుకున్నాను"

ఇన్ స్పెక్టర్ మాటలకు నేను నివ్వెరబో యాను.

"సార్, మీరు కూడా ఇలా మాట్లాడితే ఎలా? " అన్నాను విసుగ్గా.

ఇన్ స్పెక్టర్ చిన్నగా నవ్వాడు. బెల్ కొట్టి కానిస్టేబుల్ కి కాఫీ ఆర్డర్ చేసి నాకో చిన్న ఉపన్యాసం విన్పించాడు.

"మిస్టర్ సక్సేనా, మేము మీతో సహకరిం చటంలేదని అపార్థం చేసుకోవద్దు. ఏ క్షణంలో కావాలన్నా మేము మీ సేవకు సిద్ధంగా వున్నాం. అయితే మేము స్థానికులం కావటంవల్ల కొన్ని విషయాలు వివరించదలిచాను. దయచేసి వినండి. నా మాటల్ని విన్న తర్వాత కూడా మీరు దర్యాప్తు కొనసాగించవచ్చు"

"ఏమిటా విషయాలు? " నేను అసహ నంగా అడిగాను.

"మేము పక్షపాతంతో ఈ మాటలు చెప్ప టంలేదు. మాకు ప్రేమ, వివేక్ ల కుటుం బాల గురించి తెలుసు. మైసూరులో ఆ రెండూ ఎంతో పేరు ప్రతిష్టలున్న కుటుం బాలు. ప్రేమ తండ్రికి ఓ అగరొత్తుల ఫ్యాక్టరీ వుంది..."

"ఆ సంగతి నాకు తెలిసిందే..."

"ఫరవాలేదు. తొందరపడకండి. నా మాటలు పూర్తిగా వినండి. వివేక్ ప్రేమ లది చిన్ననాటి స్నేహం. వాళ్ళిద్దరికి పెళ్లి జరుగుతుందని సగం మైసూరుకే తెలుసు. మేమంతా ఆ పెళ్లికి వెళ్ళాం. వివేక్ స్వభావం విచిత్రమైనది. అతనెప్పుడూ డబ్బుకు ఆశపడే రకం కాదు. కొండలకింద కూర్చుని ప్రశాంతంగా కవితలు రాయాలను కునే పిచ్చి భావుకుడతను. ఒకసారి తను రాసిన కవితల్ని నాకు చూపించాడు. ఆశ్చ ర్యమేమంటే అతను రాసిన కవితలన్నిటికీ కేంద్రబిందువు ప్రేమయే! ఐశ్వర్యం, ఆడం బరం, అహంకారం వంటివి అతనికి అస్సలు గిట్టవు. అలాంటి సాదాసీదా వ్యక్తి కట్నం ఆశతో భార్యను హతమార్చాడని అనుమా నించడం మూర్ఖత్వం కాదంటారా? "

నేను మాట్లాడలేదు. మౌనంగా కాఫీ తాగాను.

"నేనింకా రెండ్రోజులు మైసూరులో వుంటాను" అని చెప్పి అక్కడ్నించి బయట పడ్డాను.

ప్రేమ క్లాస్‌మేట్స్‌ని కలిసి దర్యాప్తు జరు పుదామనే ఉద్దేశంతో క్యాంపస్‌కి వెళ్లాను. అక్కడ ఆ అమ్మాయిలు దాదాపు నా మీదికి యుద్ధానికే వచ్చారు.

"ఈ అతితెలివివల్లనే మీ డిపార్ట్‌మెంట్‌కు చెడ్డ పేరు వచ్చింది. వాస్తవమేమిటో మమ్మల్ని అడగండి చెబుతాము. ప్రేమ, వివేక్‌లది నిజంగా చిలకాగోరింకల జంట. వివేక్ భార్యను ప్రేమించటం కాదు, పూజిం చేవాడని చెబితే సబబుగా వుంటుంది. అదృష్టం అంటే ఆమెదే అని మేమంతా తెగ సంతోషపడ్డాం. ఆమె హఠాన్మరణం మాకం దరికీ పెద్ద షాక్. మా పరిస్థితే ఇట్లా వుంటే ఆమెను దేవతలా పూజించే ఆ



వివేక్ పరిస్థితి ఎలా వుందో, వివేక్‌ని మీరు అనుమానిస్తూ వేధించటం మీకు సమంజసం కాదు. నిజానికి అందరం కలిసి ఆ దురదృష్టవంతుడ్ని ఓదార్చి సేదదీర్చాలి. అయినా మీ పోలీసుల దగ్గర ఎక్కువగా మాట్లాడితే ఆ హత్య మేమే చేశామని అంటారేమో" ఓ అమ్మాయి రోషంగా, వ్యంగ్యంగా అంది.

వృత్తిరీత్యా నేను పోలీసుని! ఆమె మాటలకు రెచ్చిపోకుండా సంయమనం పాటించాను.

"అదికాదు మిస్... కాస్త నా మాటలు అర్థం చేసుకునే ప్రయత్నం చేయండి..." అంటూ ఇంకేదో అడగబోయాను. కాని ఆ అమ్మాయిల గుంపు నన్ను మాట్లాడనీకుండా ముక్తకంఠంతో కరాఖండీగా చెప్పేసింది.

"సార్, మా ప్రియమైన నేస్తం హఠాన్మరణానికి శ్రద్ధాంజలి ఘటించడానికి మా డిపార్ట్‌మెంట్ ఈరోజు ఓ సంతాపసభని ఏర్పాటుచేసింది. దయచేసి మీరూ రండి. మా ఎకనామిక్స్ ప్రొఫెసర్ కూడా వస్తారు. ఆయన్ని అడిగితే మీకేమైనా ఆధారాలు దొరుకుతాయేమో"

వారి మాటల చివరి వాక్యంలో ధ్వనించిన వ్యంగ్యం నా మనసులో గుచ్చుకున్నట్టనిపించింది. నన్ను ఎక్కడలేని నిరాశ ఆవహించింది. తొందరపాటుతో తప్పటడుగు వేశానా అనిపించింది. పై అధికారుల్ని ఒప్పించి కర్నాటక రాష్ట్రంవరకూ వచ్చి నేను సాధించిన ఘనకార్యమేమిటి? అనే సందేహం మదిలో మెదిలి నాపట్ల నాకే సిగ్గు కలిగింది.

మారు మాటాడకుండా క్యాంపస్‌కు గుడ్‌బై చెప్పి నా లాడ్జికి తిరిగొచ్చాను. సిగరెట్ వెలిగించి ఆలోచనల్లో పడిపోయాను. బాగా ఆలోచిస్తే నేను చాలా తొందరపడ్డా




నని అర్థమయింది. ఛీ... ఛీ... నేనింత దూరం రాకుండా వుండాల్సిందని అనిపించింది.

అంతలోనే నా పోలీసు బుద్ధి నా ఆలోచనలకు మళ్ళీ అడ్డు తగిలింది. వివేక్ తన డైరీలో పేర్కొన్న డేవిడ్ అనే అతని స్నేహితుడ్ని ఒకసారి కలవాలి. అది కూడా ఒక వెర్రి ప్రయత్నం కావచ్చు. ఇంతవరకు వచ్చాక అదొక్కటి ఎందుకు మిగల్చాలి. అతడి ద్వారా ఏం తెలుస్తుందో చూద్దాం. అనుకుంటూ డేవిడ్ కోసం బయల్దేరాను.

డేవిడ్ గది వెదకటం పెద్ద కష్టం కాలేదు. పాత అగ్రహారం వీధిలోని ఓ మేడమీది గదిలో అతను అద్దెకు వుంటున్నాడు. నేను కావాలనే చీకటి పడ్డాక వెళ్లాను. రాత్రి నాకు అనువైన, ఇష్టమైన సమయం. దర్యాప్తుకు అది తగిన సమయం.

మెల్లగా తలుపు తట్టాను.

డేవిడ్ తలుపు తెరిచాడు. అతడి ఒంటి మీద డ్రాయర్ మాత్రమే వుంది. బీరు తాగుతున్నట్టున్నాడు.

నన్ను నేను పరిచయం చేసుకున్నాక "ప్లీజ్ కమ్" అంటూ లోపలికి ఆహ్వానించి కూర్చోవటానికి స్టూల్ చూపించాడు.

నేను గదంతా పరికించి చూశాను. గది నిండా రకరకాల భంగిమల్లోవున్న ఓ స్త్రీ ఫొటోలు వున్నాయి.

గది ఊడ్చి ఎన్నేళ్ళయిందో? ఓ మూల చెత్తా చెదారం కుప్పగా పడివుంది. అందులో బీరుసీసా మూతలు, కాల్చి పారేసిన సిగరెట్టు పీకలు నిండివున్నాయి. బల్లపై కొన్ని ఫిలాసఫీ పుస్తకాలున్నాయి. ఓ మూల చిన్న టి.వి. సెట్ వుంది. బట్టలన్నీ అస్తవ్యస్తంగా పడివున్నాయి.

డేవిడ్ మరో గ్లాస్‌లో బీరు వేసి నాకు ఇవ్వబోయాడు.

"వద్దు, నాకు అలవాటు లేదు" అన్నాను.

"మీరు ఎందుకు వచ్చారో నాకు తెలుసు. ప్రేమ చావు గురించి అడగటానికికదూ? " అన్నాడు.

"అవును" అన్నాను.

"మరణమే అన్ని ప్రశ్నలకూ సమాధానం. దానికి ఆవలిపక్కన ప్రశ్నలంటూ ఏమీ మిగలవు" అన్నాడు డేవిడ్ వేదాంత ధోరణిలో.

"వివేక్ హనీమూన్‌కి వెళ్ళిన తర్వాత మీకు లెటర్లేమైనా రాశాడా? "

"ప్రత్యేకించి నాకంటూ రాయలేదు. అయితే అతని తల్లిదండ్రులకు రాసిన ఉత్తరాల్లో నా ప్రసక్తి వచ్చింది. నేనొకసారి వాళ్ళింటికి వెళ్ళినప్పుడు వివేక్ తల్లిదండ్రులు కులూనుంచి వచ్చిన ఉత్తరాన్ని నాకు చూపించారు. అందులో ప్రేమ తన భర్త తనను ఎంతో ప్రేమగా చూసుకుంటున్నాడని పొగుడుతూ రాసింది..."

"ఆ ఉత్తరాన్ని ఆమెచేత వివేక్ రాయించి వుండొచ్చుకదా...? "

"అంటే... ఏమిటి మీ ఉద్దేశం? "

"నాకు వివేక్‌మీద అనుమానం..."

డేవిడ్ పకపకా నవ్వాడు.

"మీరు ఓడిపోయారు సార్. మీరు మైసూరుకి రావటం, దర్యాప్తు చెయ్యటం- ఈ విషయాలన్నీ నాకు ముందే తెలుసు. మీకు ఎక్కడా ఏ ఆధారం చిక్కలేదు. అయినా మీ ఓటమిని అంగీకరించడానికి మీ పోలీసు బుద్ధి అడ్డు తగులుతున్నట్టుంది. ఎందుకీ అనవసర పట్టుదల సక్సేనాగారూ...? "

నేను తెల్లబోయాను. నా పోలీసు అనుభవమంతా నిష్ఫలమైనట్టు అనిపించింది.

డేవిడ్ నిష్ఠూరంగా అన్నాడు.

"మీ దిక్కుమాలిన దర్యాప్తు పుణ్యమా అని వివేక్ మానసికంగా మరింత కుంగిపోయాడు. అతన్ని ఎలా ఓదార్చాలో అర్థంకాక అతన్ని కలవటానికే నాకు ధైర్యం చాలటం లేదు. అతనితో మాట్లాడటానికి నా వద్ద మాటలే లేవనిపిస్తోంది. సక్సేనాగారూ, మిమ్మల్ని ఓ మాట అడగాలనుకుంటున్నాను"

"ఏమిటది? " నేను గుటక మింగుతూ అడిగాను.

"మీకు డబ్బు కావాలా? మొహమాటపడకుండా అడగండి? మీ పరిశోధన లక్ష్యం సత్యశోధనా లేక ధనసంపాదనా? " డేవిడ్ సూటిగా అడిగాడు.

"సత్యశోధనే నా ధ్యేయం!" నేను రొమ్ము విరుచుకుంటూ ఠీవిగా చెప్పాను.

"అలాగైతే దయచేసి వెంటనే మీ వూరికి తిరిగివెళ్ళిపోండి. డబ్బు కావాలంటే సూటిగా అడగండి. వివేక్ తండ్రి, ప్రేమ తండ్రి ఇద్దరూ ఈ ఊరిలో గొప్ప శ్రీమంతులు. మీరు కోరినంత ముట్టచెప్పగలరు" అన్నాడు.

నాకు కోపం వచ్చింది. అయితే దాన్ని వ్యక్తం చేసే స్థితిలో నేను లేను.

చివరిగా డేవిడ్ అన్నాడు.

"మీరు రేపటివరకు వుంటానంటే ఒకసారి ప్రేమావాళ్ళ అగరొత్తుల ఫ్యాక్టరీని దర్శించండి. నేను పిలుచుకెళ్తాను. మీకూ కాస్త కాలక్షేపం అవుతుంది"

నేను లేచి నించున్నాను. ఆటో తీసుకుని నేరుగా లాడ్జికి వచ్చేశాను. ఇప్పటికే నాలో ఓడిపోయిన భావన చోటు చేసుకుంది. రేపు ఉదయాన్నే ఢిల్లీ ట్రైను ఎక్కాలనే ఆలోచన వచ్చింది. ధావన్ కేసులోను, గ్వాలియర్‌కు చెందిన శోభ, అరుణ్‌కౌశల్‌ల కేసులోనూ వాస్తవాల్ని వెలికితీయటంలో నేను సాధించిన విజయాలవల్ల డిపార్ట్‌మెంట్‌లో శభాష్ అనిపించుకున్నాను. పోలీస్ డిపార్ట్‌మెంట్‌లో నాకు పేరు ప్రతిష్టలున్నాయి. ఆ





ఉత్సాహంలోనే నేను ఇలాంటి పిచ్చితనం చేశాను. శోకతప్తులైన రెండు కుటుంబాలవారిని ఆత్మీయంగా ఓదార్చటం మాని గాయపడ్డవారి హృదయాల్ని మరింత కెలికాను. వివేక్‌ని ఒక్కసారైనా ప్రేమగా పలకరించి వుంటే పాపం అతని దుఃఖం ఎంతో కొంత తగ్గివుండేది. అతడి బాధని నేను కళ్ళారా చూశాను. తన కళ్ళ ఎదుటే దారుణంగా ప్రాణాలు కోల్పోయిన ప్రియ సహధర్మచారిణి శరీరాన్ని పరాయి ఊర్లో దహనంచేసి ఏకాకిగా హనీమూన్ నుంచి తిరిగివచ్చిన ఆ అభాగ్యుడిపట్ల నాకు ఎక్కడలేని జాలి కలిగింది. బాధతో నిండిన వివేక్ ముఖం నా కళ్ళముందు కదిలింది.

పాపభీతి నన్ను పీడించసాగింది.

ఆలోచనలతో నాకు ఎప్పుడు నిద్రపట్టిందో?



ఉదయమే డేవిడ్ నా గది తలుపు తట్టి నన్ను నిద్రలోంచి మేల్కొలిపాడు. మేము అగరొత్తుల ఫ్యాక్టరీకి బయల్దేరాం.

దారిలో కనపడిన 'హోటల్ రమ్య'ని చూపిస్తూ డేవిడ్ అన్నాడు-

"వివేక్ హనీమూన్‌కి వెళ్ళేముందు మేమిద్దరం ఇదే హోటల్‌లో రవ్వదోసె తిన్నాం సార్, ఆ సమయంలో అతని ఉత్సాహం చూడాల్సింది. స్వర్గమే తన చెంతనున్నట్టు అతను సంతోషాతిరేకంలో మాట్లాడటం నాకు బాగా గుర్తుంది"

"ఎందుకంత సంతోషం? " నేనడిగాను.

"అతను ప్రేమను చాలా గాఢంగా ప్రేమించాడు. కేవలం ప్రేమించటమే కాదు పూజించేవాడు. అలాంటి తన స్వప్న సుందరిని భార్యగా పొందుతున్నందుకు గర్వంతో పొంగిపోతూ మాట్లాడాడు. నేనే తలతిక్కగా మాట్లాడి అతన్ని కాస్త నిరాశ పరచాను"

"మీరేమీ అనుకోనంటే ఓ మాట అడగనా...? అది మీ పర్సనల్"

"నా పర్సనల్ విషయమా? అడగండి సార్. నాకు సంబంధించినంతవరకు మీరు అడగదగ్గ ప్రశ్నలు రెండే రెండు వున్నాయి. ఒకటి- నాకూ ప్రేమకూ ఎలాంటి సంబంధం వుంది? రెండు నా రూంలో వున్న ఫొటోలోని స్త్రీ ఎవరు? ఇవి రెండు ప్రశ్నలే కదా మీరు అడగదల్చుకున్నది"

నాకు ఆశ్చర్యమనిపించింది.

"నిజమే సుమా... ఖచ్చితంగా ఈ రెండు ప్రశ్నలే నా తలలో మెదులుతున్నాయి. అవే ప్రశ్నలు నేను అడగదల్చుకున్నానని మీరెలా ఊహించగలిగారు? "

డేవిడ్ నవ్వి చెప్పాడు-

"ఇవి తప్ప నన్ను అడగటానికి మీ దగ్గర ప్రశ్నలేం మిగల్లేదు గనక. మీ ప్రశ్నలన్నీ వివేక్, ప్రేమ ఇళ్లల్లో తమ అస్తిత్వాన్నీ, అర్థాన్నీ కోల్పోయాయి. ఇక నేనొక్కడినే మిగిలాను. అడగగలిగే ప్రశ్నలు ఈ రెండే.. వీటికీ జవాబులు చెప్తా వినండి. ప్రేమను నేను 'సిస్టర్' అని పిలిచేవాణ్ణి. అలా పిలవటమే సబబు. మీకు తెలియదనుకుంటాను. స్నేహితుల భార్యల్ని మేము సిస్టర్లుగా భావిస్తాము. ఇది మా స్నేహితుల మధ్య వున్న వ్రాయబడని అనధికారిక ఒప్పందం. ఆ ఒప్పందం ప్రకారమే అనుకోండి, ప్రేమపట్ల సోదరభావమే తప్ప ఇతర భావాలు ఉండలేదు. ఆమె కూడా నన్ను 'డేవిడ్ బ్రదర్' అంటూ ఆప్యాయంగా పిలిచేది. చాలా మంచి అమ్మాయి..."

"సారీ... ఆమె బతికుండగా ఒక్కసారైనా చూసే భాగ్యం నాకు దొరకలేదు" నేను నొచ్చుకుంటూ అన్నాను.

"అవును. అది మీ ఖర్మ...మీ పోలీసు తెలివితేటలన్నీ శవాల దర్యాప్తుకే ఖర్చయి

పోతుంటాయి. ఇప్పుడు చూడండి. ఎక్కడో దేశపు ఒక మూల నున్న 'మనాలి'నుండి ఇంకో మూలనున్న మైసూరుకు మీరు దర్యాప్తు నిమిత్తం వచ్చారు. చనిపోయిన వారి సాకుతో బతికున్నవారి వెంటబడి పీడిస్తున్నారు"

"... ..."

"ఇక మీ రెండో ప్రశ్న... నా గదిలో వున్న ఫొటోలోని స్త్రీ ఎవరనేది? ఆమె నా భార్య. ఆమె నన్ను వదిలేసి మరో వ్యక్తితో పారిపోయింది. కొంపదీసి మీరు ఆమె గురించి కూడా దర్యాప్తు చేయాలనుకుంటున్నారా? "

"మిస్టర్ డేవిడ్! మీరు నన్ను అపార్థం చేసుకుంటున్నారు. ఒక పోలీస్ అధికారి స్థానంలో వుండి ఆలోచించండి. అప్పుడు మా సందిగ్ధ పరిస్థితి ఎలాంటిదో మీకు బోధపడుతుంది"

"ఉండనీయండి. మీరు అడగకపోయినా నా భార్య గురించి చెబుతాను. ఆ ఫొటోలో వున్నది నా భార్య అని చెప్పాను కదా. నేనొక గిటారిస్ట్‌ని. వివేక్ పెళ్ళిలో వీడియో తీసే బాధ్యత నేనే తీసుకున్నాను. మీకు ఇంట్రెస్ట్ వుంటే ఆ వీడియో ఫిల్ముని చూడవచ్చు. వివేక్ ఇంట్లో వి.సి.ఆర్. వుంది..."

"అది సరే... మీ భార్య గురించి చెబుతానన్నారు? "

"అవును కదా, నా భార్య కథ...! నేనామెను ఎంతగానో ప్రేమించేవాణ్ణి. ఖచ్చితంగా చెప్పాలంటే పూజించేవాణ్ణి. నిజానికి ఒక ఘట్టం వరకు నాదీ, వివేక్‌దీ ఒకే రకమైన కథ. అతనిలాగే నేను కూడా భార్యను వెర్రిగా ఆరాధించేవాణ్ణి. నేను ఇంట్లోనే కొంతమంది కుర్రవాళ్ళకు గిటార్ వాయించటం నేర్పించేవాణ్ణి. గిటార్ క్లాసుకు వచ్చే అబ్బాయిల్లోనే ఒకడి వెంట నా భార్య లేచిపోయింది"

"అదే నిజమైతే మీరు ఇప్పటికీ ఆమె ఫొటోని గదిలో ఎందుకు పెట్టుకున్నట్టు? "

"ఆమె శరీరం ఎవడితోనో పారిపోయింది గాని ఆమె మనస్సు నాతోనే వుందని నా అభిప్రాయం. నా జీవితంలోని అత్యంత సుఖభరిత క్షణాలన్నీ ఆమె సాంగత్యంలోనే గడిపాను. ఆ మధుర స్మృతులన్నీ నాకు ఎల్లప్పుడూ కావాలి. ఆమె భౌతికంగా ఇప్పుడు నాతో లేదు. ఆమె నాకు దూరంగా కేరళలో వుంది. అయినా ఆమెతో గడిపిన మధురస్మృతుల్ని ఎందుకు పోగొట్టుకోవాలి? ఆమెకు నేను అక్కర్లేదు. అంతమాత్రాన నాకు మనశ్శాంతినిచ్చే మధురక్షణాలు, తియ్యటి జ్ఞాపకాల్ని నేనెందుకు వదులుకోవాలి...? "

"ఆమెకు బుద్ధి చెప్పి మళ్ళీ ఆమెను మీ జీవితంలోకి ఆహ్వానించకూడదా? "

"అది తప్పు. అలా చేస్తే అది మరో నూతన అనర్థానికి దారితీస్తుంది. ఎవరి బతుకు వారిది. ఆమె మళ్ళీ నా దగ్గరకు తిరిగి వచ్చినా నేనామెను స్వీకరించలేను. ఎందుకంటే ఆమె పునరాగమనం ఆమెతోపాటు 'అనైతికతను' కూడా మోసుకొస్తుంది. ఆమె భౌతిక దేహంకన్నా ఆమె నాకు వదిలి వెళ్ళిన జ్ఞాపకాలే నాకు అందమైనవి. బతకటానికి నాకు అవే చాలు!"

నేను నిరుత్తరుణ్ణయ్యాను. అదే సమయంలో ఇరవైనాలుగవ బస్సు వచ్చి ఆగింది. డేవిడ్ అన్నాడు.

"ఈ బస్సులో ప్రయాణిస్తే మీకు మా ఊరిలో ఓ జీవితకాలం గడిపిన అనుభూతి కలుగుతుంది. ఇందులో ఎక్కి బల్లాళ్ దగ్గిర దిగితే చాలు అక్కడ్నుంచి ప్రేమ వాళ్ళ అగరొత్తుల ఫ్యాక్టరీ కాలినడక దూరంలో వుంటుంది"

ఇద్దరం బస్సెక్కాం.





"మీ డ్రైవర్లు చాలా ఫాస్టండీ..." అన్నాను.

"అవును. ఈ బస్సుకు 'సుశీల మహల్' ముందు కూడా ఓ స్టాప్ వుంది. అక్కడి బ్లైండ్ టర్నింగ్‌లో బస్సు ఎంత వేగంగా మలుపు తిరుగుతుందో చూస్తే మీక్కూడా భయమేస్తుంది సుమా..."

"'సుశీల మహల్' అంటే ప్రేమ వాళ్ళ ఇంటి పేరు కదూ?"

"అవును"

బల్లాళ్ దగ్గిర బస్సు ఆగగానే కిందికి దిగి తూర్పువేపుగా నడిచాం. అరకిలోమీటరు కూడా వెళ్ళకముందే అగరొత్తుల గుబాళింపులు అలవోకగా ముక్కుపుటాల్ని తాకాయి. ఇద్దరం పెద్ద టవర్ కిందికొచ్చి నించున్నాం. నేను అన్నాను.

"ఇక్కడ నాకేమీ పనిలేదు. ఏదో కుతూహలం కొద్దీ వచ్చాను"

అక్కడి చెట్టుకింద కూర్చున్న ఆడ కూలీలు ప్రేమ గురించి ఏదేదో మాట్లాడుకుంటున్నారు. వాళ్ళు నన్ను గమనించకుండా జాగ్రత్తపడుతూ వాళ్ళ మాటల్ని వినటానికి ప్రయత్నించాను.

అది పసిగట్టి డేవిడ్ ముసిముసిగా నవ్వాడు.

"ఆ రాక్షసి తెగ మిడిసిపడేది... అబ్బబ్బా! ... ఎంత పొగరు... ఏమి దిమాకు... ఆమె మమ్మల్ని 'గాడిదమొహాలు' అంటూ తిట్టేది కదా. ఒంటినిండా నగలతో మహారాణిలా ఊరేగేది. మమ్మల్ని పురుగుల్లా హీనంగా చూసేది. అందుకే దానికి తగిన శాస్తి జరిగింది. ఏదో దేశానికి మొగుడితో వెళ్ళి దిక్కులేని చావు చచ్చింది

"అలాగా... అందుకేనా మన యజమాని దిగాలుగా వున్నాడు. పేదోళ్ళ శాపం వూరకే పోతుందా? ఆమె కారణంగానే నాకు పోయిన నెల జీతంలో యాభైరూపాయలు కట్ చేశారు. చాలా బాధలు పెట్టింది రాక్షసి"

"మండిపడే వాళ్ళంతా మసైపోతారు అని వూరకే చెప్పలేదు పెద్దలు... రండి... రండి... పనికి వేళయింది... వెళదాం"

అక్కడున్న ఆడకూలీల గుంపు ఫ్యాక్టరీలోకి ప్రవేశించింది.

మేమూ లోపలికి వెళ్లాం. ద్వారం పక్కనే గేటు సమీపాన లారీల్లో అగరొత్తుల పెట్టెలు లోడ్ చేయటం కనిపించింది. ఆ ప్రాంతమంతా తల దిమ్మెక్కిపోయే సువాసనల్ని వెదజల్లుతోంది. మరోపక్క కూలీ వాళ్ళు అగరొత్తులు తయారుచేస్తున్నారు. తయారైన వాటిని లెక్కపెట్టి ఓ చోట పడేస్తున్నారు. ఓ స్త్రీ వాటి లెక్కలు చూస్తూ తిరుగాడుతోంది.

డేవిడ్ ఆ స్త్రీకి సైగచేసి దగ్గరికి పిలిచాడు "మీ యజమానురాలు ప్రేమ చనిపోయిందటగా" అన్నాడు మెల్లగా.

"అయ్యో అది పాతవార్తేనండి. ఆవిడ చచ్చినరోజే ఫ్యాక్టరీలో అందరికీ తెలిసిపోయింది. అది సరేగాని, ఈ పాడు పోలీసులు పాపం ఆ వివేక్‌బాబు వెంటపడ్డారంటగదండీ. ఆ మనిషి దేవుడిలాంటివాడు. భార్యను కళ్లల్లో పెట్టుకుని పూజచేసేవాడు. ఈ పోలీసోళ్ళకి బుద్ధిలేదు. ఆమే ఏ కొండ మీదినుంచో కాలుజారి లోయలోకి పడ్డదట. అందుకు భర్త ఏం చేస్తాడు, పాపం? మొన్న ఆ వివేక్‌బాబుని చూశాను. దుఃఖంతో బక్కచిక్కి కట్టెపుల్లలా అయిపోయాడు. భార్యపోయిన బాధతో ఏ అఘాయిత్యానికి పాల్పడతాడో అని భయంగా వుంది నాకు" అంటూ గుక్కతిప్పుకోకుండా చెప్పిందామె.

నాకు సిగ్గువేసింది. దాన్ని బయటపడనీ

యకుండా నింపాదిగా అడిగాను.

"అది కాదమ్మా, ఈ వివేక్‌మీద మీకంద రికీ ఎందుకంత అభిమానం? "

ఆ స్త్రీ పెద్ద స్వరంతో చెప్పింది.

"మీకు తెలియదు. వివేక్ నా ఒడిలోనే ఆడుతూ పెరిగి పెద్దవాడయ్యాడు. అతనే నాకు ఈ ఫ్యాక్టరీలో పని ఇప్పించాడు. ఆ బంగారు తండ్రికి ఏ అపకారం జరక్కూడ దని వెయ్యి దేవుళ్ళకు మొక్కుకుంటున్నాను"

మేమిక అక్కడ నిలబడలేకపోయాం. బయటికి వస్తున్నప్పుడు డేవిడ్ అన్నాడు

"సక్సేనాగారూ, ఇక మరో సాక్షిని మీకు చూపించే ఓపిక నాకు లేదు. వాస్తవాన్ని మీముందు వుంచాను. మీ సత్యాన్వేషణలో ఇంకేదైనా సాయం కావాలంటే చెప్పండి. నన్ను మీ స్నేహితునిగా భావించి ఏం కావాలో నిర్మొహమాటంగా అడగండి"

నేను థ్యాంక్స్ చెప్పాను. మళ్ళీ మేము బస్సెక్కాం.

"సుశీలా మహల్‌కి రెండు టిక్కెట్లివ్వండి" కండక్టర్‌కి చిల్లర ఇస్తూ అన్నాడు డేవిడ్.

బస్సు 'సుశీలా మహల్' ముందు ఆగింది. మేం గబగబా కిందికి దిగి ఇంట్లోకి నడిచాం.

సుశీలామహల్ దుఃఖంతో బావురుమం టోంది. ప్రేమ తల్లి తన శరీరంలోని ముఖ్యమైన అవయవాన్ని కోల్పోయినట్టు నిస్సహాయంగా, నిస్పృహగా పడుకుని వుంది. తండ్రి ఇంట్లో లేడు. నాకు బాధతో గుండె పిండేసినట్టయింది.

"నేనివాళ సాయంత్రం మనాలి వెళ్ళిపో తున్నానమ్మా" అన్నాను.

ఆమె మాటలు కూడదీసుకుంటూ మెల్లగా చెప్పింది.

"వెళ్ళిరా బాబు. నా బిడ్డ ఒక దురదృష్ట వంతురాలు. దేవుడిలాంటి భర్త దొరికినా అతనితో కలిసి జీవించే రాత దానినుదుట రాసిపెట్టిలేదు" అంటూ బాధగా నిట్టూ ర్చింది.

"మీ వారితో చెప్పండి" అన్నాను.

చివరిసారిగా వీడ్కోలు చెప్పి నేను, డేవిడ్ 'సుశీలమహల్'నుంచి బయటపడ్డాం. అక్క డ్నుంచి నేరుగా పోలీస్‌స్టేషన్‌కి వెళ్లాం.

ఎస్. ఐ. మమ్మల్ని నవ్వుతూ ఆహ్వానిం చాడు.

"మిస్టర్ సక్సేనా, ఇప్పుడే నిర్ణయానికొ చ్చారు? " అదే నవ్వుతో అడిగాడు.

"సాయంత్రం తిరిగివెళ్ళే నిర్ణయానికి" నేనూ నవ్వుతూ జవాబిచ్చాను.

"మీ మొక్కవోని పట్టుదల, తెగువ, ప్రయత్నం మెచ్చదగినవే. మనిషికి పట్టువ దలని ప్రయత్నమే విజయాన్ని చేకూరు స్తుంది. మీ ప్రయత్నం మీరు చేశారు. ఏం చేస్తాం? వాస్తవం వాస్తవమే అవుతుంది. నేను ముందే చెప్పినట్టుగా ప్రేమది ఓ యాక్సిడెంటల్ డెత్ తప్ప మరొకటి కావటా నికి అవకాశమే లేదు. వాళ్ళు ఎంతో అన్యోన్యంగా వుండేవారు. ఈ రెండు కుటుంబాలలోని ఒక్కో కుటుంబ సభ్యుడి గురించి నాకు బాగా తెలుసు"

"పోనీలేండి. ఈ సాకుతో పదేళ్ళక్రితం చూసిన కర్ణాటకని ఇన్నాళ్ళకి మరోసారి చూసే భాగ్యం దొరికిందనుకుని తృప్తిపడ తాను. ఇక్కడి జనం చాలా మంచివారు. ఢిల్లీ సిటీ బస్సుల్లో జనం ఎంత మొరటుగా ప్రవర్తిస్తారో? ఇక్కడ చిరునవ్వులతోటే స్వాగతం పలుకుతారు. వివేక్ కేసువల్ల కొందర్ని నేను అనవసరంగా విసిగించినం దుకు ఎంతో బాధగా వుంది"

"ఫరవాలేదు. ఈ డిపార్ట్‌మెంటులో అది తప్పదు. మీరు నిరాశపడవద్దు. మీలాంటి పట్టుదలగల ఆఫీసర్లు మన డిపార్ట్‌మెం




టుకు ఎంతో అవసరం. మనాలి చేరాక ఉత్తరం రాయండి"

డేవిడ్ మా సంభాషణవింటూ మౌనంగా కూర్చుండిపోయాడు.

కాఫీ సేవించాక నేను లేచి నుంచున్నాను. ఎస్.ఐ.తో కరచాలనం చేశాక గుడ్‌బై చెప్పి బయటికి నడిచాను. డేవిడ్ నన్ను అనుసరించాడు.

మైసూరు వదిలే ముందు చివరగా వివేక్‌కి వీడ్కోలు చెప్పాలనిపించింది. అదే మాట డేవిడ్‌కి చెప్పి ఇద్దరం కలిసి ఆటో ఎక్కి వివేక్ ఇంటికి చేరుకున్నాం.

సుశీలామహల్ మాదిరిగానే ఆ ఇల్లు కూడా విషాదాన్నీ, నిశ్శబ్దాన్నీ కక్కుతోంది.

'నేను ఇవాళ సాయంత్రం మనాలికి బయల్దేరుతున్నాను. మీకు ఇబ్బంది కలిగించినందుకు క్షమించండి' అనే మర్యాదపూర్వక వీడ్కోలు పదాలే నా నాలుక చివరన తిష్టవేసి బయటికి జారటానికి సిద్ధంగా వున్నాయి. అవి చెప్పటమే చివరి దర్శనం ముఖ్యవుద్దేశ్యం.

ఇంట్లో ఎవరూ కనపడలేదు. డేవిడ్ "ఆంటీ... ఆంటీ..." అంటూ ఇల్లంతా గాలించాడు.

"ఎవరూ? " అంటూ ఓ చీకటి గదిలోంచి వివేక్ తల్లి స్వరం విన్పించింది.

మేము ఆ గదిలోకి ప్రవేశించాం. ఆమె నిస్సత్తువుగా పడుకుని వుంది. మమ్మల్ని చూసి జీవం వచ్చినట్టు నెమ్మదిగా లేవడానికి ప్రయత్నించింది.

"కాఫీ ఇవ్వనా బాబూ? " అంది.

"వద్దు ఆంటీ, ఇప్పుడే తాగి వచ్చాం" అంటూ డేవిడ్ ఆమెను లేపి కూర్చోబెట్టాడు.

"ఆంటీ, ఈయన ఊరికి తిరుగుప్రయాణమవుతున్నారు" అన్నాడు.

ఆమె నావేపు చూసింది.

"మావల్ల నీ దర్యాప్తుకు ఇబ్బంది కలిగి వుంటే క్షమించుబాబు. కోడలు పోవటంతో ఇల్లంతా శ్మశానంలా మారిపోయింది. వివేక్ నాన్నగారు కూడా షాపుకు వెళ్ళలేక పోతున్నారు. నా బిడ్డ వివేక్ ఎంత చిక్కిపోయాడో? రోజంతా ప్రేమా, ప్రేమా అంటూ ఆమె కొంగు పట్టుకుని ఆమె వెంట చిన్నపిల్లవాడిలా తిరిగేవాడు..." ఆవిడ కంఠం గాద్గదికమవటంతో సగంలోనే మాటలాపేసింది.

అప్పటిదాకా నాలోపల తిష్టవేసుక్కూర్చున్న పోలీసు కఠినత్వం తన అస్తిత్వాన్ని పూర్తిగా కోల్పోయింది. దాని స్థానంలోనే మానవత్వం మేల్కొంది. వివేక్ నా తమ్ముడులాంటివాడు అనే భావన కలగసాగింది.

"వివేక్... వివేక్ ఎక్కడున్నాడమ్మా? " అడిగాను పశ్చాత్తాపం నిండిన స్వరంతో

"సాయంత్రం వస్తానని చెప్పి వెళ్ళాడు బాబూ. ఒంటరిగా వెళ్ళకురా, అసలే నీ మనసు బాగోలేదు అని మొత్తుకున్నా విన్పించుకోలేదు. ఎన్నడూ నా మాట తీసి పారేసేవాడు కాదు. కాని ఈ స్థితిలో వాడ్ని ఆపే శక్తి నాకెక్కడిది? ఏ చెట్టుకింద కూర్చుని కవితలు రాస్తున్నాడో... ఏ లైబ్రరీలో పుస్తకం పట్టుకుని కూర్చున్నాడో..." ఆమె బాధాతప్త స్వరంతో అంది.

డేవిడ్ ఆమెను ఓదార్చాడు.

"ఆంటీ, వాడెక్కడుంటాడో నాకు తెలుసు. నేను వెళ్ళి వాడ్ని పిలుచుకువస్తాను. మీరు ధైర్యంగా వుండండి"

"డేవిడ్, వివేక్‌ని చూడకుండా నేను మా ఊరికి తిరిగి వెళ్ళలేను" అన్నాను.

"ఇంకా దర్యాప్తు జరపటం - మిగిలి వుందంటారా ఇన్‌స్పెక్టర్? " అతను నవ్వుతూ అడిగాడు.

"లేదు. ఈ కేసులో నాకిక ఏమాత్రం ఆసక్తిలేదు అయినా వివేక్‌ని పలకరించ

కుండా వెళ్ళటానికి నాకెందుకో మనసొప్పటంలేదు" అన్నాను గంభీరంగా.

"అయితే పదండి... వివేక్ ఈ సమయంలో ఎక్కడుంటాడో నాకు తెలుసు. ప్రేమ ఏదైనా విషయంలో మొండికేసినపుడు, చిన్నచిన్న విషయాలకు అలిగినప్పుడు అతను అక్కడికే వెళ్ళి కూర్చునేవాడు. పొద్దుగుంకేవేళ నేను వెళ్ళి అతన్ని ఓదార్చి పిలుచుకువచ్చేవాణ్ణి. ఇప్పుడు కూడా అతను అక్కడికే వెళ్ళి వుంటాడని నా నమ్మకం"

నేను ఎక్కడికని అడక్కుండా మౌనంగా డేవిడ్‌ని అనుసరించాను. ఇద్దరం ఖాలినడకన ఊటీ దారిలో ముందుకు నడుస్తున్నాం. మధ్యాహ్నపు ఎండ ఇప్పుడిప్పుడే తీక్షణతను కోల్పోతోంది.

దక్షిణంగా కొంతదూరం నడిచాక చాముండి కొండలకింద ఓ శ్మశానం కనపడింది. డేవిడ్ నన్ను శ్మశానం లోపలికి తీసుకెళ్ళాడు.

ఈ మధ్యనే ఖననం జరిపిన కొత్త సమాధులు, కొత్త మట్టి దిబ్బలు, బురుగుల రాశి, పూలరాశి, గాజులు పగులకొట్టిన స్థలం, కుంకుమ చల్లినచోటు ఇవన్నీ చూస్తూ వివేక్ కోసం శ్మశానమంతా గాలించసాగాం. కాళ్ళకు పుర్రెలు, ఎముకలు తగులుతున్నాయి.

వివేక్ ఏదైనా చెట్టుకింద కూర్చున్నాడేమోనని దూరం వరకు కనిపిస్తున్న చెట్లవేపు దృష్టి సారించాం. కాని ఎక్కడా వివేక్ జాడ లేదు.

కాకులు కావుకావుమంటున్న చప్పుడు... అక్కడక్కడ నిప్పులోంచి పైకి లేస్తున్న సన్నటి పొగ... సగం కాలి ఆరిపోయిన అగరొత్తుల పుల్లలు.. కొబ్బరి చిప్పలు... అక్కడి వాతావరణం వింత అనుభూతిని కలిగిస్తోంది.





"వివేక్" నేను గట్టిగా పిలిచాను.

జవాబు రాలేదు.

నాకు ఒక్కక్షణం భయంతో గుండె కంపించింది. కొంపదీసి వివేక్ ఏ అఘాయిత్యానికైనా పాల్పడ్డాడా?

ఛ... ఛ... అలా జరిగి వుండదు, జరక్కూడదు అనుకున్నాను. ఇందులో నా తప్పేంలేదు. ఇది నా వృత్తి. 'సత్యశోధన' కోసం నా కర్తవ్యాన్ని నేను పాటించాను తప్ప నేనే పాపం చెయ్యలేదు అని నన్ను నేను సమాధానపర్చుకున్నాను. నేనీ సమయంలో సెంటిమెంటల్ కాకూడదు. నేనొక బాధ్యతగల పోలీసు ఆఫీసర్ని. ఇంత భావుకంగా ఆలోచించటం నాకు తగదు అనుకుంటూ నా మనసుని దృఢంగా మార్చుకునే ప్రయత్నం చేశాను.

"మిస్టర్ సక్సేనా... వివేక్ ఇక్కడ లేడని నిరాశపడవద్దు. ముందు మరో శ్మశానం వుంది. పదండి, అతనక్కడున్నాడేమో చూద్దాం" అంటూ డేవిడ్ నన్ను మళ్ళీ మెయిన్‌రోడ్డులోకి తీసుకొచ్చాడు.

వచ్చిన దారిలోనే వెనుదిరిగి కొద్దిదూరం నడిచాం. దారికి ఎడమపక్క ఓ దేవాలయం వచ్చింది. దాని చుట్టూ వందలాది గోపురాలు కనిపించాయి.

"ఇదేమిటి? " డేవిడ్‌ని అడిగాను.

"ఇది రాజ వంశస్థులకు చెందిన శ్మశానం. అవన్నీ మహారాజు కుటుంబీకుల సమాధులు" అన్నాడు డేవిడ్ అదే పేలవమైన నవ్వు నవ్వుతూ.

"ఇన్ని సమాధులా...? " అడిగాను ఆశ్చర్యంగా.

"అవును. ఇవన్నీ రాణుల సమాధులే. మీకు తెలియదు కదా, చాలా మంది రాజులు ఒట్టి పిరికివాళ్ళు. అయితే ఒకే ఒక

భార్యను కట్టుకోవటానికి వాళ్ళు మనలాంటి సామాన్యులా? వందలాది స్త్రీలతో గడపగలిగినవారే మహారాజులు అవుతారు. ఈ ఊరిని అలాంటి గొప్ప మహారాజులే పరిపాలించి తనువు చాలించారు. వారితోపాటు వారి భార్యలు లేక ఉంపుడుగత్తెలు కూడా గతించిపోయారు. వారందరిదే ఈ శ్మశానం. సామాన్యజనం మాత్రం అలాంటి ఘనకార్యాలు చెయ్యలేకపోయినా తమరాజుల రసికతను మాత్రం ఎంతో భక్తిశ్రద్ధలతో గుర్తుకు తెచ్చుకుంటారు. వారి పుణ్యమా అని ఈ శ్మశానం ఇప్పటికీ విరాజిల్లుతోంది. ఇప్పుడు మన వివేక్ ఏ మహారాణి సమాధిమీద పడుకుని దుఃఖిస్తున్నాడో... పిచ్చివాడు" అంటూ డేవిడ్ అక్కడున్న సమాధుల మధ్య దూరిపోయి వివేక్‌ని అన్వేషించసాగాడు. నేను అతడ్ని అనుసరించాను.

"అడుగో వివేక్ అక్కడున్నాడు" డేవిడ్ సంతోషంగా ఓవేపు చూపించాడు. నేను గబుక్కున అటు చూశాను. వివేక్ ఓ స్తంభానికి ఆనుకుని శిలలా నిశ్చలంగా కూర్చుని వున్నాడు. గుంటలు పడి లోతుకు పోయిన కళ్ళు శూన్యంలోకి చూస్తున్నాయి. చిన్నపాటి గడ్డం పెరిగి వుంది.

మా అలికిడికి తల తిప్పి నన్ను విరక్తిగా చూశాడు.

"నన్ను అరెస్ట్ చేయటానికి వచ్చారా సార్?" అన్నాడు చిన్న పిల్లాడిలా.

నేను అతని పక్కన కూర్చుంటూ అన్నాను.

"వివేక్... నావల్ల మీకు ఎన్నో ఇబ్బందులు కలిగాయి. మిమ్మల్ని ఏకవచనంతో సంబోధించి అగౌరవ పరచాను. ఏం చేయమంటారు? నా వృత్తే అటువంటిది. కర్ణాటకలో వరకట్నం చావులు ఎక్కువని ఏదో మాగ్జైనులో చదివాను. ఈ కేసు కూడా ఆ బాపతే అయి వుంటుందనుకుని దర్యాప్తు కోసం ఇంతదూరం వచ్చాను. ఇక్కడికొచ్చి ఇక్కడి పరిస్థితులు చూశాక నేనెంత గొప్ప మూర్ఖుడినో తెలిసివచ్చింది. ఇవాళ సాయంత్రమే నేను బయల్దేరి వెళ్ళిపోతున్నాను. కడసారి పలకరించి వెళదామని మిమ్మల్ని వెదుక్కుంటూ ఇక్కడిదాకా వచ్చాను. మీరిలా డల్‌గా కూర్చుంటే మీ తల్లిదండ్రులు మరింత కుంగిపోతారు. మీరే ధైర్యాన్ని కోల్పోతే వారిని ఎవరు చూస్తారు?" అంటూ అతని చేతుల్ని పట్టుకుని మృదువుగా నొక్కాను.

వివేక్ కళ్ళు కన్నీటితో నిండాయి. డేవిడ్ అతనికి మరో పక్కన కూర్చుంటూ తన సహజ వేదాంత ధోరణిలో చెప్పాడు.

"కొత్త జీవితం ప్రారంభించు వివేక్, నీకు తోడుగా ఈ డేవిడ్ బతికేవున్నాడు..."

"వివేక్! డేవిడ్ చెబుతున్నది నిజమే. నువ్వు జరిగినదంతా మర్చిపోయి కొత్త జీవితం మొదలెట్టాలి. నీవు వీలైనంత త్వరగా మరో పెళ్ళి చేసుకోవాలి..."

నేను మాటలు ముగించక ముందే వివేక్ నా నుంచి తన చేతుల్ని వెనక్కి లాక్కుని మోకాళ్ళలో ముఖాన్ని దాచుకుంటూ "నో... నో... నెవర్..." అని అరిచాడు.

డేవిడ్ యోగిలా అన్నాడు.

"వివేక్ బ్రదర్, కంట్రోల్ యువర్ సెల్ఫ్. ఆ సంగతి వదిలెయ్. ఈయన మనాలి నుంచి ఇంతదూరం వచ్చారు. సాయంత్రం తిరిగి వెళుతున్నారు. మన కుటుంబ సమస్యకారణంగా ఆయన ఇంత దూరం వచ్చారు గనక మనం ఆయనకి థ్యాంక్స్ చెప్పి గౌరవపూర్వకంగా సాగనంపటం మన బాధ్యత. పైగా మీది సత్సంప్రదాయ బద్ధమైన కుటుంబం... పద ఆయన్ని సాగనంపి వద్దాం..."

"మీరు వెళ్ళండి, రైలు బయలుదేరే సమ

యానికల్లా నేను స్టేషన్‌కి చేరుకుంటాను. ఇంకాస్సేపు నాకు ఒంటరిగానే గడపాలనిపిస్తోంది. ప్లీజ్ నన్ను వదిలెయ్యండి" వేడుకుంటున్నట్లుగా అన్నాడు వివేక్.

నాకేం చెప్పాలో తోచలేదు. అతనికి మరోసారి హితబోధ చేయాలనిపించింది. అయితే అంతకు మించి చెప్పటానికి నా వృత్తిపరమైన స్వాభిమానం అడ్డొచ్చింది. డేవిడ్ మాత్రం వివేక్ పక్కనే కూర్చుని అతనికి నచ్చ చెప్పసాగాడు.

"చూడు వివేక్, మన వర్తమానం మీద భూత కాలం రాజ్యమేలకూడదనీ, అదే జరిగితే మనకు భవిష్యత్తే వుండదని నీకు ఎన్నో మార్లు చెప్పాను. నా భార్య నన్ను మోసం చేసి తనంతట తనే వెళ్లిపోయింది. నీ భార్య అలా చెయ్యకుండా నీతోపాటు ఈ ప్రపంచాన్నే శాశ్వతంగా వదిలేసింది. నన్ను చూడు, నేనెలా గుండ్రాయిలా బతుకుతున్నానో...? ఒంటరిగానే అయిదేళ్ళు గడిపేశాను. మన జీవితం ఇంకొకరి అస్తిత్వంపై ఆధారపడకూడదు. మనం మనకోసమే బతకాలి. మిత్రమా నీవు గుండెల్లో దాగిన బాధనంతా క్రోడీకరించి, గేయాలు, పాటలు రాయాలి. నేను దానికి గిటార్ వాయిస్తాను. సాహిత్య సంగీతాల సమ్మేళనంలో మన దుఃఖాల్ని మరచిపోదాం. ఇంతకు మించి ఇంకేం చెప్పమంటావ్! సాయంత్రం స్టేషన్‌కొచ్చి సక్సేనా గారికి సెండాఫ్ ఇవ్వటం నీ ధర్మం..."

నేను, డేవిడ్ అక్కడ్నుంచి బయల్దేరాం. వివేక్ అక్కడే అలాగే కూర్చుండిపోయాడు. నేను అతను కనిపించేదాకా అప్పుడప్పుడు వెనక్కి తిరిగి తిరిగి చూస్తూ వున్నాను. అతను అదే భంగిమలో అలాగే నిశ్చలంగా కూర్చుని మునుపటి మాదిరిగానే శూన్యంలోకి చూస్తూ వున్నాడు.

## డేవిడ్

స్మశానంలో కూర్చుని శూన్యాన్ని చూస్తూ గడపటం వల్ల పోయిన వాళ్ళు తిరిగొస్తారా? ఈ వివేక్‌కు కొంచెం కూడా వివేకం వున్నట్లు లేదు.

ఈవాళ ఆ స్మశానం నుంచి తిరిగొచ్చాక నాకు వివేక్ గురించి ఒకటే చింత. అతను అర్ధరాత్రి వరకు అక్కడే కూర్చుని వుంటాడు. నేనతనికి చేసిన హితోపదేశాలూ, చెప్పిన ధైర్యవచనాలన్నీ వ్యర్థంగా మిగిలాయి.

ఆరోజు అర్ధరాత్రి వేళ హఠాత్తుగా అతని తల్లిదండ్రులు నా ఇంటికి వచ్చారు. కొడుకు ఇంకా ఇంటికి రాలేదని కంగారుపడుతూ చెప్పారు.

ప్రేమా వాళ్ళింటికి ఫోన్ చేశాం. ఆమె తల్లిదండ్రులు కూడా చాలా కంగారుపడ్డారు. ఆ అర్ధరాత్రి వేళలోనే వారుకూడా హడావిడిగా వచ్చారు.

ఈ రెండు కుటుంబాలకూ ఇప్పుడు మిగిలిన ఏకైక ఆశాకిరణం వివేక్. మరి ఆ ఆశాకిరణం కంటికి కనిపించకపోతే వారు కంగారుపడకుండా ఎలా ఉండగలరు? వారి ఈ కంగారును ఆ నలుగురు ముసలివాళ్ళ కళ్ళల్లో అనేకసార్లు స్పష్టంగా చూశాను. దానిని విశ్లేషించటానికి యత్నించాను.

ఈ కంగారుకు మూల కారణమేమిటి? తమ తదనంతరం, తమ ఆస్తిపాస్తులకు వారసుడు లేకపోతే అవన్నీ అనాధమయిపోతాయన్న భయమా?

లేక పోగొట్టుకున్న ప్రేమను వివేక్‌లో చూసుకోవాలనే తాపత్రయమా? లేక ఆమె జీవించి వున్నంతకాలం ఆమెను కంటికి రెప్పలా చూసుకున్నందుకుగాను ప్రదర్శిస్తున్న కృతజ్ఞతా భావమా?

మేం ఐదుగురం ప్రేతాల్లా అర్ధరాత్రి వేళ స్మశానంలో ప్రవేశించాం. నేను చేతిలో టార్చి పట్టుకుని చీకట్లో దారి చూపుతుం

డగా నలుగురు పెద్దవాళ్ళు నన్ను అనుక రిస్తూ వచ్చారు. టార్చి వెలుగులో వివేక్ కూర్చున్న చోటును కనుగొన్నాం.

నా ఊహ నిజమయింది. ఊహించినట్టు గానే వివేక్ అదే రావి చెట్టు మొదలుకు ఆనుకుని వున్న పుట్ట పక్కనే గల శిథిల సమాధిపై కూర్చుని వున్నాడు. అతను కూర్చున్న భంగిమ ఇంకా నా స్మృతి పథం లోనే ఉంది. హఠయోగంలో సమాధిస్థితిలో వున్న సన్యాసిలా వున్నాడతను. అతని కళ్ళు నిప్పుకణికల్లా ఆ చీకటి రాత్రిలోనూ మెరుస్తూ వున్నాయి.

నా విషయం అటుంచితే, ఆ నలుగురు పెద్దవాళ్ళకు కూడా అతను వివేకో కాదో అన్న అనుమానం కలిగింది. అతడే వివేక్ అని అర్థమయ్యాక ఆశ్చర్యపోయారు.

అయితే వివేక్‌కి ఆ సమయంలో మమ్మల్ని అక్కడచూసి ఆశ్చర్యమూ కలగ లేదు. భయమూ కలగలేదు. ఎటోచూస్తూ కూర్చున్న ఆ మనిషి స్పృహలో ఉన్నాడో లేడోననిపించింది. నిజానికి చాలా సేపటివ రకు అతను మా ఆగమనాన్ని గుర్తించనే లేదు.

అతన్ని కన్న తల్లిదండ్రులు సైతం అతన్ని సమీపించటానికి, తాకటానికి, పలక రించటానికి వెనుకంజ వేశారు. చివరికి నేనే ముందడుగు వేశాను.

వివేక్‌ను పలకరించాను. ఇంటికి రమ్మని పిలిచాను, వేడుకున్నాను, భయపెట్టాను, అభ్యర్థించాను, పట్టుబట్టాను.

అయినా అతను చలించలేదు, కరగలేదు, భయపడలేదు. ఆరాత్రి నేనుకూడా అతని దగ్గర ఉండాలని మొండిపట్టు పట్టాడు.

చివరికి అతని మొండితనమే గెలిచింది. "నేను అతనికి తోడుగా రాత్రంతా ఉంటాను. మీరంతా ఇంటికి వెళ్ళిపోండి" అంటూ పెద్దవాళ్ళకు నచ్చజెప్పాను.

"వాడు ఏ అఘాయిత్యం చేసుకుం టాడో...!!" వివేక్ తల్లి మనసులోని భయాన్ని బయటపెడుతూ వెక్కివెక్కి ఏడి చింది.

ఆ నిశ్శబ్ద చీకటిరాత్రిలో ఆ తల్లి ఏడుపు హృదయవిదారకంగా ప్రతిధ్వనించింది.

ఆ నలుగురు పెద్దల భయాన్నీ, బాధల్నీ నేను గమనించి వారికి భరోసా ఇచ్చాను. "ఏమీ కాదు మీరు నిశ్చింతగా వెళ్ళండి. అతను బయలుదేరేంత వరకు నేను ఇక్కడే వుండి అతన్ని నా వెంట పిలుచుకువస్తాను. అతన్ని జాగ్రత్తగా, క్షేమంగా ఇంటకి చేర్చే బాధ్యత నాది" అన్నాను.

"పాపం, నిన్ను చాలా ఇబ్బంది పెడు తున్నాం బాబూ..." అంటూ వివేక్ తండ్రి సంకోచంతో ఏదో అనబోతుండగా నేను మధ్యలోనే అడ్డుకున్నాను. "మరేం ఫరవా లేదు అతని ప్రాణమిత్రుడుగా ఇది నా కర్తవ్యం. మీరు నిశ్చింతగా వెళ్ళండి. ఈ అర్ధరాత్రి వేళ మీరిక్కడ ఎక్కువసేపు ఉండటం మీ ఆరోగ్యానికి మంచిది కాదు" వాళ్ళను బలవంతపెట్టాను.

వాళ్ళు నా అభ్యర్థన విని అక్కడ్నించి వెళ్ళిపోయారు.

టార్చి వెలుగులో నలుగురు విషాదమూ ర్తులూ స్మశానపు కాలిబాటలో కరిగిపో యారు.

ఆ తరువాత మిగిలింది గాఢాంధకారం...

వివేక్‌కు నాకూ మధ్య పరుచుకున్న ఆ గాంఢాంధకారాన్ని ఏ మాటలతో వర్ణిం చను. హఠాత్తుగా అతను నన్ను అశ్రునయ నాలతో చూసి మోకాళ్ళలో ముఖం దాచు కుని వెక్కివెక్కి ఏడవసాగాడు. అతన్ని దగ్గ రికి తీసుకుని ఓదార్చాను.

"వివేక్! మృత్యువు కన్నా భయంకరమై నది మరణస్మరణం. ముసలితనం, రోగం,




చావులను ఎదురు ప్రశ్నించకుండా మౌనంగా అంగీకరించడమే మన కర్తవ్యం. నువ్వొక తత్త్వశాస్త్ర విద్యార్థివి. నీకు నేను చెప్పాల్సిన అవసరం లేదు. మన ఊహలూ, కోరికలను కాలరాస్తూ హఠాత్తుగా జరిగిపోయిన వాటిని బలవంతంగా అరిగించుకుని జీవితంలో రాజీ పడకతప్పదు..."

"ఎలా...? ఎలా రాజీ పడాలి...? కళ్ళు మూసినా తెరిచినా ఆమె రూపమే కనిపిస్తోంది. ఏవైపు చూసినా ఆమె రూపమే కళ్లముందు మెదులుతోంది. ఈ ఘోరం ఎందుకు జరిగింది? ఇది జరగకుండా వుంటే బావుండేది. నా ప్రేమ ఇక ఈలోకంలో లేదు అనే సత్యాన్ని నేను నమ్మలేకుండా వున్నాను. ప్రేమ వియోగంతో నా హృదయం మండుతున్న పెనం మీద పెట్టినట్టు దహించుకుపోతోంది. ఊళ్ళో నేను ప్రేమతో కలిసి తిరగని చోటులేదు. ఏ ఇల్లు, రోడ్డు, సందు, పార్కులోకి వెళ్లినా ఆమె జ్ఞాపకాలే నన్ను వెంటాడుతున్నాయి. నా హృదయాన్ని గుప్పిట పట్టి పిండి వేస్తున్నాయి. ఒక్క ఈ స్మశానంలో తప్ప నాకెక్కడా మనశ్శాంతి దొరకడం లేదు" వివేక్ మాట్లాడుతున్న ఒక్కొక్క మాటలోనూ ప్రపంచంలోని బాధలన్నీ దాగివున్నట్టు అనిపించింది.

"వివేక్, ఒక మాట అడగనా...?" నేను సంశయంగానే అడిగాను.

"అడుగు..." వివేక్ మాటలో అదే నిర్లిప్తత!

"నీ బాధలకు నా దగ్గర ఒక పరిష్కారం వుంది. నీకు ఇష్టమైతే నువ్వు దాన్ని ఆచరణలో పెట్టగలిగితే నీ శోకపు పరిమాణం కొంచెమైనా తగ్గుతుందని నా నమ్మకం..."

నా మాటలకు వివేక్ విరక్తిగా నవ్వాడు.

"డేవిడ్, నువ్వు చెప్పబోయే ఆ పరిష్కారమేమిటో నేను వూహించగలను. నా ప్రేమను మరచిపోవటానికి మరో స్త్రీని అన్వేషించమంటావు, ఆమెను వివాహం చేసుకోమంటావు. నన్ను ఆ స్త్రీనుంచి ప్రేమను ఆశించమంటావు. ఆమె ప్రేమ కోసం నేను నిరీక్షించాలి. మా శరీరాలు ఏకం కావటానికి మరో హనీమూన్... మరో కులూ... మరో మంచుపర్వతం... ఓహ్... భగవంతుడా... నాకు మరో శిక్ష వద్దు. నాకేమీ అక్కర్లేదు. నా మానాన నన్ను వదిలేయ్..."

"లేదు వివేక్... నేను చెప్పబోయే పరిష్కారం అదికాదు..."

"అది కాదా...?" వివేక్‌లో ఒకింత ఆశ్చర్యం!

"అది కాదు... మరొకటుంది..."

"పరిష్కారం ఏదైనా ఫరవాలేదు. అయితే ఆడదాని ప్రమేయం లేని పరిష్కారం అయితేనే చెప్పు..."

"అది సాధ్యంకాదు వివేక్... మగవాడి జీవితంలో ముఖ్యమైన సమస్య ఆడది అయినప్పుడు దాని పరిష్కారం కూడా ఆడదే అవుతుంది. ప్రశ్న ఆమెతో ఉత్పన్నమైనప్పుడు సమాధానం కూడా ఆమెతోనే దొరుకుతుంది. పాపమూ ఆమే అయినప్పుడు పుణ్యమూ ఆమే... ఉచ్ఛ్వాసమూ ఆమే, నిశ్వాసమూ ఆమే..."

"డేవిడ్ అర్థమయ్యేట్టు చెప్పు"

"అదే చెప్పబోతున్నాను. రాత్రి అసంపూర్ణంగా వుంటే దాన్ని చీకటితో నింపి సంపూర్ణం చెయ్యవలసి వుంటుంది. నువ్వు చీకటిని నింపుతూ పోయినట్టల్లా నీ హృదయపు ఖాళీల్లో నిశ్చింతపు వెలుతురు చోటు చేసుకుంటుంది. ప్రేమ మరణించింది కదా ఆమె అనురాగం, అందచందాలు, సుగుణాలన్నిటినీ తుడిచి వేసి, వాటి స్థానంలోనే ఆమెలోని అవగుణాలన్నిటినీ పట్టిక రాయి. ఆమెను చెడుదానిగా భావించుకో..."

వివేక్, చీకట్లోనూ మెరుపులా గబుక్కున

నావేపు తిరిగాడు... షాక్ కొట్టినవాడిలా...

గాయపడ్డవాడిలా...

నావేపు తీక్షణంగా నిలువునా కాల్చివేసే వాడిలా చూశాడు.

నేను అవాక్కయ్యాను.

మరణించిన ప్రియురాలిని చెడ్డదానిలా వూహించుకోగలిగిన కఠిన హృదయం అతనికి లేదు. దుష్టులనే దుష్టులుగా భావించలేనంతటి సాత్వికుడతను. అలాంటిది తను మనసారా ప్రేమించే ప్రాణసఖిని ఓ చెడు స్త్రీగా ఎలా అనుకోగలడు. అతని కళ్లల్లో ఇవే భావాలు నాకు కనిపించాయి. నేను చెప్పినట్టు చెయ్యటం తనకు సాధ్యం కాదన్నట్టు అతను తల వంచుకున్నాడు.

అయినా నేను నా ప్రయత్నాన్ని మానలేదు. "అది నిజం కాకపోయినా ఊరికే అలా అనుకో, ఊరికెనే వివేక్... అందని ద్రాక్షపళ్ళు పుల్లన... అనే మాట వినే వుంటావ్. మనం పోగొట్టుకున్న వస్తువు అంత విలువైనది కాదు అనుకున్నప్పుడు మనలో వేదన తగ్గి మరవటం కాసింత సులభంగా మారుతుంది. మనకు అత్యంత ఆప్తులైన వారిని మనం పోగొట్టుకున్నాం అనే భావన మన మనసులోంచి బయటికి నెట్టగలిగితే మనలో గూడు కట్టుకున్న ఆవేదననూ బయటికి తోసేసినట్టవుతుంది. నా ప్రతిపాదనను ఆచరణలో పెట్టి చూడు. ప్రస్తుత పరిస్థితిలో అదొక్కటే నీకు వూరట కలిగించే విషయం..."

వివేక్ మరోసారి విరక్తిగా నవ్వాడు. అతనికి నా ప్రతిపాదన పిచ్చివాడి వాగుడులా అన్పించి వుండాలి. నావేపు బేలగా చూస్తూ అన్నాడు.

"డేవిడ్ నామీద జాలిపడి నువ్వీమాటల్ని అంటున్నావని నాకు తెలుస్తూనే వుంది. నిజానికి మన మనసులో చెలరేగే భావోద్రేకాలను మన ఇష్టానుసారం మనసులో వుంచుకోవటం, ఇష్టంలేనప్పుడు బయటకు పారదోలటం అనేది మనం చెయ్యగలిగితే, అలా చెయ్యటం ద్వారా మన జీవితంలోని సుఖదుఃఖాల స్వరూపాన్నే మార్చుకోగలిగితే ఎంత బాగుండేది?

"డేవిడ్... నామీద ప్రేమతో నువ్విచ్చిన సలహాకు థాంక్స్... ఏం చెయ్యను ప్రేమలో చెడుగుణాలని నేను కలలో కూడా వూహించలేను. ఆమెలో లేని అవగుణాల గురించి నేనెలా వూహించుకోను? "

వివేక్ జవాబు విని నేను నిరుత్తరుణ్ణయ్యాను.

కొద్దిసేపటి వరకు మవునంగా అతన్ని చూస్తూ వుండిపోయాను.

వివేక్ కూడా మరేమీ మాట్లాడలేదు.

స్మశానంలో ఎక్కడో గుడ్లగూబ కూస్తున్న కూత వినిపించింది.

కీచురాళ్ళు ఒకే స్థాయిలో రొద పెడుతూ వున్నాయి.

మాటల మాయాజాలంలో పడి మేం వాస్తవలోకాన్ని పూర్తిగా మరచిపోయాం.

ఇప్పుడు మేమున్నది ఏ లోకంలో?

భ్రమల లోకమా?

ప్రేతాత్మల ప్రపంచమా?

అబద్ధాల లోకమా?

లేక సత్యలోకమా?

మనిషి తన ఆలోచనలతో, సిద్ధాంతాలతో ఎన్ని రకాల లోకాల్ని సృష్టించుకోగలడు?

నేను ఓడిపోలేదు. కాస్సేపు నేను మౌనంగానే వున్నా నేను చెప్పవలసిన మాటలకు మనసులో పదును పెడుతూ వుండిపోయాను. వివేక్‌వంటి గొప్ప ప్రేమికుడి మనస్సు మార్చటానికి ఆమాత్రం కసరత్తు తప్పదు. చివరికి నేను నోరు విప్పాను.

"లేదు వివేక్... మనిషి అన్న తరువాత అవగుణాలు వుండకుండా పోవు. ప్రేమకు కూడా ఒకటో, రెండో అవగుణాలు వుండ కుండా పోవు. వాటిని అవగుణాలని పిల వటం నీకు ఇబ్బంది అనిపిస్తే 'బలహీనత' లని చెప్పుకో. ఆమెలో కనీసం ఒక్క బలహీ నత అయినా..."

వివేక్ నా మాటల్ని మౌనంగా విన్నాడు. అతను నా మాటల మాయాజాలంలో ఇరు క్కుంటున్నాడని నాకు నమ్మకం కలిగింది. ఉత్సాహంగా నా మాటల్ని కొనసాగించాను.

"ఎలాంటి బలహీనతలు లేని మనిషి ఈ సృష్టిలోనే లేడని నా ప్రగాఢ విశ్వాసం. ప్రేమ, అప్యాయతల మాయ కమ్మటంతో మన ఆప్తుల్లో వున్న బలహీనతలు మనకు కనపడకపోవచ్చు అయితే నిర్మొహమా టంగా మన మధ్య వున్న సున్నిత బంధాల్ని పక్కనపెట్టి మోహరహితంగా, నిర్లిప్తంగా, నిశితంగా చూస్తే మన ఆప్తుల్లో వున్న బల హీనతల్ని కూడా ఖచ్చితంగా తెలుసుకో వచ్చు బాగా ఆలోచించి చెప్పు "ప్రేమలో కనీసం ఒక్క బలహీనతనైనా నువ్వు గమ నించలేదా? " కుతూహలంగా అడిగాను.

వివేక్ వెంటనే లేదన్నట్టు తల అడ్డంగా వూపాడు.

నేనన్నాను "నాకు నా భార్య స్టెల్లా బల హీనతలన్నీ తెలుసు. పెళ్ళికి ముందువీ పెళ్ళి తరువాతవీ కూడా. అదంతా తెలిసి కూడా నేనామెను పెళ్ళి చేసుకున్నాను. నా ప్రియమైన వివేక్! సృష్టిలో ఎవరూ పరిపూ ర్ణులు కారు. పరిపూర్ణత కలిగిన సంబం ధాలు ఎవరికీ లభించవు. ప్రతీవాటిలో ఎంతో కొంత వెలితి తప్పక వుంటుంది. ప్రతీ ఒక్కనిలో ఏదో ఒక లోపం వుండేవుంటుంది. ప్రపంచంలోని సంబంధా లన్నీ ఏదో ఒక పర్సెంటేజీలో, నిష్పత్తిలో మనం చేసుకునే ఒప్పందాల ఆధారంగా మనుగడ సాగిస్తున్నవే."

వివేక్ మౌనంగా నా మాటలు వినసా గాడు.

"ఈ సంబంధాలు 50:50, 40:60, 30:70, నిష్పత్తిలో వుంటే బతుకు బండిని ముందుకు లాగవచ్చు

అయితే ఆ నిష్పత్తి 20:80, 10:90 లేక 5:95 అయినపుడు పొందిక కుదరదు. సంబంధాలు నిలవవు. సంసారాలు సాగవు. దానికి చక్కటి ఉదాహరణ మా సంసా రమే. మా ఇద్దరిది నేను చెప్పిన నిష్పత్తుల్లో చివరిది. అంటే 5:95. అందుకే మా పొందిక అమరలేదు. సంబంధం నిలవ లేదు. సంసారం సాగలేదు. మా సంసార జీవితం మూణ్నాళ్ళ ముచ్చటగా మారింది. ఒకవిధంగా నీ పరిస్థితికి, నా పరిస్థితికి పెద్ద తేడా ఏమీ లేదు. నీ భార్య మరణిం చింది. నా భార్య లేచిపోయింది. ఒక కోణంలోంచి చూస్తే నీ పరిస్థితికన్నా నా పరిస్థితి ఎక్కువ బాధాకరమైనది. భార్యా వియోగం నిన్ను ఒక్కసారి చంపితే, నా భార్య చేసిన పని నన్ను క్షణక్షణం చంపు తూనే వుంది. నువ్వు రేపో మాపో ఈ బాధనుంచి విముక్తి పొందగలవు. నాకు ఆ అదృష్టం కూడా లేదు"

'నిజమా' అన్నట్టు వివేక్ నావేపు చూశాడు.

"అవును ఈ జీవన్నాటకంలో మరణిం చిన వారిమీదికి శాశ్వతంగా ఓ చివరి తెర లాగబడుతుంది. తర్వాత ఎన్ని అంకాలు నడిచినా అవన్నీ తెరవెనక చీకట్లో కరిగిపో తాయి. బతికివున్నవాళ్ళ విషయంలో అలా కాదు. నన్ను వదిలి ప్రియుని వెంట పారి పోయిన స్టెల్లా శాశ్వతంగా కనుమరుగుకా లేదు. ఆమె మళ్ళీ నాకు కనపడవచ్చు అనూహ్యమైన స్థితిలో ఆమె నాకు ఎదురు పడవచ్చు ఇదొక రకమైన అసంపూర్ణత. మరణం ఇవ్వగలిగే పూర్ణత ఇక్కడలేదు.



నేను భవిష్యత్తులో ఏమేమి చూడాల్సి వస్తుందో.

“మైసూరు మహారాజ ప్యాలెస్ వెలుగులో స్టెల్లా రాబర్ట్‌ల జంటను చూడవలసిరావచ్చు ఆ దృశ్యం నాకు రంపపు కోతగా పరిణమించవచ్చు

నేను కోరి వరించిన స్త్రీ నా వద్ద సంగీతం నేర్చుకుంటున్న శిష్యుని భార్యగా నాకు కనపడటంకన్నా నరకం ఇంకేముంటుంది?

“ఆమె ఓ పరాయి మగవాడికి భార్యగా కనబడటం నరకం అనుకుంటే, అలా కాక ఆమె రాబర్ట్‌వల్ల వదిలివేయబడి వీధిపాలైన స్టెల్లాగానో, వేశ్యగా మారిన స్టెల్లాగానో, రాబర్ట్‌ని వదిలేసి మరో మగాడితో సంసారం సాగిస్తున్న స్టెల్లాగానో కనబడితే అది మరింత దారుణం.

“నా మదిలో స్టెల్లా భవిష్యత్తు రూపాలు చిత్రవిచిత్రంగా కనిపిస్తున్నాయి. ఒక్కొక్క సారి ఆమె శ్రీమంతురాలైన స్టెల్లా, బిక్షగత్తెగా మారిన స్టెల్లా, ఒంటినునుపు మాసిపోయిన స్టెల్లా, ఇలా ఆమె రకరకాల రూపాలు కళ్ళముందు మెదులుతున్నాయి.

“మరోసారి ఆమె నాకు ఆస్పత్రిలోనో, రైల్వే స్టేషనులోనో, ఎయిర్‌పోర్టులోనో, టాక్సీలోనో, ఆటోలోనో, ఫుట్‌పాత్ మీదనో- ఒంటరిగానో, పిల్లలతోనో నాకు ఎదురు కావచ్చు ఎందుకంటే ఆమె ఇంకా బతికే వుంది. ఆమె బతికి వున్నంతవరకు ఇలా ఎన్నో రకాలుగా జరగటానికి అవకాశాలు వున్నాయి.

“అదే ప్రేమ విషయానికి వస్తే, ఆమె పడిపోయిన ఆ కులూ లోయలనుంచి ప్రాణాలతో లేచి రావటం సాధ్యమా? అసాధ్యం! ప్రపంచ రంగస్థలంపై ఆమె పాత్ర శాశ్వతంగా ముగిసింది. ఇప్పుడు మూసేసిన రంగస్థలం, దించిన తెర ముందు ఎదురు చూస్తూ కూర్చోవలసిన




అవసరంలేదు"

నా సుదీర్ఘ ఉపన్యాసం విని గాఢంగా నిట్టూరుస్తూ వివేక్ అన్నాడు. "కాని నాకలా అనిపించటం లేదు డేవిడ్. ఇంకా ఏదో అంకం మిగిలే వుందని అనిపిస్తోంది. తెర తొలగిపోవచ్చుననిపిస్తోంది. సైడ్ వింగ్ నుంచి సూత్రధారుడు రావచ్చు. నాకు రంగు పూయవచ్చు. వేషం వేయించొచ్చు. అభినయించమని బలవంతంగా నన్ను వేది కమీదికి తోయవచ్చు"

"అర్థమయ్యింది. హనీమూన్‌లో మధన ప్రేమావస్థలో, ఆ స్వప్న లోకాల్లో విహరి స్తుండగా భార్యను పోగొట్టుకోవటంవల్ల ఏర్పడిన అసంపూర్ణతను నీ మనసు అంగీక రిస్తున్నట్టు లేదు. అంటే నువ్వు జీవితంలో ఏదో వెలితిని ఫీలవుతున్నావు. కాని అది వెలితి కాదు, కేవలం నీ భ్రమ. ఇప్పుడిప్పుడే జీవితాన్ని ప్రారంభించిన భావుకుడివి నువ్వు. ఆరంభంలోనే చూచిన అంతాన్ని నీ భావుకుడి మనస్సు అంగీకరించటంలేదు. అంతే! గాయమంటే ఏమిటో తెలియని నీ మనస్సు తీవ్రంగా గాయపడింది. ఈ గాయాన్ని కాలమే మాన్పుతుంది. కాలం నీకు జీవన పాఠాలు నేర్పుతుంది. ఆ తర్వాత నువ్వు రాత్రిళ్ళు స్మశానంలో వచ్చి కూర్చోవు. మానస గంగోత్రిలో నుంచుని సూర్యోదయాన్ని చూస్తూ పక్షుల కిలకిలర వాలు వింటూ సరికొత్త ఉషోదయానికి స్వాగతం పలుకుతావు"



తెల్లవారింది.

ఆ స్మశానానికి తెల్లవారింది.

పక్షులు పాటలు పాడాయి.

చెట్ల ఆకులపై పేరుకొన్న మంచుబిందు వులపై సూర్యుడు తన కిరణాలను నాలు కల్లా చాచి దాహం తీర్చుకోవటానికి ప్రయ త్నిస్తున్నాడు.



సమాధులు సూర్యోదయపు వెలుతురులో మెరిసిపోతూ చిరునవ్వులు చిందించాయి.

మేము ఇద్దరం లేచి నుంచున్నాం.

గడచిన రాత్రి విశ్వపర్యటన చేసిన అనుభూతి నాకు కలిగింది.

"వివేక్, నన్ను ఒకే ఒక ప్రశ్న వేధిస్తోంది. దీన్ని ప్రశ్న అనటం కన్నా అనుమానం అంటే బావుంటుందేమో"

"అనుమానమా? బహుశా నీ మీద కూడా ఆ ఇన్‌స్పెక్టర్ సక్సేనా ప్రభావం పడినట్టుంది" వివేక్ వెంటనే జవాబు చెప్పటం నాకు వూరటనిచ్చింది.

"అబ్బే, అలాంటిదేంలేదు. అనుమానానికి, ఆ సక్సేనాకూ ఎలాంటి సంబంధం లేదు"

"మరి..."

"నువ్విప్పుడు స్మశానానికి వచ్చి కూర్చోవటంలో ఒక అర్థం వుంది. ఒక వుద్దేశ్యం వుంది. శోకభారంతో కుంగిపోతున్న నీకు మరెక్కడా శాంతిదొరక్క ప్రశాంతతకోసం ఇక్కడికి వచ్చావని వూహించవచ్చు అయితే..."

"అయితే...? " వివేక్ రెట్టించాడు.

"అయితే... ఆరోజు నీ పెళ్ళిరోజు... ఇక కాస్సేపట్లో నువ్వు ప్రేమ మెడలో తాళికట్టవలసి వుండగా అందరూ నీకోసం ఎదురు చూస్తున్నప్పుడు నువ్వు హఠాత్తుగా పెళ్ళి మంటపం నుంచి మాయమైపోయావు. జ్ఞాపకం వుందా? ఆ రోజు మీ ఇంటివారు. ప్రేమ ఇంటివారు ఎంతో కంగారు పడ్డారు. నేను నీ కోసం వూరంతా గాలించి చివరికి నిన్ను కనుక్కున్నది ఈ స్మశానంలోనే. ఎందుకలా చేశావు వివేక్ అది నీ పెళ్ళిరోజున స్మశానానికి ఎందుకొచ్చావ్. అందులోనూ ముహూర్తం దగ్గర పడుతున్న సమయంలో స్మశానానికి రావటం సమంజసమేనా? రాహుకాలం సమీపిస్తుందని పురోహితులు ఎంతగా కంగారు పడ్డారో తెలుసా? బంధువులందరికీ ఆశ్చర్యంతో నోటమాట రాలేదనుకో కొందరైతే నీమీద అనుమానపడ్డారు కూడా నాకూ ఆశ్చర్యమేసింది. నువ్వు ఎందుకలా చేశావు. నువ్వలా చెయ్యటానికి బలమైన కారణమే వుందనుకుంటాను"

నా ప్రశ్నకు వివేక్ నింపాదిగా జవాబు చెప్పాడు.

"ఉంది. కారణం ఉంది. ఆ రోజున హఠాత్తుగా నా మనో భూమిలో ఓ కవిత మొలకేసి చిగిర్చింది. కవి కావ్యప్రసవం ఆగేది కాదు. వివరించటానికి సాధ్యమూ కాదు. కవితా ప్రసవానికి ఏకాంతం కావాలి. ఒంటరికోకిల గానం వినాలి. కాని అవన్నీ వివాహ మంటపంలో దొరికేవి కాదు కదా. అప్పుడు నాకు గుర్తు వచ్చింది ఈ స్మశానమే. ప్రపంచంలో స్మశానం కన్నా ప్రశాంతమైన చోటు మరొకటి లేదు కదా. అందుకని ముహూర్తం దగ్గర పడుతోందన్న విషయం కూడా మరిచిపోయి నేనిక్కడికి చేరుకుని కావ్య రచనలో మునిగిపోయాను"

"కవులు ఎన్ని కారణాలనైనా సృష్టించుకోగలరు కదా? " అన్నాను.

"అలాంటిదేం లేదు డేవిడ్. నేను చెప్పింది సాకు కాదు. నిజం చెప్పాలంటే అదొక ప్రసవవేదన లాంటి స్థితి. ఓ తల్లి తన కడుపులో దాచుకున్న బిడ్డను కనటానికి పడే బాధలా, గాయపడి బంధింపబడ్డ పులి బోనులో స్వేచ్ఛకోసం విలవిల్లాడుతూ అనుభవించే వేదనలా, కావ్యోదయానికి మునుపు కవి కూడా విచిత్ర వేదనను అనుభవిస్తాడు. తల్లి బిడ్డను కన్నాక, పులి బోనులోంచి విడుదలైనప్పుడు ఎలాంటి ప్రశాంతతను పొందుతారో కవి కూడా కావ్య రచనానంతరం అలాంటి సంతృప్తినే పొందుతాడు. ఆ లెక్కన చూస్తే కవి సుఖజీవి




కాదు..."

"వివేక్, నువ్వంతగా కష్టపడి రచించిన ఆ అపురూప కావ్యాన్ని ఒకసారి వినిపించవా? "

నేను కుతూహలంగా అడిగాను.

"లేదు అది ఇంకా అసంపూర్తిగానే వుంది. అయితే అది పూర్తయ్యే ఘడియ దగ్గర పడిందిలే. ఆ కావ్యాన్ని ముగించిన తర్వాత ముందుగా నీకే వినిపిస్తాను" శూన్యంలోకి చూస్తూ అన్నాడు.

అలా ముగిసిన స్మశానంలోని మా అనుభవాలను నెమరువేసుకుంటూ వుండిపోయాను.

రాజీవ్ సక్సేనా పోలీసు ఆలోచనలకు, ఆలోచనా సరళికి, మాటలకూ, మా ఇద్దరి ఆలోచనలకు, ఆలోచనాసరళికి, మాటలకు ఎంత వ్యత్యాసం! ఈ మాటల్లోని ఒక వాక్యమైనా అతనికి అర్థమవుతుందా?

మన సమాజంలో దాగి వున్న విశిష్టత ఇదే! మిలియన్ల జనాలకు మిలియన్ల సంవేదనలు. ఒక్కొక్కరిది ఒక్కొక్కరకమైన వేదన! ఒకడు పకపకా నవ్వుతూ వుంటే వాడి పక్కనే వున్నవాడు కన్నీరు మున్నీరుగా విలపిస్తూ వుంటాడు. ఒకతె తన రూపలావణ్య యవ్వనాల మదంతో మగవాళ్ళను మరులు గొలుపుతూ వుంటే, మరొకతె మగవారిపట్ల జగుప్సతో అంతర్ముఖిగా మారుతూ వుంటుంది.

ప్రేమ మరణాన్ని వెన్నంటి వచ్చిన సక్సేనా సంవేదన కేవలం చట్టపు పరిభాషకు చెందింది. అతను తన వృత్తిలోని అనుభవాన్నంతా పోగుచేసుకుని వెదుకుతూ వచ్చింది ఆ సంవేదనతోటే... అయినా నా వేదనేమిటి? వివేక్ ది? స్టెల్లాది? రాబర్ట్ది? సిటీబస్ డ్రైవర్ రాజుది? అగరొత్తుల ఫ్యాక్టరీ కార్మిక మహిళలది? సమాజం ఎన్నిరకాల సంవేదనలను తన నిర్మాణంలో వాడుకుంటోందో? విరుద్ధ సంవేదనలతో జీవించే మనుష్యుల్ని ఒక చోట చేర్చి తమాషా చూస్తోంది.

ఈవాళ ఇన్స్పెక్టర్ సక్సేనా వెళ్ళిపోయే రోజు. వివేక్ని ఇంటికి చేర్చాక సక్సేనా బస చేసిన లాడ్జికి చేరుకున్నాను.

నేను వెళ్ళేసరికి సక్సేనా తన సామాన్లు సర్దుకుంటున్నాడు. సామాన్లు త్వరత్వరగా ప్యాక్ చేసినందువల్ల కాబోలు ఆయన నుదుటిపై చెమటపట్టింది.

"హిమాచలప్రదేశ్ తో పోల్చుకుంటే మా మైసూరులో వేడి ఎక్కువే కదూ? " అన్నాను వెనకనుంచి.

ఆయన నావైపు తిరిగి నవ్వుతూ జేబురుమాలుతో నుదురు తుడుచుకొన్నాడు.

"అవును డేవిడ్, ఇక్కడ వేడి ఎక్కువ. బయటనే కాదు మనసులోనూ వేడిగానే వుంది" అంటూ నవ్వాడు.

"మీ వూరికి చేరుకోగానే అంతా సర్దుకుంటుంది" అన్నాను.

"నేను వెళ్ళిపోతున్నాను. ప్రస్తుతానికి నా బాధ తప్పిందని మీకు సంతోషంగా వుందా? " వెక్కిరింపుగా అన్నాడు.

'నిజంగానే సంతోషంగా వుంది' అంటూ గట్టిగా కేకలు పెట్టాలనిపించింది నాకు. అయితే కేకలు పెట్టలేదు. కారణం మా ఇద్దరి సంవేదనలు వేరువేరు కదా? మనసును దాచి, పెదవులమీదికి నవ్వుతెచ్చుకుని.

"మీరు మరో రెండ్రోజులు మైసూరులోనే గడిపివుంటే మైసూరంతా చూపించి వుండేవాడిని..." అన్నాను.

సక్సేనా సూటిగా నా కళ్లలోకి చూసి నవ్వేశాడు. నా మనసులోని అసలు విషయం అతను గ్రహించాడని నాకు అర్థమయ్యింది. నేను మౌనంగా వుండిపోయాను.

ఆ తరువాత రూం లాక్‌చేసి రిసెప్షన్ దగ్గరికి వచ్చాం. సక్సేనా బిల్ సెటిల్ చేశాడు.

## రాజీవ్ సక్సేనా

రూం ఖాళీ చేశాను.

అప్పుడు డేవిడ్ నా వెంటే ఉన్నాడు. వచ్చిన దారికి సుంకం లేదన్నట్టు ఫలితం దక్కని నా ప్రయాణానికి నాకు విసుగొచ్చింది.

నేను డేవిడ్‌తో కలిసి రైల్వే స్టేషన్ చేరుకున్నాను. రైలు బయలుదేరటానికి ఇంకా నలభై అయిదు నిమిషాల సమయముంది. వివేక్ నాకు వీడ్కోలు చెప్పటానికి వస్తాడో రాడో అని అనుమానం కలిగింది. కారణం అతనికి నావల్ల చెప్పలేనంత బాధ కలిగింది. అయితే డేవిడ్ అన్నాడు.

"వివేక్ తప్పకుండా వస్తాడు సార్"

నేను అతనిరాకకోసం నిరీక్షిస్తూ ఎంట్రన్స్ వేపే చూస్తూ అసహనంగా అటు యిటూ పచార్లు చేయసాగాను.

నేను ఎక్కాల్సిన రైలు ప్లాట్‌ఫారం మీదికి వచ్చి నిల్చుంది. నాకు డేవిడ్ కూడా తోడు రాకుండా వుండి వుంటే ఇంతసేపు ఎలా గడపాలో అర్థం కాక విపరీతంగా బోర్‌కొట్టి వుండేదనిపించింది.

"సార్, మీ సత్యాన్వేషణను ఎన్నటికీ వొదులుకోకండి. ఇనుమడించిన ఉత్సాహంతో ఇలాగే మీ వృత్తిలో ముందుకు సాగండి. వాస్తవాలనేవి ఎన్నెన్నో తెరలచాటున దాగి వుండొచ్చు ఏ పుట్టలో ఏ పాముంటుందో ఎవరు చెప్పగలరు? మైసూరు ట్రిప్‌వల్ల ఫలితం దక్కలేదని నిరాశ పడవద్దు. వేల మైళ్ళదూరంనుండి వాస్తవాన్ని కనుక్కోవాలని మీరు జరిపిన ప్రయత్నం మీ కర్తవ్య నిష్టను, పట్టుదలను సూచిస్తాయి. మీ సాహస ప్రవృత్తిని నేను మెచ్చుకోకుండా వుండలేకపోతున్నాను"

నేను అన్నాను.

"లేదు డేవిడ్. మీరు ఊహిస్తున్నంత గొప్పతనం నాకుగాని మా డిపార్ట్‌మెంటుకు గాని లేదు. ఎన్నో సందర్భాల్లో వాస్తవం మనకళ్ళముందే కనపడుతున్నా మా డిపార్ట్‌మెంట్‌కు దృష్టిలోపంతో కళ్ళు కానరావు. సత్యమని నమ్మేస్తుంటాం. 'సత్యం' మా పక్కనే వున్నా పట్టించుకోకుండా అసత్యపు వీపునెక్కి ఊరేగుతుంటాం. ఇలా వేలాది మైళ్ళు ఇలాంటి అన్వేషణలో తిరుగుతుంటాం. ఏదిఏమైనా మా వృత్తి చాలా థ్రిల్లింగ్‌గా వుంటుంది. ఈ ఉదంతాన్ని నా జీవితంలో నీతి పాఠంగానో లేదా గుణపాఠంగానో భావిస్తానా? . భావించను... ఎందుకంటే మా వృత్తిలో ఇలాంటి తప్పటడుగులు సహజం. అంతమాత్రాన కర్తవ్యాన్ని వొదిలేస్తామా? "

డేవిడ్ అన్నాడు.

"ఓసారి నేనూ మనాలి రావాలనుకుంటున్నాను. నిజానికి వివేక్‌తో కలిసే వెళ్ళాలనే ఆలోచన వుండేది. రోరిచ్ మ్యూజియం అంటే నాకెంతో ఇష్టం. ఇద్దరం కలిసి వెళదామని వివేక్ చాలాసార్లు అనేవాడు. కాని వీలుపడలేదు"

"కాని ఎంత విచిత్రమో చూడండి. వివేక్ భార్యతో హనీమూన్ ప్రయాణంలో నగర్‌కి వెళ్ళినా రోరిచ్ మ్యూజియాన్ని దర్శించలేదు" అన్నాను ఆశ్చర్యపోతూ.

"బహుశా వాళ్ళకు సమయం దొరకలేదేమో" డేవిడ్ సరళంగా జవాబు చెప్పాడు.

నేను చప్పున అన్నాను.

"అదేం లేదు... వారికి కావలసినంత టైము ఉంది. వాళ్ళు ఇక్కడ్నుంచి బయలుదేరింది ఆరోతేదీన. ఎనిమిదో తేదీ ఉదయం ఢిల్లీ చేరుకున్నారు. హోటల్ కటీ





ర్‌లో ఒక రోజు వున్నారు. తొమ్మిదో తేదీ రాత్రి కులూకి బయల్దేరి పదవ తేదీ ఉదయం అక్కడికి చేరుకున్నారు. అదే రోజున మణికరణ్ చూసుకుని సాయంత్రం మనాలికి వెళ్ళి హోటల్ బియాస్‌లో రూం తీసుకున్నారు. పదోతేదీ నుండి పధ్నాలుగో తేదీ వరకు వాళ్ళు ఆ హోటల్ రూంలోనే గడిపారు. నాకు ఆశ్చర్యం కలిగేది ఇక్కడే. రోజంతా రూంలోనే ఎందుకు గడిపారు? ఆ సమయంలో నగర్‌కి వెళ్ళి రావచ్చు కదా. వాళ్ళు రోథాంగ్‌పాస్‌కి పదిహేనవ తేదీన బయల్దేరారు. అదేరోజున ప్రేమ మరణించింది"

నేను చెప్పిన వివరాలు విని డేవిడ్ తెల్ల బోయాడు.

"మీ జ్ఞాపకశక్తి అమోఘం సార్, ఎన్ని విషయాలు గుర్తుంచుకున్నారు. మీరు నిజంగానే ఇన్వెస్టిగేషన్ చేయటానికే పుట్టినట్టున్నారు. మీ డిపార్ట్‌మెంటుకు నూటికి నూరుపాళ్ళు సరిగ్గా సరిపోయే ఆఫీసరు మీరు" అని నన్ను ప్రశంసిస్తూ, నా చెవిదగ్గర నోరుపెట్టి "ఇది అన్యాయం సార్, హనీమూన్‌కి వెళ్ళిన జంట నాలుగు రోజులు బయటికే రాకుండా రూంలోపల గడపటం అసహజంగా అనిపిస్తోందా? బయట తిరగాలనే కోరికకన్నా ఏకాంతంలో ప్రేమాభిమానాలను పంచుకోవటంలోనే భార్యాభర్తలు ఎక్కువ ఆనందాన్ని పొందుతారనుకుంటాను" అన్నాడు.

"బహుశా ఇది మీ స్వానుభవం అనుకుంటాను" అంటూ కొంటెగా జోక్ వేశాను.

ఇద్దరం తేలికపడిన మనసుతో హాయిగా నవ్వుకున్నాం.

రైలు బయలుదేరటానికి ఇంకా పది హేను నిమిషాల సమయముంది.

"ఇంకా వివేక్ రాలేదు" అన్నాను వాచీ చూసుకుంటూ.

"పాపం! అతడికి వీధిలో తిరగాలన్నా సంకోచమే. ఊళ్ళో జనం ఏదేదో మాట్లాడుకుంటున్నారు" అన్నాడు డేవిడ్.

"డేవిడ్... మీ స్నేహితుడు వివేక్‌కి నా నమస్కారం తెలపండి. ఇక అతను వచ్చే సూచనలు కనిపించటంలేదు" అంటూ నేను ట్రైన్‌లో ఎక్కటానికి సిద్ధమవుతూ ఎంట్రన్స్ వేపు చూసి ఆగిపోయాను.

చేతిలో ఒక పెద్ద ప్యాకెట్టు పట్టుకుని వేగంగా వస్తున్న వివేక్ కనిపించాడు. నాకు ఎంతో సంతోషం కలిగింది.

"హమ్మయ్య... ఎలాగైతేనేం చివరికి వివేక్ వచ్చేశాడు" అంటూ డేవిడ్ నెమ్మదిగా నిట్టూర్చాడు.

వగరుస్తూ మా దగ్గరికి చేరుకున్న వివేక్ చేతిలోని ప్యాకెట్టుని నాకు అందించాడు.

"నాకేం వద్దు వివేక్...ప్లీజ్... ఏమిటది? నాకిలాంటి అలవాట్లు లేవని చెప్పానుగా. నేను మీ రాకకోసం ఎదురుచూస్తున్నాను. చివరి క్షణాల్లోనైనా వచ్చారు" అంటూ నా సంతోషాన్ని వ్యక్తం చేశాను.

"కాదనకండి సార్. దయచేసి ఈ చిరు కానుకను స్వీకరించండి. ఇది మిమ్మల్ని ప్లీజ్ చేయటానికి ఇవ్వటంలేదు. మా ప్రేమాభిమానాలకి గుర్తుగా దీన్నివుంచండి" ప్రాధేయపడుతూ అన్నాడు వివేక్.

"వద్దు వివేక్... ఇలాంటి అలవాట్లు మా పోలీసులు పెట్టుకోకూడదు. ప్లీజ్! ఏమీ అనుకోకు..." నేను సున్నితంగా తిరస్కరిస్తూ ప్యాకెట్టుని వెనక్కి ఇవ్వబోయాను.

"లేదు... లేదు... ఇది మీరు స్వీకరించాల్సిందే. ఇందులో ఏముందనుకుంటున్నారు? 'ప్రేమ' ఫ్యాక్టరీలో తయారైన అగరొత్తులతోపాటు చందనంతో చేసిన ఓ విగ్రహం మాత్రమే. ఈ రెండూ మైసూరులో ప్రసిద్ధమైన వస్తువులు. బయటివారు

అతిథిగా వచ్చినప్పుడు వీటిని కానుకగా ఇవ్వటం మా సంప్రదాయం. దయచేసి వద్దనకండి" అంటూ వివేక్ బలవంతంగా దాన్ని నాచేతిలో పెట్టాడు. నేను తీసుకోక తప్పలేదు.

నేను సూట్‌కేసును మోకాళ్ళపై పెట్టుకుని తెరిచి ఆ ప్యాకెట్టును లోపల పెట్టుకున్నాను. వివేక్‌తో కరచాలనం చేశాను.

"వివేక్ నేనిక వస్తాను. నావల్ల మీకందరికీ బాధ కలిగిందని నాకు తెలుసు. నన్ను అపార్థం చేసుకోవద్దు. మా పోలీసు వృత్తే అలాంటిది. అందరినీ, అన్నింటినీ అనుమానపు దృష్టితోనే చూడాల్సివస్తుంది. జరిగిందంతా పీడకలగా భావించి మరచిపోండి. భవిష్యత్తులో మళ్ళీ మనం కలుస్తామో లేదో... వీలైనంత త్వరగా మీరీ దుఃఖంనుంచి బయటపడాలని ఆ దేవుడ్ని ప్రార్థిస్తున్నాను"

నేను మాటలు ముగించకముందే వివేక్ ఆత్రంగా నా చేతుల్ని తన కళ్ళకు అద్దుకుంటూ భావుకంగా అన్నాడు.

"లేదు సార్, మీరు నాకు గొప్ప ఉపకారమే చేశారు. మీ దర్యాప్తు కారణంగానే నేను పరిశుద్ధుణ్ణయ్యాను. మీరే గనక ఇక్కడి దాకా వచ్చి ఇన్వెస్టిగేషన్ జరపకుండా వుంటే నాపై కొందరిలోనైనా అనుమానం మిగిలి వుండేది. మీరు ఎంతో లోతుగా ఎంక్వైరీ జరిపి నేను నిరపరాధి అని లోకానికి చాటిచెప్పారు. దీనికి మీకెన్ని విధాలుగా కృతజ్ఞతలు తెలుపుకున్నా తక్కువే. ఇప్పుడు నేను నిస్సంకోచంగా ధైర్యంగా అందరి ఎదుట తలెత్తుకుని తిరగ్గలను"

నిజంగానే ఆ క్షణాలు నా జీవితంలో చిరస్మరణీయమైనవి. వివేక్, డేవిడ్‌లతో చివరిసారిగా కరచానలం చేసి నా కంపార్ట్‌మెంట్‌వైపు కదిలాను. వాళ్లిద్దరూ అలాగే నిల్చుండిపోయారు.

నేను కంపార్ట్‌మెంట్‌ను సమీపిస్తుండగా చప్పున ఏదో స్ఫురించింది. సాలోచనగా అటూ ఇటూ చూశాను.

నాకు కుడివేపున 'రిజర్వేషన్ కౌంటర్' అని రాసివున్న బోర్డు కనిపించింది.

గబగబ అక్కడికి నడిచాను.

కౌంటర్ వెనక కూర్చున్న వ్యక్తికి నా ఐడెంటిటీ కార్డు చూపించాను.

"వాట్ కెన్ ఐ డూ ఫర్ యూ సర్?" క్లర్కు వినయంగా అడిగాడు.

"ఈనెల ఆరవ తేదీన వివేక్ అనే ఓ యువకుడు ఢిల్లీకి రిజర్వేషన్ చేయించాడు. దాని వివరాలు ఇవ్వగలరా?"

"ఎస్. సర్, నాకిప్పటికీ బాగా గుర్తు వుంది. వివేక్ అండ్ ఫ్యామిలీ అని రెండు సీట్లు కర్ణాటక ఎక్స్‌ప్రెస్‌కి రిజర్వు చేయించాడు. సీటు నెంబరు 78, 79 అనుకుంటాను..."

"థాంక్స్" అంటూ నేను వెనుదిరగబోయాను. అంతలోనే మరో ప్రశ్న అడగాలనిపించింది.

"ప్లీజ్... మరో ఇన్ఫర్మేషన్ ఇవ్వగలరా? వివేక్ అండ్ ఫ్యామిలీ మళ్ళీ తిరిగి రావటానికి రిటర్న్ జర్నీ టికెట్స్ ఏ రోజుకి రిజర్వ్ చేయించారు? కాస్త చూసి చెపుతారా?"

అతను రికార్డ్ వెదకటం మొదలెట్టాడు. కొద్ది నిమిషాలు గడిచాయి.

ట్రైన్ బయలుదేరుతున్నట్టు సూచనగా కూత వేసింది.

నాలో అసహనం పెరిగింది.

అతను తల ఎత్తాడు. నేను ప్రశ్నార్థకంగా చూశాను.

"సార్, వివేక్ పదహారవ తేదీన ఢిల్లీ నుంచి బయలుదేరే కర్ణాటక ఎక్స్‌ప్రెస్‌కు రిజర్వు చేయించాడు. అయితే..." అతను

అర్థాంతరంగా ఆగిపోయాడు.

ట్రైను కదిలింది.

"అయితే... ఏమిటి...?" నేను ఉద్వేగంగా ప్రశ్నించాను.

"అయితే... అటువేపు నుండి రిటర్న్ జర్నీ కోసం అతను ఒక టికెట్ మాత్రమే రిజర్వ్ చేయించాడు. అదీ వివేక్ పేరిట మాత్రమే! ట్రైన్ నెంబర్ 128, సీటు నంబరు 27..."

నాకు ఒళ్ళు జలదరించింది. ఉద్వేగంతో గుండె పగిలిపోయేలా కొట్టుకోసాగింది.

ఇటువేపునుండి 'వివేక్ అండ్ ఫ్యామిలీ' పేరిట రెండు సీట్లకు రిజర్వేషన్!

అయితే అటువేపు నుండి రిటర్న్ జర్నీకి వివేక్ పేరిట ఒకే ఒక సీటుకు రిజర్వేషన్!

"హుర్రే" అని అరవాలన్నంత ఆనందం వేసింది నాకు. ఇంతకాలం పాటు నా మేధస్సును తొలిచేస్తున్న సమస్యకు సమాధానం దొరికింది. ఇంతవరకు నాతో దాగుడు మూతలు ఆడుతున్న 'వాస్తవం' బట్టబయలై నా ముందుకొచ్చి నిలబడింది.

నేను అత్యుత్సాహంతో ఆ క్లర్కు చేతిలో వున్న రిజిస్టర్ పుస్తకాన్ని లాక్కుని ఆత్రంగా రిజర్వేషన్ అంశాల్ని పరీక్షించాను. ఒకటికి పదిసార్లు పరిశీలించాను.

'ఎస్. అతను చెప్పింది అక్షరాలా నిజం!'

ఆ విషయం ఖాయపరచుకోగానే నేను చేసిన మొట్టమొదటి పని నా జర్నీ టికెట్ ని కాన్సిల్ చేసుకోవటం.

ఆ తర్వాత నేను ఆఘమేఘాల మీద వివేక్, డేవిడ్‌లు నిల్చున్న చోటికి చేరుకున్నాను.

నాకు చివరిసారిగా టాటా చెప్పటానికి నాకోసం దిక్కులు చూస్తున్న ఇద్దరూ నా వాలకం చూసి ఆశ్చర్యపోయారు. కదిలిపోతున్న ట్రైను వేపు, రొప్పుతూ, వాళ్ళ ముందు నుంచున్న నావేపూ మార్చిమార్చి చూశారు.

నేను గొంతులో గాంభీర్యాన్ని నింపుకుంటూ సీరియస్‌గా చెప్పాను.

"మిస్టర్ వివేక్, యు ఆర్ అండర్ అరెస్ట్"

వివేక్ తెల్లబోయాడు.

అతని ముఖం వివర్ణమైంది.

నేను మరోమాట చెప్పకుండా అతన్ని నా స్వాధీనంలోకి తీసుకున్నాను.

డేవిడ్ నమ్మలేనట్టు నావేపు అప్రతిభుడై తదేకంగా చూస్తున్నాడు.

"నిజం నిప్పులాంటిది. దాన్ని ఎన్నటికీ దాచి వుంచలేం" ఆత్మ విశ్వాసం నిండిన స్వరంతో పలికాను.

నా పంతం నెగ్గింది. వివేక్ నుండి 'వాస్తవం' రాబట్టగలిగాను.

అతను నోరువిప్పి అసలు జరిగిందేమిటో చెప్పసాగాడు.

## ప్రతినాయకుడు



ఇప్పటిదాకా నేను కథానాయకుడినే.

ఇప్పుడు నేను నాయకుణ్ణి కాను. ఖల్‌నాయ కుడ్ని!

నన్ను బంధించారు. విచారించారు. యావజ్జీవ కారాగార శిక్ష విధించారు.

చెరసాలలోని ఊచల వెనక కూర్చున్న నన్ను చూసిన వారెవరూ 'వివేక్' అని పిల వరు. 'అవివేక్' అనే అంటారు.

ఇన్నాళ్ళూ నా గుండెల్లో దాచివుంచిన నగ్న సత్యాన్ని మీ ముందు వుంచుతు న్నాను. ఇంత జరిగిన తర్వాత కూడా వాస్త వాన్ని దాచిపెట్టడంలో అర్థంలేదు, లాభం లేదు.

ఇన్‌స్పెక్టర్ రాజీవ్ సక్సేనా ముందు నోరు విప్పి వాస్తవం అంగీకరించాను. ఇక మీముందు దాచివుంచటంలో ఏ పురుషా ర్థమూ లేదు.

అవును!

ప్రేమను చంపిన హంతకుణ్ణి నేనే!!

ఇంతవరకు జరిగినదంతా వాస్తవమే. ఏదీ అవాస్తవం కాదు. ఈ సాధారణ వాస్త వాలతోపాటు ఓ అసాధారణమైన నిజం నా గుండెలోతుల్లో దాగి వుండి నన్ను ఇన్నాళ్ళూ హింసించింది. దాన్ని ఇప్పుడు మనసు లోతుల్లోంచి వెలికి తీసి మీ ముందు పెడుతున్నాను.

ఆరోజు సెప్టెంబర్ 30!

నాపెళ్ళికి ఇంకా రెండ్రోజులే మిగిలి వున్నాయి. ప్రేమతో పెళ్ళి నిశ్చయమైనప్ప టినుంచీ ఉత్సాహంతో ఉరకలు వేస్తూ, ఆనందసాగరంలో తేలియాడుతూ నా ఆరాధ్య దేవతతో ఐక్యమయ్యే శుభగడియ కోసం ఆతృతగా ఎదురు చూడసాగాను. నా స్వప్న సుందరితో గడపబోయే భావిజీవి తపు మధుర క్షణాలగురించి తియ్యటి కలలు కనసాగాను.

ఆ రోజు నా ప్రేమకు ఒక మంచి కానుక ఇవ్వాలనిపించింది. ఎందుకంటే నేనామెకు 'ప్రేమికుడి'గా వ్యవహరించే గడువు ఇంక రెండ్రోజులు మాత్రమే మిగిలివుంది. ఆ తర్వాత నేనామెకు 'భర్త'గా మారిపోతాను. పెళ్ళికి ముందే కాబోయే శ్రీమతిని చూడా లనీ, మాట్లాడాలనీ, కానుకలు ఇవ్వాలనే చిలిపి కోరికలు ప్రతి మగవాడికీ వుంటా యేమో?

ఆరోజు నేను చక్కగా ముస్తాబయ్యాను. ఎల్లప్పుడూ మొరాయించే నా ఎజ్డీ ఆరోజు ఒక్క కిక్కుకే స్టార్ట్ అయ్యింది. దారిలో మార్కెట్టు సమీపంలో బైకు ఆపాను. ఫుట్ పాత్ మీది సంపంగి పూలగుత్తులు చేతులు చాచి నన్ను పలకరించాయి. అరచేతులంత పూలు ఏరి కట్టించుకున్నాను. ఎదురుగా రతన్ శారీ ఎంపోరియం షోకేసులో విమల్ చీర నన్ను ఆకట్టుకుంది. సరి అను కుంటూ షాపు దగ్గరికి నడిచాను. సేల్స్ గరల్‌కి సంగతి చెప్పాను.

నా ప్రేమకోసం సరికొత్త డిజైను చీరను ఆమే సెలెక్ట్ చేసింది.

"నేను ప్రేమను చూశాను. ఆమెకు ఈ రంగు అద్భుతంగా మ్యాచ్ అవుతుంది" అంది కొంటెగా నవ్వుతూ.

బిల్ అందిస్తున్నప్పుడు "అడ్వాన్స్ ప్రెజెం టేషనా సార్? " అనడిగింది చిలిపిగా.

నేను చిరునవ్వు నవ్వాను.

తర్వాత ఎదురుగా కనిపించిన గాజుల కొట్లో దూరాను.

"అమృతపు శిల రంగు గల చేతికి మ్యాచ్ అయ్యే కొత్త డిజైను గాజులు ఇవ్వగలరా? అని అడిగాను.

వాళ్ళంతా నావేపు వింతగా చూశారు.

పూలు, చీర, గాజులు తీసుకున్న తర్వాత బైకు వేపు నడిచాను.

అప్పటికే పొంగి పొరలుతున్న నా ఉత్సాహం చూసి బైకుకి ఎక్కడలేని





అసూయ కలిగినట్టుంది. ఎన్ని కిక్కులు కొట్టినా స్టార్ట్ కాలేదు.

దాన్ని నెట్టుకుంటూ కృష్ణ గ్యారేజికి చేర్చాను.

తర్వాత కాలినడకన సుశీల మహల్ వేపు బయల్దేరాను. చేతుల్లోని వస్తువుల్ని ఎదకు ఆనించి పట్టుకుని బేరర్‌లా నడవసాగాను.

అక్కడ్నించి సుశీల్ మహల్‌కి పదినిము షాల నడక.

నాకు తెలుసు ఈరోజు సాయంత్రం అత్త గారు స్వయంగా పెళ్ళి పత్రికలు పంచటా నికి బయటికి వెళ్లి వుంటారని. మామగారు ఎప్పటిలాగే ఫ్యాక్టరీలో వుంటారు. నా ప్రేమ ఒక్కతే ఇంట్లో వుంటుంది.

నా కానుకల్ని చూడగానే ఆమె కళ్ళు ఆశ్చ ర్యంతో విచ్చుకుంటాయి.

"ఖరీదు మరీ ఎక్కువ. అంగడివాళ్ళు నిన్ను బోల్తా కొట్టించారు. వివేక్..." అంటూ కొత్త రాగం తీసినా తీయవచ్చు తను మహాపిసినారి మరి.

నేను ఆమె గదిలోకి చప్పుడు చేయకుండా నిశ్శబ్దంగా ప్రవేశించాలి. చాటుగా ఆమె వెనక్కి చేరుకుని అరచేతుల్తో కళ్ళు మూసె య్యాలి.

ఇలాంటి గొప్ప రొమాంటిక్ మూడ్‌తో సుశీలా మహల్‌లోకి ప్రవేశించాను. ప్రేమకు ఎలా సర్‌ప్రయిజ్ ఇవ్వాలో, ఎలా మాట్లాడాలో మనసులోనే రిహార్సల్స్ వేసు కున్నాను.

'ఆమె మూడ్ బాగోకపోతే మండిపడు తుంది. వెనుదిరిగి వెళ్ళిపో. నామాట విను లేదా బాధపడతావ్' అంటూ నా మనసు నన్ను హెచ్చరించింది.

"లేదు లేదు... ఆమె కోప్పడదు. ఈసారి ఈ బహుమతులు చూసి ఆమె తప్పకుండా సగటు ఆడపిల్లలా సిగ్గుపడుతుంది. నేను తెచ్చిన చక్కటి కానుకలకు బదులుగా తియ్యటి ముద్దుల్ని అందిస్తుంది..." అని నా మనసుకు సర్ది చెప్పుకున్నాను.

దొంగలా నడుస్తూ ఇంట్లో ప్రవేశించాను.

బంగళా అంతటా నిశ్శబ్దం రాజ్యమేలు తోంది. ఈ ఇల్లు ఎప్పుడూ ఇలాగే వుంటుంది. దీనికి 'మౌనమహల్' అని కొత్త పేరు పెట్టాలనిపించింది.

ఒక్కో తలుపును చూస్తూ ఎన్నో మెట్లు ఎక్కి పైకి చేరుకున్నాను. నిరాశగా శూన్యం లోకి చూస్తూ కూర్చున్నట్టు వున్న ఖాళీ సోఫాలు, కుర్చీలు, చూసేవారులేక అలసిపో యినట్టు కనిపిస్తున్న తైలవర్ణ చిత్రాలు ఇవన్నీ కలగలసి ఇప్పుడే ముగిసిన రంగస్థ లాన్ని తలపిస్తున్నాయి.

చివరి మెట్లు ఎక్కి ప్రేమ గదిని సమీపిం చాను. మరీ గుసగుసగా కాక, మరీ పెద్దగా కాక ఓ మోస్తరుగా రెండు కంఠస్వరాలు విన్పిస్తున్నాయి ప్రేమ గదిలోంచి.

ఇలాంటి సమయాల్లోనే కుతూహలం అనేది మనిషిని దయ్యంలా ఆవహిస్తుంది. అప్రయత్నంగానే కిటికీ సమీపించాను. సగం తెరిచిన కిటికీలోంచి నా చూపుల బాణాల్ని సంధించాను. సూటిగా దృశ్యాన్ని తాకాయవి.

దృశ్యాన్ని సరళంగా చెప్పటం నాకు సాధ్యం కావటంలేదు.

ప్రేమ ఓ పురుషుడితో పాటు వుంది. ఆ సమయంలో వాళ్ళిద్దరూ నగ్నంగా లేరు. అయితే నగ్నావస్తనుండి బయటపడి ఎంతో సేపు గడవలేదని మాత్రం చెప్పవచ్చు అంతేకాదు గతంలో తమ మధ్య జరిగినది, భవిష్యత్తులో ఏం చేయబోయేది చర్చించు కుంటున్నారు.

ఆ వ్యక్తి డేవిడ్ కావచ్చుని నేను తొందర పాటు వల్ల భ్రమపడ్డాను. అయితే పరిశీల



నగా చూశాక అతను డేవిడ్ కాడని అర్థమయ్యింది. అతను రూటు నెంబర్ 24లో తిరిగే సిటీబస్సు డ్రైవర్ రాజు అని గుర్తుపట్టాను.

అతను యూనిఫాం ధరించి కాళ్ళు చాపుకుని కూర్చున్నాడు. ప్రేమ అతని కాళ్ళదగ్గర కూర్చుని వుంది. ఎన్నో ఏళ్ళు సహజీవనం చేసిన భార్యా భర్తల్లా, తమ సంసార కష్ట సుఖాల్ని చెప్పుకుంటున్న దంపతుల్లా తీరుబడిగా కబుర్లు చెప్పుకుంటున్నారు.

పరాయి వ్యక్తుల వ్యక్తిగత సంభాషణని ఎన్నడూ వినని నేను మొదటిసారిగా గది వేపున చెవులు రిక్కించాను. వాళ్ళ మాటలు నా చెవిన పడసాగాయి.

"ఏమే... పిల్లాటలు ఆడుతున్నావు? పెళ్ళికి ఎందుకు ఒప్పుకున్నావ్? ఈ నాటకాలు నా దగ్గర సాగవు. ఇన్నాళ్ళు ఈ రాజు నీకు అవసరమయ్యాడు. నీ కోరికలు తీర్చుకోవటానికి ఈ శరీరం కావల్సివచ్చింది. ఇప్పుడు నాతో అవసరం తీరింది. గొప్పింటి కుర్రాడు దొరికాడని నా దగ్గర ఫోజులు కొడతావా...? "

"అబ్బా, రాజా! నా మాటలు కాస్త అర్థం చేసుకో... నువ్వు పెళ్ళికానివాడివి కావు. నీకు భార్య, ఇద్దరు పిల్లలున్నారు..."

"ఉండనీ... దాన్నీ ఏలుకుంటాను. నిన్నూ వుంచుకుంటాను. ఆమె ఎన్నార్ వీధిలో వుంటే నిన్ను అగ్రహారంలో వుంచుతాను.."

"అది కాదు రాజా! నన్ను పెళ్ళి చేసుకోబోతున్న ఆ వివేక్ ఒట్టి మూర్ఖుడు. నన్ను దేవతలా ఆరాధిస్తాడు తెలుసా? నన్ను ముట్టుకునే ధైర్యం కూడా అతనికి లేదు. అతన్ని పెళ్ళి చేసుకుంటే వాళ్ళకున్న లక్షల ఆస్తి నాకే వస్తుంది"

"నీకు మరీ డబ్బు పిచ్చి..."

"మరి నువ్వు లారీ కొనాలనుకుంటున్నావ్ కదా, దానికి ఏభైవేలు కావాలన్నావ్... డబ్బు విలువ నీకు తెలియదా? "

"అది సరే, నీ పెళ్లయ్యాక మనం కలిసేదెలా? "

"మనం మామూలుగానే..."

"మామూలుగానే అంటే...? "

"నీ బస్సు మా ఇంటి ముందు నుంచి వెళ్తున్నప్పుడు నేను టెరెస్ మీదనుంచుని పచ్చ టవల్ వూపుతాను. నీకదే గ్రీన్ సిగ్నల్!... ఇక నీ వీక్లీ ఆఫ్ రోజున ఇద్దరం కలిసి ఎక్కడికైనా వెళదాం..."

"మరి నీ భర్త...? "

"అతనా...? అతనికి ఒక పేపరు, పెన్ను ఇచ్చేస్తే చాలు, కవితలు, గేయాలు రాసుకుంటూ కూర్చుంటాడు"

"ఎందుకూ, వాడు కొజ్జాగాడా? వాడికి.... లేదా? "

"ఛీ...ఛీ.. నీవి మరీ మొరటు మాటలు! ఓ నిజం చెప్పనా? నువ్వు తప్ప మరో పురుషుడి స్పర్శ కూడా నాకు తెలీదు. ఇంత వరకు నేను ఎవ్వర్నీ కన్నెత్తి కూడా చూడలేదు"

"ఏయ్! నువ్వు భలే కిలాడీవే"

"అదంతా నువ్వు నేర్పిందే, నిజంగా చెబుతున్నాను రాజా! నీలాంటి మగవాణ్ణి నేనెక్కడా చూళ్ళేదు. నీ డ్రైవింగ్ అంటే నాకెంతో ఇష్టం. నీది ఎంత మాన్లీ లుక్కో తెలుసా? స్టీరింగ్ వదిలేసి సిగరెట్టు వెలిగించేటప్పుడు నీ స్టైల్ మన రజనీకాంత్ కంటే బావుంటుందనుకో. మా ఫ్యాక్టరీకి కొత్త లారీ కొనమని నాన్నకు చెప్పాను... నువ్వు డ్రైవర్‌గా వుంటావా? "

"పోవే... నేను నీ లారీ డ్రైవ్ చేసేవాడ్ని కాదు. నిన్నే డ్రైవ్ చేసేవాడ్ని"

ఆ మాట వినగానే ప్రేమ అతని ఎదపై




పెరిగిన నల్లటి జుత్తులో వేళ్లు జొనిపి అతన్ని కావలించుకుంది.

నేను చప్పుడు చేయకుండా వెనుదిరిగి నెమ్మదిగా మెట్లు దిగసాగాను. దిగుతున్న ఒక్కో మెట్టూ శూలంలా నా గుండెలో దిగబడసాగింది. మౌనం నా మనసును ముక్కలు చేయసాగింది. నా నాలుక నోటికి కరుచుకుపోయి కదల్లేక పక్షవాతం వచ్చినదానిలా వుండిపోయింది. తలమీద వెంట్రుకల్ని ఎవరో పరపరమంటూ పీకేసి మాడుపై కాచిన నూనె పోసినట్టనిపించింది. పదునైన గొడ్డలితో ఎవరో నా శరీరాన్ని ఇష్టమొచ్చినట్టు నరికేస్తున్న అనుభూతి కలిగింది.

నాలో మిగిలివున్న చైతన్యాన్ని కూడదీసుకుని మెట్లు దిగాను. నా కాళ్లు నానుంచి విడిపోతున్నట్లు బాధ కలిగింది. రెండు కాళ్లలో ఒకటి ప్రేమ పట్టుకుని మరొకటి రాజా చేజిక్కించుకుని తలోపక్క గుంజుతూ నా శరీరాన్ని రెండు భాగాలుగా చీలుస్తున్నట్లనిపించింది. ఆ ఇంటినుంచి బయటపడి నేరుగా శ్మశానికి వెళ్ళాను. పాడుబడ్డ మంటపంలో బైరాగులు గంజాయి తాగుతూ కనిపించారు. కొద్దిసేపటి క్రితమే ఎవరో శవదహనం చేసి వెళ్ళినట్టున్నారు. చితిమంటలు ఇంకా ఆరలేదు. ఆ మంటల్ని చూస్తుంటే నాలో ప్రతీకార జ్వాల భగ్గుమంది.

ఆ ప్రతీకార వాంఛ ప్రేమమీద!

రాజుమీద కాదు...

చాలా సేపటివరకు ఆ శ్మశానంలో ఒంటరిగా కూర్చుని వుండిపోయాను. చివరికి ఓ కఠోర నిర్ణయం తీసుకున్నాను. ఆ నిర్ణయం అనివార్యమే మరి. సవాలక్ష ఆలోచనలు కొరివిదయ్యాల్లా నా చుట్టూ నిల్చుని నాట్యం చేస్తూ వికృతంగా నవ్వుతుండటం చూస్తూ నేనెలా భరించగలను? నన్ను నేను నిందించుకుంటూ ఎంతసేపు వుండగలను?

ప్రేమ... అనురాగం... ఆరాధన... పూజ... ఛూ...!

కేవలం భోగించటానికే పుట్టిన ఈ కామభరిత శరీరాన్ని పూజించటమా...? ఛీ... ఛీ... తలచుకుంటేనే సిగ్గేస్తుంది. ఇప్పుడా కామ పిశాచిని నేను పెళ్ళాడాలా? లేదా ఆమెను దాని ప్రియుడికే వదిలేసి అవివాహితునిగానే వుండిపోవాలా?

ఆమెను తిరస్కరించటానికి నేను ఏ కారణం చెప్పాలి? ప్రేమ 'తిరుగుబోతు' అంటే నా మాటలు ఎవరూ నమ్మరు. నాకు పిచ్చి పట్టిందనుకుంటారు. మా పెళ్ళికి అన్ని ఏర్పాట్లు పూర్తయ్యాయి. పైగా పరువు, ప్రతిష్టలకు ప్రాణాన్నే ఫణంగా పెట్టే రెండు అమాయకజీవులు ఇంట్లో వున్నాయి. నేనీ పెళ్లిని ఆపటంవల్ల సాధించేదేమిటి? ఆ రెండుజీవుల ప్రాణాల్ని హరించటం తప్ప!

అయితే...

నాలోని ప్రేమను నిలువునా చంపేసిన ఈ 'ప్రేమ'పై ప్రతీకారం తీర్చుకోకుండా వొదిలిపెట్టను.

సరిగ్గా అప్పుడే నా మదిలో మెదిలింది.

కులూ వ్యాలీ!

అవును.

సుదూరంలో వున్న ఆ సుందర ప్రదేశానికి తీసుకెళ్లి ఆమెను గుట్టుగా అంతం చేయాలి. అని అదే క్షణంలో నిర్ణయించుకున్నాను.

మునుపటి ఉత్సాహాన్ని ప్రదర్శిస్తూనే ప్రేమను పెళ్లి చేసుకున్నాను. అయితే ఇంతకాలం నాపై ప్రేమలేని ఆ ప్రేమను ఆరా

ధించినందుకు మనసులోనే పశ్చాత్తాపపు కన్నీరు కార్చాను. ఆమె అందం ఆరాధనకు కాదు. భోగానికే అర్హమైనది.

నేను నపుంసకుడ్ని కాను, జలపాతాన్ని మించిన ప్రవాహంగల పరిపూర్ణ పురుషుడి నని ఆమెకు తెలపటం కోసం పడకమీద విశృంఖలంగా ఆమెను అనుభవించాను. దాంతో నా ప్రేమ భ్రమ తొలగిపోయింది.

ఆమెను చంపటానికి ఒకరోజుముందు నా కసి పరాకాష్టకు చేరుకుంది. ఆమె అందచందాల్ని ఎంతవరకు సాధ్యమో అంత వరకు అనుభవించాలనే పిచ్చి కోరికతో ఆమెను పూర్తిగా నగ్నం చేశాను. ఆమె సౌందర్య గనులను కనులారా చూశాను. ఆ సౌందర్యరాశినే ఒకప్పుడు దేవతలా పూజించాననే సంగతి గుర్తొచ్చి చివరి రోజున స్వయంగా నేనే ఆమెకు బట్టలు తొడిగించి ఆమెను అద్భుతంగా అలంకరించాను.

నామీద అనుమానం కలగకూడదని గొప్ప ప్రేమికుడిలా నటించాను. ప్రయాణ సమయంలో ప్రతిరోజు మైసూరుకి ఆమె చేత ఉత్తరాలు రాయించాను.

రోథాంగ్‌పాస్‌మీది ఎత్తయిన శిఖరం మీదికి ఆమెను తీసుకుని వెళ్ళాను. అయితే ఆమెకు అక్కడి మనోహర దృశ్యాల్ని చూసే ఆసక్తి లేదని నాకు బాగా తెలుసు. ఆమెకు అవసరమైనవి, ఆసక్తిని కలిగించేవి డ్రైవర్ రాజు మొరటుభుజాలు, చేష్టలే అని బాగా తెలుసు.

ఆ నమ్మకద్రోహిని నమ్మకంతో నమ్మించి మంచు శిఖరం అంచువరకు తీసుకెళ్లాను.

"దూరంగా లోయలో ఎన్ని జలపాతాలు దూకుతున్నాయో లెక్కపెట్టి చెప్పు చూద్దాం' అంటూ ఆమెను మాటల్లో పెట్టి నా ఆట మొదలెట్టాను. నిజానికి ఆ లోయలో జల పాతాలు లేనేలేవు.

జలపాతాలు కనపడకపోవటంతో ఆమె ఆసక్తిగా మరింత ముందుకు వెళ్లి చూడసాగింది. నేను లోయకిందికి వేలు చూపిస్తూ "ఇక్కడ్నించి స్పష్టంగా కనిపిస్తాయి జలపాతాలు, కాస్త వంగి చూడు, చూసి లెక్కపెట్టి చెప్పు" అంటూ లోయ చిటారు అంచుపై నిలబెట్టాను.

ఆమె కుతూహలంగా వంగి జలపాతాల్ని వెదుకుతుండగా అతి లాఘవంగా, రెప్ప పాటు వ్యవధిలో ఆమెను లోయలోకి తోసేశాను. నునుపైన మంచుపై నించున్న కారణంగా ఆమెకు నిలదొక్కుకునే అవకాశమే చిక్కలేదు. సూటిగా లోయలోకి జారిపోయింది.

ఆ తర్వాతే నేను గట్టిగా కేకలు పెట్టాను.

అలా నా ప్రేమకథ ముగిసింది.

అయితే నేను మరొకరి స్వేచ్ఛను హరించే స్వార్థపరుణ్ణి కాను. ప్రేమ రాజుతో కలిసి నా దగ్గరికొచ్చి 'మేమిద్దరం ప్రేమించుకున్నాం, పెళ్లి చేసుకుంటాం' అని ఒక్కసారి ఒకే ఒక్కసారి నాతో చెప్పివుంటే నేనే వాళ్ళిద్దరికి పెళ్లి జరిపించివుండేవాణ్ణి. తర్వాత భుజాలపై ఓ శాలువా కప్పుకుని, తాగుడు అలవాటు చేసుకుని, డేవిడ్‌లా గడ్డంపెంచి దేవదాసుగా మారిపోయి చివరికి ప్రాణాలు విడిచి అమర ప్రేమికుడినని పించుకునేవాణ్ణి.

అయితే ప్రేమ నాకా అవకాశం ఇవ్వ లేదు. ఆమె నన్ను నిలువునా వంచించింది. నా ఆస్తిపై అజమాయిషీ చేయాలనే కుటిల బుద్ధితో నన్ను పెళ్లాడింది. నన్నంతగా మోసం చేసిన ఆమెను క్షమించలేకపో యాను. ఆమెపై పగ తీర్చుకున్నాను.

అయితే ముందునుంచి అంతా పకడ్బందీ





గానే ఆలోచించి పథకాన్ని అమలుపరచిన నేను ఢిల్లీకి టికెట్లు రిజర్వేషన్ చేయించేటప్పుడు పప్పులో కాలేశాను. నా దృష్టి ఆమె మరణంపట్ల కేంద్రీకృతమై వున్నందున నేను చాలా క్యాజువల్‌గా రిటర్న్ జర్నీకి ఒకే టికెట్ రిజర్వ్ చేయించాను. అది ఒక రకంగా నా తెలివి తక్కువతనాన్ని బయట పెడితే మరో రకంగా నా ఆత్మవిశ్వాసాన్ని కూడా ప్రదర్శిస్తోంది. ఎందుకంటే నేనామెను కులూ వ్యాలిలో ఖచ్చితంగా చంపుతానని నాకు తెలుసు. ఎట్టి పరిస్థితుల్లోను నా పథకం విఫలం కాదని నాకు తెలుసు.

అయితే కాసింత జాగ్రత్తపడి రిటర్న్ జర్నీకి కూడా రెండు టికెట్లు రిజర్వ్ చేసి వుంటే ఈ సక్సేనాలాంటి వెయ్యిమంది పోలీసు ఆఫీసర్లు కలిసినా నన్ను పట్టుకోగలిగేవారు కాదు. అయితే నాకు అన్నిచోట్లా కలిసి వచ్చిన అదృష్టం ఈ ఒక్క విషయంలో మాత్రం ముఖం చాటేసింది.

నా భవిష్యత్తు గురించి ఎన్నో రకాలుగా అనుకున్నాను. ప్రేమను చంపిన తర్వాత జీవితంలో మరో స్త్రీ వైపు కన్నెత్తి చూడకూడదని నిశ్చయించుకున్నాను. ప్రేమను గుర్తుకు తెచ్చే ఆమె అగరొత్తుల ఫ్యాక్టరీని, సుశీలమహల్‌ని నాశనం చేయాలని అనుకున్నాను. తర్వాత నేనొక సర్వసంగ పరిత్యాగిగా మారిపోయి శేషజీవితాన్ని ప్రశాంతంగా గడపాలనుకున్నాను.

అయితే ఇప్పుడు ఓ ఖైదిగా జీవిస్తున్నాను.

కాని నా అంతరంగంలో మండుతున్న అగ్నిజ్వాల గురించి ఎవరికి తెలుసు? అప్పుడప్పుడు నన్ను చూడటానికి వచ్చే డేవిడ్‌ను కౌగలించుకుని మనస్ఫూర్తిగా ఏడుస్తాను.

నన్ను పెట్టిన ఈ జైలుకు దళసరి గోడలున్నాయి. ఇక్కడి అధికారులు చాలా మంచివాళ్లు. నేను కోరినప్పుడల్లా కాగితం ముక్కలు, పెన్ను ఇస్తున్నారు. తీరిక దొరికినప్పుడు నా గుండె లోతుల్లో గూడుకట్టుకున్న వేదనలకు అక్షరరూపం ఇస్తాను.

పగటిపూట నాచేత గాడిదచాకిరీ చేయిస్తారు. రాత్రిపూట చీకట్లో నేను తలెత్తి చుక్కల్ని లెక్కపెడుతూ కాలం గడుపుతున్నాను.

నాకు ఒక్కోసారి అనిపిస్తూ వుంటుంది. నేను ప్రేమకు బతకటానికి ఒక అవకాశం ఇచ్చివుంటే బావుండేదేమోనని.

'లేదు... లేదు... ఆమెను చంపటం సరైన పనే' అంటూ అంతలోనే నా అంతరాత్మ ఘోషించేది.

ఇలా మానసిక సంఘర్షణలో నలిబిలి అవుతూ ఓ ఏడాది గడిపేశాను.

ఇప్పుడు నాకు ఆమెమీద కోపం కలగటం లేదు.

డేవిడ్ తెచ్చి ఇస్తున్న పుస్తకాలు చదివిన తర్వాత నేను ఆమెను ద్వేషించటం మానేశాను.

రాత్రిపూట నా గది కిటికీలోంచి చంద్రుడి కాంతి గదిలోకి ప్రసరించినప్పుడు నా దగ్గరికి నా ప్రేమే వచ్చిందనిపిస్తుంది.

'ప్రేమా... నువ్వు ఎందుకలా చేశావు?

అని మవునంగా రోదిస్తూ ఆ వెన్నెలని ప్రశ్నిస్తాను.

నా ఈ సమాధానం లేని ప్రశ్నకు ఆ వెన్నెల్లోంచి జారిపడే ఏ కాంతికిరణం జవాబు చెబుతుంది? సవ్వడి చేయకుండా వీచే ఏ గాలి దానికి సమాధానం పలుకుతుంది?

నేను మాత్రం-

జవాబు కోసం ఎదురుచూస్తూనే వున్నాను.



# 'వాన-వరద'పై సమీక్షలు

జూలై 'చతుర'లో ప్రచురితమైన ఘండికోట బ్రహ్మాజీరావు నవల 'వాన-వరద'పై మాకందిన ఉత్తమ సమీక్షలు.

## విఫల ప్రయత్నం

*(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

కథలో సహజత్వం, కథనంలో పట్టు, భావ వ్యక్తీకరణలో స్పష్టత లోపించిన జూలై "చతుర" నవల 'వాన-వరద' ఒక అనుభవ జ్ఞుడైన రచయిత చేతినుండి జాలువారిన సాదాసీదా నవలలా వుండటం శోచనీయం.

కథనాన్ని పాత్రలచే చెప్పించడం కొత్త ప్రక్రియ కాకపోయినప్పటికీ, ఆ తరహాని ఎంచుకొన్న రచయిత పాత్రల మనోభావా లను వ్యక్తీకరించడంలో గట్టి ప్రయత్నం చేసి విఫలమయ్యారు. పాత్రల స్వభావా లను మలిచిన తీరులో అసహజత్వం స్పష్టంగా అగుపించింది. ఆత్మస్థైర్యం, మాన వత్వం కలిగిన 'ఆధునిక వితంతువు'గా తీర్చిదిద్దాలనుకొన్న 'నారాయణి' పాత్రే ఒక అనామకునితో సంబంధం ఏర్పరచుకొనేలా చేసి, ఒక దొంగచాటు వ్యవహారంలో ఆ పాత్రను ఇరికించి 'నారాయణి' వ్యక్తిత్వాన్ని కించపరిచారు రచయిత. కనీసం తాను ఏమీ తప్పు చేయలేదు అని తన గ్రామస్థు లకు ధైర్యంగా చెప్పలేని పాత్రగా మలచడం బాధాకరం. భర్తచాటున నారాయణి వదిన చేసేది ఎంత తప్పు పనో, తల్లిచాటున 'నారాయణి' చేసింది కూడా అంతే తప్పు అవుతుంది. ధైర్యంగా రామదాసుతో తాను నూతన జీవితం ప్రారంభించాలనుకొంటు న్నట్టుగా నారాయణి తన తల్లితో చెప్పి ఇంట్లోనుండి వెళ్ళిపోయినట్లుగా అక్షరీకరిస్తే ఒక నూతన పంథాకు రచయిత స్వాగతం పలికినట్లుగా వుండేది. ఆ పాత్రకు మరింత నిండుదనం కలిగేది.

సమాజం అంటే విభిన్నరకాల మనస్తత్వాల మనుషులుంటారు. అటు వంటి సమాజాన్ని మార్చడానికి బయల్దేరిన శంకరం తన భార్యని మార్చాలని ఏనాడూ అనుకోకపోవడం, ప్రయత్నించకపోవటం ఆమెపట్ల అతని నిర్లక్ష్యమా?

అసహజ పరిస్థితులనుండి వచ్చిన 'నారా యణి', 'రామదాసు' పాత్రలు అభిరుచులు, ఆలోచనల కలయికపై కాకుండా కేవలం శారీరక బంధంపైనే ఆధారపడడం, అటు పైన సమాజాన్ని ఎదిరించి, సమాజసేవలో నిమగ్నం అయిన తీరూ అసంబద్ధంగానే వుంది.

'వితంతు సంస్కరణ' వంటి ఒక సామా జిక అంశాన్ని కథనంగా ఎంచుకుంటున్న ప్పుడు రచయిత అన్నిరకాలుగా పాత్రలపై పూర్తి అవగాహన కలిగివుండాలి. అప్పుడే ఆ పాత్రల యొక్క ప్రభావం స్పష్టంగా ప్రస రించగలదు.

—సంజూ
కరీంనగర్-505 001

## 'థ్రిల్లింగ్'

*(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

నారాయణి, శంకరం, విశాలాక్షి, శర్మ- నలుగురూ తమ పరిధిలో, తమ జీవితాల్లో జరిగిన సంగతుల్ని నాలుగు రకాలుగా వివ రించిన 'వాన -వరద'లో ఆయా వ్యక్తుల




మనోభావాల విశ్లేషణలు తప్పించి గొప్పగా చెప్పిందేమీ లేదు.

అయితే కథనంలోని కొత్తదనం నవలను చదివేలా చేసింది. వర్షం, తుఫాను, ఉప్పెన, వరదల్లాంటివి వచ్చినప్పుడు రైలు ప్రయాణం ఎంత థ్రిల్లింగ్‌గా ఉంటుందో పాఠకులు అనుభవించేంత చక్కగా తేలిగ్గా అందించారు రచయిత.

కథ చెప్పడంలోని కవిత్వపు లక్షణాలు ఆకట్టుకున్నాయి. తమలో తామే పోట్లాడుకునే మేఘాలు, నిలబడి ఒంటికాలిమీద తపస్సు చేసుకుంటున్న మునిపుంగవులకు మల్లే కొబ్బరి చెట్లు, తలుపు సందులలోంచి గాలిపోతూ చేసే వింతయిన శబ్దాలు, 'రెచ్చగొడితే తాచుపాము బుసకొడుతుందిగానీ వానపామేం చేస్తుంది' లాంటి పదప్రయోగాలు బాగున్నాయి.

వందలమైళ్ల వేగంతో వీచే గాలికి చెట్లు విరిగి పడిపోవడం, కమ్యూనికేషన్ల వ్యవస్థ మొత్తం అస్తవ్యస్తమవడం, రైలు పట్టాల మీద రాయి సన్నివేశాలు ఒళ్ళు గగుర్పొడిచేవిగా ఉన్నాయి.

ముగింపులో నారాయణి, రామదాసుల ఆశ్రమాన్ని గురించి వివరించడం, శర్మ, సోములు వాళ్ళను కలవకపోవడం అసంపూర్తిగా అనిపించింది. సోములు తన భార్య ట్రీట్‌మెంట్‌కు తీసుకున్న వెయ్యి రూపాయల్ని బాకీకింద జమకట్టుకోమనడం, దానికి శర్మ సమాధానం బాగున్నాయి.

మొత్తానికి 'వాన-వరద' నవల వర్షాకాలంలో తుఫాను సమయాల్లో రైలు ప్రయాణం ఎంత థ్రిల్లింగ్‌గా ఉంటుందో చెప్పింది.

డాక్టర్ దమ్ము శ్రీనివాసబాబు
రాంనగర్-500 048

బ్రహ్మాజీరావుగారి 'వాన- వరద' ఒక కొత్త ప్రయోగం అని చెప్పవచ్చు. మొత్తం నవలగా కాకుండా ఏ పాత్ర ద్వారా ఎంతవరకు అవసరమో అంతవరకు చెప్పిస్తూ ఎక్కడా లింకు తెగకుండా నడిపించిన తీరు చాలా బాగుంది.

ముఖ్యంగా నారాయణి పాత్ర చిన్నతనం నుంచి కష్టాలు పడినా, జీవితాన్ని ధైర్యంగా ఎదుర్కొని, ఆస్తి మొత్తం తనదైనా కూడా తల్లి, అన్నలను ఆదరించిన తీరు బాగుంది. అలాగే అన్నింటికి వాళ్ళకు పెత్తనం యివ్వకుండా తనదైన వ్యక్తిత్వాన్ని నిలుపుకొన్న తీరు రామదాసుని రక్షించడంతోనే తెలుస్తుంది. సంప్రదాయాల్ని ధిక్కరించి తన జీవితాన్ని బాగుచేసుకున్న తీరు ఎందరినో ఆలోచింపచేస్తుంది.

రామదాసుగా పేరు పెట్టబడిన శంకరం పాత్ర చివరివరకు కొంచెం అసంతృప్తికరంగానే ఉంది. చేసేది పెద్ద ఉద్యోగమే అయినా నారాయణి ఇంట్లో బట్టలు ఉతకడం, పాలు పితకడంలాంటి పనులకు సులభంగా అలవాటు పడడం కొంచెం కృతకంగా ఉన్నప్పటికి కథా గమనాన్నిబట్టి సర్దుకోవచ్చు

ఎప్పుడో చేసిన సహాయం గుర్తుంచుకొని సోములు వెయ్యి రూపాయలు కట్టడానికి ముందుకు రావడం అన్నింటికంటె హైలైట్.

మిగిలిన పాత్రలన్నీ కథ నడిపించడానికి పనికివచ్చినా అందరి జీవితంలోను అంతర్లీనంగా ప్రభావం చూపింది గాలివాన-వరద. మొత్తంమీద ఒక మంచి నవల చదివిన అనుభూతిని మిగిల్చింది.

–వేదుల సుధాకర్
హైదరాబాద్- 500 040.

## జీవన సౌరభం

***(తృతీయ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)***

**జూలై నెల చతుర నవల ఘండికోట**

## గతం- వర్తమానం

***(నాల్గవ బహుమతి రూ.50/– పొందిన సమీక్ష)***

**అనేక మామూలు పుస్తకాలు చదివిన తరు**

వాత ఓ మంచి పుస్తకం చదివామన్న తృప్తిని మనసుకు కలిగించేదే హృదయమంతా ఆర్ద్రతను నింపుతుంది. మానవ సంబంధాలలో డబ్బు, కులం, హోదా బలంగా పెనవేసుకున్న సమాజంలో రామదాసులాంటి పాత్రద్వారా మానవతా విలువల కొరకు అన్ని బంధాలను తృణప్రాయంగా తెంచుకోగలిగిన ఉదాత్తులనూ, రాజగోపాలంనాయుడు లాంటి వారిని సైతం నాయుడు బావలా మార్చివేసిన వెంకటలక్ష్మి పాత్రను, తన చుట్టూ ఉన్న వారు తనను దోపిడీకి గురిచేస్తున్నా ఆవేశకావేషాలకు లోనుకాకుండా తను నమ్మిన మార్గం వదలని పాత్రలో నారాయణిని... సృష్టించిన రచయిత బ్రహ్మాజీరావుగారు అభినందనీయులు. సంప్రదాయం మోటు కాదనీ, సంస్కారం చదువుకే పరిమితంకాదనీ సోములు, శర్మ, నారాయుడు వంటి వివిధ పాత్రలద్వారా మన ఆలోచనా గవాక్షాన్ని తెరిచి చూపిన రచయిత గత తరం ప్రసిద్ధుల నవలా సాహిత్యపు లోతులను గుర్తుచేశారనటంలో సందేహంలేదు. ఆ పుస్తకాలు చదివిన తరువాత చాలాకాలంవరకూ ఆ పాత్రలు, ప్రదేశాలు, సన్నివేశాలు, జ్ఞాపకాలు గుండెలో గుసగుసలాడుతూనే ఉంటాయి. అలాంటి పుస్తకాల కోవకే చేరుతుంది 'వాన-వరద' కూడా. గతంనుండి వర్తమానంలోకి, వర్తమానంనుండి గతంలోకి కథను నడిపించటంలో కొంచెం అస్పష్టత కానవచ్చినా కథనం ఆ లోపాన్ని కప్పిపెట్టగలిగింది.

**–యన్. రవీంద్రనాథ్**
హైదరాబాద్- 500 013.

## జీవనదుల ప్రవాహం

*(అయిదవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

జీవితంలో ఎదురయ్యే ఒడిదుడుకులకు ప్రకృతి విశ్వాసాలను జోడించి నడిపించగల్గిన ఉత్తమ రచయిత శ్రీ ఘండికోట బ్రహ్మాజీరావు. మనిషిలోని ఆర్ద్రత, స్వార్థం, అహంభావం, ఆప్యాయత, అనురాగాలను సమపాళ్లలో రంగరించి, ఆయా పాత్రల స్వరూప స్వభావాలను కథకనుగుణంగా మలచి నడిపించబడినందున విశిష్ట రచనా శిల్పంగా రూపొందిందీ 'వాన-వరద' నవల. సదాచార సంపన్నకుటుంబంలో పుట్టి, మానవతా దృష్టితో వైవాహిక జీవితంలో అడుగుపెట్టి స్వార్థపరులవల్ల మోసగింపబడి, మానసిక క్షోభననుభవించి, చివరకు కడచినది పీడకలగా భావించి, అందిన ఆసరాతో భావిజీవితాన్ని నందనవనంగా రూపొందించుకోవాలన్న ప్రయత్నంలో ఆత్మస్థైర్యంతో అడుగు ముందుకువేసిన కథానాయకిగా నారాయణి-

తన మంచితనంతో తోటివారివల్ల వంచింపబడి, గుణవంతురాలయిన భార్యను పోగొట్టుకుని, విధివశాత్తు అహంభావ పూరితురాలయిన మరో స్త్రీకి భర్తగా మారి ఆమె నిరాదరణను భరించలేనిస్థితిలో ఇల్లు విడిచి, ప్రకృతి సృష్టించిన ప్రళయంలో ప్రమాదవశాత్తు చావుతప్పి మతిస్థిమితం కోల్పోయిన జడపదార్థం శంకరం-

ఈ ఇరువురి సమాగమంలో అనన్యసామాన్యమైన ఆప్యాయతానురాగాలు పెనవేసి అనూహ్యమైన బంధం ఏర్పరచి సహజీవన సాంగత్యానికి దారితీసి, జీవన మధురిమలను చవిచూడగల అవకాశాన్ని అద్భుతంగా చిత్రించారు రచయిత.

గాలివానతో ప్రారంభమై వరదగా పరవళ్లు తొక్కి ఆశ్రమ వాతావరణంతో ప్రశాంతతను సంతరించుకుంది.

మనిషిలోని కామోద్రేకానికి ఉదాహరణనిచ్చిన, వితంతు వివాహ సమస్యల నుండి జన్మభూమి కార్యక్రమాలవరకూ ఔపోసన పట్టిన ఘనాపాఠి రచయిత యొక్క మంచి నవలను అందించి స్పందింపజేసిన చతురకు ధన్యవాదాలు.

**పెదపాటి గోపాలకృష్ణమూర్తి,**
విశాఖపట్నం-530 041

# చతురకతలు

## పేపర్లో పేరు

"ఏవండోయ్ ఇది విన్నారా!" అంటూ హఠాత్తుగా వినిపించిన కేకకి ఉలికిపడి వెనుదిరిగి చూస్తే మా పక్కింటి తాతగారు లోపలికి వస్తూ కన్పించారు.

ఏదో గవర్నమెంటాఫీసులో పనిచేసి రిటైరయి ఫించను తీసుకుంటున్నారు. పండగలకీ పబ్బాలకీ పిల్లలతో వచ్చిపోతుంటారు పొరుగూళ్లలో ఉన్న కొడుకులూ కోడళ్లూ.



అస్తమానూ ఏదో ఒక పని చెయ్యడానికి అలవాటుపడ్డ వాడేమో తీరిగ్గా కూర్చోరు. పనేంలేదు కనుక ఉదయం లేచిన దగ్గర్నుంచి రాత్రి పడుకోబోయే వరకూ ఏదో ఒకటి మాట్లాడుతూనే వుంటారు. తన జీవిత విశేషాలను సశేషాలతో కథలు కథలుగా చెప్తారు. అది కూడా ఒక కళే. వింటున్నంత సేపూ ఆయా సంఘటనల్ని కళ్లతో చూస్తున్నంత కమనీయంగా చెప్పడం చేతకాదు అందరికీ!

ఆయన చెప్పే మాటల్లో ఎంతో కొంత నిజం వున్నా అతిశయోక్తులు మాత్రం చాలా ఎక్కువగానే వుంటాయి. అయినా అవన్నీ పచ్చినిజాలే అన్నంత గొప్పగా చెప్పడం ఆయనకే చెల్లింది. ఆ సంగతి మాకు తెల్సినా ఆయన చెప్పే తీరులో గొప్పదనంవల్ల కాబోలు ఎంతో ఉత్సుకతతో వింటాం మేమంతా. ఎప్పుడూ చుట్టూరా చేరేవాళ్లు ఏ కారణంగానో రాకపోతే అప్పుడప్పుడు ఇలా మా వాటాల్లోకి దాడిచేస్తారు.

"రండి రండి'' అంటూ నవ్వుతూ ఆహ్వానించాను.

సోఫాలో కూర్చుంటూ "ఏమిటి మీరింకా ఇంటి దగ్గరే వున్నారు. ఆఫీసులేదా ఏం" అంటూ వాకబుచేసేరు.

"లేకేం కొంచెం బ్యాంకు పనివుంటే సి:యల్ పెట్టాను'' అంటూండగానే కిచెన్‌లో వున్న మా ఆవిడ కాఫీ తెస్తూ,

"ఏమిటీ... తాతగారి గాలి ఇటు మళ్లిందీ రోజు..." అంది నవ్వుతూ.

"ఏవుందమ్మాయ్ మీ ఆయన ఇంట్లో కన్పించాడు. కాస్సేపు కాలక్షేపంగా ఉంటుందికదా అని ఇలా వచ్చాను'' ట్రేలో వున్న కాఫీ కప్పుని అందుకుంటూ అన్నారు తాతగారు.

కాఫీ సిప్ చేస్తూ "ఈ రోజు పేపరు చూశారా సూర్యంగారూ!" అన్నారు.

"లేదండీ! ఈ రోజు ఖాళీయేగా మధ్యాహ్నం చూద్దామని ఊరుకున్నాను'' అన్నాను ఏమిటో విశేషం అనుకుంటూ.

"నా గురించి పేపర్లో వచ్చిందోయ్'' అన్నారు నవ్వుతూ.

"ఆహా! దేని గురించండీ. ఏమన్నా కవితలు గట్రా రాశారా ఏమిటి?" అడిగింది యశోద నా పక్కనే సోఫాలో కూర్చుంటూ.

"అదేం కాదమ్మా.. మొన్న శివరాత్రికి పట్టిసీమ వెళ్లానుకదా! మిమ్మల్ని రమ్మంటే రాలేదు''

"అవునండీ.. రాలేకపోయాము. అయితే అక్కడేమన్నా ఉపన్యాసాలిచ్చారా?" అనడిగాను నేను.

"అబ్బే ఉపన్యాసాలేం కాదోయ్. 'శివరాత్రికి రెండు లక్షల మంది భక్తులు పట్టిసీమవద్ద గోదావరిలో పుణ్యస్నానాలు చేశారు' అని రాశాడు పేపర్లో చూడూ. మరి నేనూ స్నానం చేశానుకదా!"

"ఆహా!" అంటూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకుంటూ నవ్వేశాం నేనూ యశోదా.

తాతగారు కొంటెగా మాకేసి చూస్తూ కాఫీ తాగసాగేరు.

-సూరిపండు

---

## మనం మనమే!

శాన్‌ఫ్రాన్సిస్కోలోని గోల్డెన్ గేట్ బ్రిడ్జ్‌మీద నడిచి వెళ్తున్న సుబ్బారావు కంటపడిందో యువతి ఆమె రెయిలింగ్ మీదకి ఎక్కి బ్రిడ్జ్‌మీంచి కిందకి దూకడానికి సిద్ధంగా వుంది.

"ఆగాగు... ఏం చేస్తున్నావు? " అడిగాడు సుబ్బారావు ఆమెని ఇంగ్లీష్‌లో.

"ఆత్మహత్య, నాకెవరూలేరు" బాధగా చెప్పిందామె కూడా ఇంగ్లీష్‌లో.

"ఎందుకలా అనుకుంటావు? అందరికీ దేవుడనేవాడుంటాడు. చూస్తుంటే నువ్వు నాలా ఏషియా నుంచి వచ్చిన దానివిలా కనిపిస్తున్నావు. ఏ దేశంలో పుట్టావు? " అడిగాడు సుబ్బారావు.

"ఇండియాలో" జవాబు చెప్పిందామె.

"నేనూ ఇండియానుంచే వచ్చాను. ఏ మతం నీది? " అడిగాడు.

"హిందూని"

"నేనూ హిందూనే. కాని నీ మొహం మీద బొట్టులేదే మరి? " అడిగాడు సుబ్బారావు.

"ఇక్కడికి వచ్చాక మతం మార్చుకుని



క్రిస్టియన్‌గా మారాను" చెప్పిందామె.

"నేనూ అదే పనిచేశాను. ప్రొటెస్టెంటా లేక కేథలిక్కా?" అడిగాడు.

"ప్రొటెస్టెంట్‌ని"

"నేను కూడా. అందులో ఏ శాఖ?"

"బాప్టిస్ట్‌ని"

"వెరీగుడ్. నేనూ బాప్టిస్ట్‌నే. నార్తరన్ బాప్టిస్ట్‌వా లేక సదరన్ బాప్టిస్ట్‌వా?"

"నార్తరన్ బాప్టిస్ట్‌ని"

"నేనూ అంతే. నార్తరన్ కన్సర్వేటివ్ బాప్టిస్ట్‌వా లేక నార్తరన్ లిబరల్ బాప్టిస్ట్‌వా?"

"నార్తరన్ కన్సర్వేటివ్ బాప్టిస్ట్‌ని"

"నేను కూడా అంతే. నార్తరన్ కన్సర్వేటివ్ ఫండమెంటల్ బాప్టిస్ట్‌వా? లేక నార్తరన్ కన్సర్వేటివ్ రిఫార్మ్ బాప్టిస్ట్‌వా?"

"నార్తరన్ కన్సర్వేటివ్ ఫండమెంటలిస్ట్ బాప్టిస్ట్‌ని" చెప్పిందామె.

"నేను కూడా సరిగ్గా అదే. నార్తరన్ కన్సర్వేటివ్ ఫండమెంటల్ బాప్టిస్ట్ ఆఫ్ గ్రేట్ లేక్స్‌రీజియన్‌కి చెందిన దానివా? లేక నార్తరన్ కన్సర్వేటివ్ ఫండమెంటల్ బాప్టిస్ట్ ఆఫ్ ఈస్టర్న్ రీజియన్‌కి చెందినదానివా?" ఉత్సాహంగా అడిగాడు సుబ్బారావు.

"నార్తరన్ కన్సర్వేటివ్ ఫండమండలిస్ట్ బాప్టిస్ట్ ఆఫ్ గ్రేట్ లేక్స్ రీజియన్‌కి చెందినదాన్ని" చెప్పిందామె.

"గ్రేట్ నేనూ అంతే! నార్తరన్ కన్సర్వేటివ్ ఫండమెంటలిస్ట్ బాప్టిస్ట్ గ్రేట్ లేక్స్ రీజియన్‌కి చెందిన కౌన్సిల్ చర్చ్‌కి చెందిన దానివా, లేక నార్తరన్ కన్సర్వేటివ్ ఫండమెంటలిస్ట్ బాప్టిస్ట్ గ్రేట్ లేక్స్‌రీజియన్‌కి చెందిన గార్డియన్ ఏంజిల్స్ చర్చ్‌కి చెందిన దానివా?"

"నార్తరన్ కన్సర్వేటివ్ ఫండమెంటలిస్ట్ బాప్టిస్ట్ గ్రేట్ లేక్స్ రీజియన్‌కి చెందిన గార్డియన్ ఏంజిల్స్ చర్చ్‌కి చెందినదాన్ని"

"అలాగా? అయితే మనం మనం ఒకటి కాదన్న మాట. నేను కౌన్సిల్ చర్చ్‌కి చెందిన వాడిని. మనం మనం ఒకటే అయితే నిన్ను ఆత్మహత్య నుంచి కాపాడుదామనుకున్నాను. ఇంకా చూస్తావే దూకు" అని సుబ్బారావు ఆమెని బ్రిడ్జ్ మీంచి తోసి కిందపడుతున్న ఆమెని చూసి 'మతభ్రష్టురాలా' అనుకున్నాడు.

**–డి. పద్మజ**

---

## ఫొటో క్విజ్

ఆ వారమూ ప్రతి వారం లాగానే హాట్ అండ్ స్వీట్ పత్రికలో ఫొటోక్విజ్ వుంది. పాత సినిమాలలోని స్టిల్ వేసి అది ఎవరిదో చెప్పమనే ఆ ఫొటోక్విజ్‌కి ఎంతో ఆదరణ లభిస్తోంది. ఫొటోక్విజ్‌లో పాల్గొనే వారు పత్రికలో కూపన్ కత్తిరించి పంపాలి కనుక హాట్ అండ్ స్వీట్ పత్రిక సర్క్యులేషన్ కూడా అంతో ఇంతో పెరిగింది. ఫొటోక్విజ్‌లో నెగ్గిన పాఠకుడికి నూట పదహారు రూపాయల యం.ఓతోపాటు హాట్ అండ్ స్వీట్ కాపీ కూడా పంపుతోంది.

సుబ్బయ్య ఆషామాషీగా ఆ వారం హాట్ అండ్ స్వీట్ పత్రిక తిరగేస్తూ ఫొటోక్విజ్ చూసినపుడు ఆ నూట పదహారు రూపాయల బహుమతి సుబ్బయ్యని మరీ మరీ ఆకర్షించింది. వెంటనే పత్రికలో కూపన్ కత్తిరించి జవాబూ తన చిరునామా రాసి కవర్‌లో పెట్టి పోస్ట్ చేశాడు.

మూడు వారాల తర్వాత ఫలితం పత్రికలో వచ్చింది. సరైన జవాబు రాసింది సుబ్బయ్య ఒక్కడే. మరో రెండు వారాల తర్వాత సుబ్బయ్యకి నూట పదహారు రూపాయల మనీ ఆర్డర్ వచ్చింది. ఆ నూట పదహార్లే సుబ్బయ్యకు లక్ష రూపాయలనిపించాయి.

ప్రతివారమూ హాట్ అండ్ స్వీట్ పత్రి



కలో ఫొటోక్విజ్ కి కరెక్ట్ ఆన్సర్ కనీసం వందమంది పంపుతున్నారు. లక్కీ విన్నర్ని లాటరీలో నిర్ణయించి బహుమతి మొత్తం ఒక్కరికే ఇస్తున్నారు. అటువంటిది సుబ్బయ్య ఒక్కడే ఆ వారం జాక్‌పాట్ కొట్టాడు!

ఇరవయి అయిదేళ్లక్రితం అంతంత మాత్రంగా ఆడిన ఆ సినిమాలో తండ్రి పాత్రలు ధరించడంలో కొంత పేరు తెచ్చు



కున్న నటుడి స్టిల్ అది. ఆ నటుడు అప్పట్లో ఇరవై అయిదు వాట్స్ బల్బ్‌లా వెలిగి కొన్ని చిత్రాల తర్వాత ఫేడ్ ఔట్ అయిపోయాడు. అందుకే సినిమాల గురించి అద్భుతమైన నాలెడ్జి వుండి, బొడ్డుకాని, బొట్టు కాని ఏది చూసినా సరే ఆ తార ఎవరో చెప్పగల ఈనాటి యువతరానికి ఆ వారం ఫొటోక్విజ్ అంతుచిక్కలేదు.

'హాట్ అండ్ స్వీట్' వారపత్రిక సినిమా సెక్షన్ ఎడిటర్ పూర్వాశ్రమంలో సినిమా తారలకు, సినిమాలకు పి.ఆర్.ఓగా పనిచేసి ఎంతో సినిమా సమాచారం, ఎన్నో పాత సినిమా స్టిల్స్ సేకరించిన వాడవడంతో హాట్ అండ్ స్వీట్ పత్రికకు ఎస్సెట్‌గా వుంటున్నాడు. ప్రతివారమూ పత్రికలో ఆసక్తికరమైన న్యూస్ ఇస్తూ ఫొటోక్విజ్ కండక్ట్ చేస్తూ సినిమా పేజీలకు కొత్త పాఠకులని సృష్టిస్తూ పత్రికకు మేలు చేస్తున్నాడు.

ఆ వారం ఫొటోక్విజ్‌ని సినిమా విభాగం ఎడిటర్ మరీ టఫ్ చేసేశాడు. అయినా సుబ్బయ్య ఎలా నెగ్గాడు? అని సందేహం వచ్చింది ఎడిటర్‌కు. ఆ మహానుభావుడిని ఇంటర్వ్యూచేసి ఫొటో తీసుకురమ్మని పంపాడు రిపోర్టర్ని.

సినిమాలలో ఇక చెల్లననుకుని మద్రాసు నుంచి తన స్వంత ఊరు వచ్చేసి పి.సి.ఓ, యస్.టి.డి. బూత్ పెట్టుకుని రోజులు నెట్టుకు రావడం ప్రారంభించాడట ఆ పాఠకుడు. అనుకోకుండా ఆ నటుడు ఆ వారం హాట్ అండ్ స్వీట్ పత్రికలో ఫొటోక్విజ్ చూసి అతి సులభంగా తనని గుర్తుపట్టి కూపన్ పూర్తిచేసి పోస్ట్‌చేసి ఏకైక కరెక్ట్ ఆన్సర్‌తో నూట పదహార్లు నెగ్గాడుట!

అదీ ఆ రిపోర్టర్‌గారి నివేదిక!

—తాజీ ప్రసాద్

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad Tel: 290328 Office Address: CHATURA Monthly, Eenadu Compound, Somajiguda. Tel. Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75291; Anantapur: 33777: Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur: 353942; Nellore: 331080

CHATURA Telugu Monthly Hyderabad- 500 482 Regd. No. H/HD/402-RNI/32186/78